# శ్రీమత్ భగవద్గీత
# ఆత్మ విచారణ



గ్రంథకర్త
సాధు సుబ్బయ్యా దాస్,
ఖండవల్లి, పోస్టు
కాపవరం.

మూల్యము : 2-0-0

# శ్రీమత్ భగవద్గీత

# ఆత్మ విచారణ



గ్రంథకర్త

సాధు సుబ్బయ్యా దాస్,

ఖండవల్లి. పోస్టు

కాపవరం.

మూల్యము: 2-0-0



గ్రంథకర్త

సాధు సుబ్బయ్యదాస్,

కాపవరం.

శ్లో॥ హృదయ కమల మధ్యే నిర్వి శేషం నిరీహం
హరి హర విధివేద్యం యోగిభిర్ధ్యాన గమ్యమ్
జనన మరణ భీతి భ్రంసి సచ్చిత్స్వరూపం
హిరణ్య గర్భాది స్థావరాన్తేషు శరీరేషు యదేకం
చైతన్య మస్తి తదేవాహ మస్మీతి దృఢ జ్ఞాన సిద్ధి
[illegible].

తా॥ చతుర్ముఖ బ్రహ్మ మొదలు స్థావరము వరకు గల శరీరముల యందు ఏ ఒకే చైతన్య మున్నదో అదే నేను అనెడి దృఢ సిద్ధి కలుగును గాక. దృఢ జ్ఞానము సంశయ విపరీతములు లేని జ్ఞానము.

# ఉపోద్ఘాతము.

శ్రీ దత్తాత్రేయ పీఠ పరంపరులు –

సకలమైన సాధువులకును ఆది నాధుడైన ఈశ్వరుడు అతని శిష్యులైన మత్స్యేంద్రి శాబర ఆనందభైరవి శౌరంగి మీనవాధ గోరక్షనాధ విరూపాక్ష వివేశయ మన్థాన ౖరవ సిద్ధి బుద్ధ కంధడి కోరంఠక సురానంద సిద్ధపాద చర్పటి కానేరి పూజ్యపాద నిత్యానాద నిరంజన కపాలి బింధునాధ కాక చండీశ్వర అల్లామ ప్రిభుదేవ ఘోడా చోలీ టింటిణీ భానుకీ నారదేవ ఖండ కాపాలికాది శిష్య గోపాలదాస్, గోపాలదాస్ శిష్య బ్రహ్మచారి, బ్రిహ్మచారి శిష్య సాధూ రాం, సాధూరాం శిష్య కోరుకొండ మఠాధిపతి హఠయోగి అప్పారావు, హటయోగి అప్పారావు శిష్య పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకా కాపవరం గ్రామ నివాసి సాధు సుబ్బయ్యదాసు రచించిన "శ్రీమత్ భగవద్గీత" శ్రీకృష్ణార్జున సంవాద రూపము తత్వ విచారణములో వ్రియబడినది.

అయ్యా! మహా భక్తులారా! తను కొక మనవి:

మహా భక్తులకు, సాధువులకు, జ్ఞానులకు, యోగులకు, యతీశ్వరులకు సాంఖ్య, తారక, అమనస్కములు తరుచువారి కిని యావన్మందికి శిరఃసాష్టాంగ నమస్కారములు చేసి వ్రాయ బడినది. శ్రీమత్ భగవద్గీత శ్రీకృష్ణార్జున సంవాద తత్వ విచా రణ రూపమున స్త్రీలకు, పురుషులకు బాల బాలికలకు తేటగా

తెలియుట కొరకు అంతరార్థముతో ఈ పొత్తమును పదు
నెనిమిది అధ్యాయములు వ్రాసి యున్నాను. నేను గొప్ప
విద్యార్థిని గాను. గొప్ప పండితుడను గాను. గాన దీనియందు
అనేకమైన తప్పులు యుండవచ్చును. పిల్లలు చేసిన తప్పులు
తండ్రులు ఏవిధముగా దిద్దుదురో ఆప్రకారముగా నేను మీకు
అందరికిని పుత్రుడను. గనుక యిందేమైన తప్పులున్నచో
క్షమించి తెలిపిన తరువాత ముద్రణలో సరిదిద్దుకొందును.

ఆర్యులారా! నా గురుస్వామి మహాయోగి అప్పారావు
గారికి త్రికరణశుద్ధిగా యీ చిన్న గ్రంథమును వారి పాదము
లకు మంత్రపుష్పముగా సమర్పించితిని.

ఇట్లు భక్తజను,
సాధు సుబ్బయ్య దాస్.

# విషయసూచిక



# శ్రీ కృష్ణార్జున సంవాదము

## అర్జునుని విషాదయోగము

ఒకటవ అధ్యాయము

ధృతరాష్ట్ర ఉవాచ:—

లోభగుణ మనే ధృతరాష్ట్రుడు బుద్ధి యనే సంజయునితో ప్రశ్నించు చున్నాడు:—

ధృత:— ధర్మక్షేత్రమను (అనగా) సహస్రారమను కురుక్షేత్రమున (కూడి అనగా) వెంట్రుకలు, సత్యం, అసత్యం మధ్య అజ్ఞానవృత్తులైన కౌరవులు, జ్ఞానవృత్తులైన పాండవులు. వీరు ఉభయులు ఏమి చేసిరి ?

సంజయ ఉవాచ:—

అధోలోకములు 7, ఊర్ధ్వలోకములు 7. ఈ పదు నాలుగు లోకములకు అధిపతియైన లోభగుణమనే మహారాజా నీపుత్రుడైన క్రోధ గుణమనే దుర్యోధనరాజు అసూయగుణ మనే దృష్టద్యుమ్నుచే (అనగా) నాది, నీది అనే వ్యూహా కారముగ ఏర్పరచిన జ్ఞానవృత్తులనే పాండవులను జూచి జ్ఞాత, జ్ఞేయ, జ్ఞాన స్వరూపులైన ధనుర్విద్యా గురుండగు సత్వగుణమనే ద్రోణాచార్యుని యొద్దకు బోయి పరితపించెను (అనగా) సంభాషించెను.

దుర్యోధను ఉవాచ:—

అజ్ఞానవృత్తులకు, జ్ఞానవృత్తులకు సమిష్టి భావముతో యున్న ద్రోణము (అనగా తూము) గురువర్యా ఆనందమనే సముద్రమునందు జ్ఞానవృత్తులనే తెప్పలను జూడుము. ఆ తెప్పలయందు 25 తత్వములతో యిమిడియున్న అహంకారమనే భీముడు, వాయుభూతమైన మనస్సనెడి అర్జునులతో శ్రీకృష్ణయన పరమాత్మ యనే నిరామయుడున్నా, నిరామయమనే నేత్రదృష్టియే సాత్యకి, ధర్మమనే విరాటుడు, సందేహములనే ద్రుపదుడు, నపుంసక స్వరూపమైన తమోగుణమనే దృష్టకేతువు, ఆచారమనే చేకితానుడు, సోహం, హంసో, హం అనే సాకారమే కాశీరాజు, సమానవాయువనే పురజిత్తుడు. వ్యానవాయువనే కుంతిభోజుడు, వుదానవాయువనే శైభ్యుడు, ప్రాణవాయువనే యుధామన్యుడు, అపానవాయువనే వుత్తమోజుడు, వైరాగ్యమనే అభిమన్యుడు వీరుగాక ద్రౌపది పుత్రులు 5 మందియును, (వారు ఎవరనగా) 1 సువాసన, దురవాసన నెరిగెడి పృధివిగుణము, 2 ఆరురసములు గుర్తించే జలగుణము, 3 తాకుట, కదలుట, స్పర్శగుణము, వాయువు, 4 రూపములు గుర్తించే నగ్నిగుణము, 5 శబ్దమును గ్రహించే నాకాశగుణము వీరు నైదుగురును ముక్తికాంతయనే ద్రౌపతి పుత్రులున్నా, యింకా సప్తజ్ఞానభూమికులనే సేనలు, మహారథికులు గలరు.

ద్రోణాచార్య ఉవాచ:—

జ్ఞానవృత్తులనే పాండవ సేనయందు నీచే (అస్రా) అనర్థం, అనాచారం, అశ్రిద్ధ యీ మూటిచే పేర్కొనబడు మహావీరులు యున్నారని నాకు తెలియును.

దుర్యో:— ఆత్మానాత్మ తరచడమే యుద్ధమున రజో, తమో గుణములు లేనట్టిదే జాగ్రిత్తను జూచితిని. యిక మన అజ్ఞానమనే కౌరవసైన్యములో ధీరులను చెప్పు చున్నాను వినుము: 1 బ్రహ్మస్వరూపమైన ద్రోణము మీరున్ను, పంచతన్మాత్రాధిపతి, 2 దసేంద్రియాధిపతి భీష్ముడున్ను 3 మనస్సనెడి కర్ణుడున్ను, 4 విశుద్ధ చక్రమునందు కృష్ణంపాతీతి కృపః అనగా నల్లని నెత్తురును యెరుపుగా మారగడమే కృపాచార్యులును, 5 అహంకార స్వరూపమైన అశ్వద్ధాముడున్ను, 6 బుద్ధి యనే శల్యుడు అనగా మేకు, మనస్సనే కర్ణునకు సారధి, మిగతా వున్న అజ్ఞానవృత్తులనే వికర్ణ, భూరిశ్రివుడు, జయదదుృడు గొప్ప శూరులున్నారు.

ద్రోణ:— క్రోధ గుణమనే దుర్యోధన మహారాజా! నీలో యున్న మలినము పోగొట్టుకుంటే నాకు మహా సంతోషము.

దుర్యో:— ఆచార్యా నా అజ్ఞానవృత్తులను నశింప జేయుము. దీక్ష యనెడి జ్ఞానవృత్తుల చూడుము. 25 తత్వ

కూడుకున్న అహంకారమనె భీముడు, త్వాగేంద్రి
యము అనగా చర్మము, జ్ఞానవృత్తులనే పాండవసైన్యమును
యంతజాగ్రతచేయుచున్నాడో చూడు. దసేంద్రియాధి పతియైన
భీష్ముడను రక్షింపబడుటకు మన అజ్ఞానవృత్తులనేసైన్యమును
జాగ్రత, మహా జాగ్రత, స్వప్న, మహా స్వప్న, సుషి ప్తి,
మహా సుషు ప్తి బీజ జాగ్రిములనే ఆయుధములను అనగా
రణ, కౌశలమును ధరించుటలేదు. ఓయి అజ్ఞానవృత్తులారా
మన అజ్ఞానమనే సేనకు దశేంద్రియాధిపతి భీష్ములవారికి
ఆత్మా నాత్మా తరచడమే రణరంగము లేక యుద్ధము.
మీరు పై భాగమున కాపాడుచుండవలయును. కురువృద్ధుడు
అనగా కురు– వెంట్రుకలు. వృద్ధుడనగా నల్ల వెంట్రుకలు
నలుపు పోయి తెల్లగా యుండునో ఆమాదిరే మహాశుద్ధ
తెల్పు జ్ఞానము. అదే ముసలితనము. భీష్ముడు క్రోధగుణము నే
దుర్యోధనునకు ఆగుణము నశింపుచేయించాలి యనేభావమున
మహా ఆనందమనే వుల్లాసముతో మూలాధారము బంధించి
వుడ్యాణంలాగి జాలంధరచేత చుక్కను చూచుచూ ఓం అనే
ప్రణవనాధము అనే శంఖమును పూరించెను. అప్పుడు అజ్ఞాన
వృత్తులనే కౌరవ సైన్యములు ఒక్కసారిగా అనగా మూలా
ధారం, వుడ్యానం, జాలంధర యీ మూడు బంధనలుచేత
అజ్ఞానవృత్తులనే చంచలము, భయం, లజ్జ, మోహం, దప్పి,
ఆకలి యివి ప్రణవమనే ఓంకారములో ఒక్కసారిగానే

సహ:— సహసహదేవుడు యిడానాడి యగుటచే శ్వాస పూరించుటచేత మణిపుష్పకమనే శంఖమును పూరించెను.

కాశీ:— ఆగ్నేయస్థానం కాశీ, కుంభకం నిలుపుటవలన కాశీరాజు ప్రణవధ్వని యనే శంఖమును పూరించెను.

దృష్ట:— దృష్టద్యుమ్ము లనగా ప్రాణవాయువు అపాన వాయువు. ఈరెండు ఒకటిగా కలియునదియే యజ్ఞము. అనగా అగ్ని, దానియందు పుట్టినవాడు దృష్టద్యుముడను నామము పొంది దుర్ణియనే శంఖము పూరించెను.

దృప:— దృపదరాజు పంచప్రాణములు 5, ఉపవాయువులు 5. యీ పది వాయువులు కూడికయే దృపదయనె నామము పొంది సత్యం, శాంతం నిలుపుటయే శంఖము పూరించుట.

అభి:- వైరాగ్యమనే పట్టుదల అభిమన్యుసి పేరు పొంది ఓర్పు గలిగియుండుటయే శంఖము పూరించుట.

అర్జు:— జీవుడనే అర్జునుడు. అజ్ఞానవృత్తులనే కౌరవ సైన్యమును జూచి వూర్ధ్వ దృష్టిచేత అనగా ఆగ్నేయస్థానమందు చూపు నిలిపి ధనస్సు ఎక్కుబెట్టి సాకారము, నిరాకారములో గలిపి సచ్చిదానంద స్వరూపమనే శ్రీకృష్ణునితో యిట్లనియె. ఓ నిరామయా, కృష్ణా అజానవృత్తులనే కౌరవులకును, జ్ఞానవృత్తులనే పాండవులకును నాశరీరమనే రథమును

మధ్య నిలువుము. కారణమేమనగా చెప్పెద వినుము. సత్యమే తల్లి, జ్ఞానమే తండ్రి. యీ పిత్రార్జిత ఆనందమనే రాజ్యము అసూయగుణమనే అసత్యముచేత అనగా క్రోధ గుణమనే దుర్యోధనునకు సహాయము చేయ నరుదెంచినవారు ఎవరో వారల జూచెదను.

కృష్ణ:— రథమును రెండుసేనల నడుమ భీష్మ, ద్రోణ మహావీరుల యెదుట నిలిపి అర్జునా కౌరవసేనను జూడుము. శరీరమనే రథమును రెండు సేనల నడుమ అనగా యోగా భ్యాసకుడు ఆధారస్థానముననున్న విశుద్ధ మధ్య అనాహత యందు జాలంధర ముద్రయనే మధ్యస్థానం నిలిపెను. అట్లు నిలిపి దశేంద్రియాధిపతి ఇంద్రియ నిగ్రహము గలిగిన భీష్ము లను జూచి ద్రోణము అనగా మూత్రము యొక్క స్థానము బంధించిన బ్రహ్మస్వరూపమనే ద్రోణాచార్యులను జూచి మిగతా అజ్ఞానవృత్తులనే కౌరవ సైన్యములను జూచెను.

అర్జు:— జీవుడనే అర్జునుడు అజ్ఞానవృత్తులనే కౌరవు లను జూచి దమను గెలువలేక అనగా బాహేంద్రియ నిగ్ర హము లేక మమను బొంది అనగా భ్రాంతిలో నిక్కమైన తత్వ జ్ఞానము లేక రాగ ద్వేషాదులకు లొంగినవాడై అనగా రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, డంబము, దర్పము, అహంకారము వీటికి లొంగి యీ మూడు త్రయములనే బంధన

లకు చిక్కబడి అనగా ధారేషణ, ధనేషణ, పుత్రేషణ పంచ క్లేశములకు దొరికినవాడై అనగా అవిద్యాక్లేశము, అభినవ క్లేశము, అస్తిగతక్లేశము, రాగక్లేశము, ద్వేషక్లేశము ఇవి యును గాక సప్త అజ్ఞానభూమికలతో గూడినవాడై అనగా బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, సుషుప్తి జీవుడనే అర్జునుడు ఈబంధువులనుజూచి మోహభ్రాంతిని జెందినవాడై అనగా ఈజీవుడు కొన్ని రోజులుపైన వ్రాసి యుండు బంధు వులలో శ్వేచ్ఛగా కలిసిమెలిసి యున్నవాడు గనుక ఆ మమ కారమే జీవునకు బాధలు కలిగించెను. అప్పుడు మాధవా కృష్ణా పైన చెప్పబడిన గుణములే నా బంధువులు. వారిని జూడక 72 వేల నాళ్ళ యొక్క బలము తగ్గెను. నిశ్చింత స్వరూపమనే జ్ఞానము తగ్గి శక్తి హీనములగుచున్నవి. సత్య మనే నోరు ఎండిపోవుచున్నది. ఆత్మ తల్లడిల్లుచున్నది అనగా చంచలం హెచ్చు ఆయెను. దేహము కంపించుచున్నది. అనగా శరీరమనే రథము వణకు కలిగెను. గాండీవము అనగా ధనస్సు వైరాగ్యమనే హస్తము నుండి జారి క్రింద బడిపోవు చున్నది. అనగా వైరాగ్యమనే పట్టు తొలగిపోయినది. శరీర మనే రథము మంటలు కలుగుచున్నవి. అపశకునములు యెన్నియో చూచుచున్నాను. అనగా ఈ పాంచ భౌతిక శరీ రములో సంకల్ప, వికల్పములనే అనర్థములు కలుగుచున్నవి కృష్ణా!

కృష్ణ:— ఆ యనర్థ సూచకములు అజ్ఞానవృత్తులనే కౌరవులకని దలంచరాదా, అర్జునా; కృతయుగ, త్రేతా యుగ, ద్వాపర, కలియుగ యీ నాలుగు చేరి యొక మహా యుగము. అటువంటి యుగములు 12 చేరితే ఒక కల్పము. అటువంటి కల్పములు 12 చేరితే మహా ప్రళయములని తెలియవలయును.

అర్జు:— హే మాధవా! ఈ కనబడు చరాచరాత్మకంబగు స్వరూపమే ప్రకృతికి ఆధారం. దీనిలో పదునాలుగు భువనములు గూడ యిమిడియున్నవి. అవి యేవనగా అధో లోకములు 7. అతల అరికాళ్లు, వితల పైపాదము, సుతల మడిమలు, తలాతల పిక్కలు, రసాతల మోకాళ్లు, మహాతల తొడలు, పాతాళము గుదము. ఊర్ధ్వలోకములు 7. భూలోకము ఆధారము, భువర్లోకము స్వాధిష్ట, సువర్లోకము నాభిస్థానము, మహర్లోకము అనాహత, జనర్లోకము కంఠం, తపోలోకం లలాటం, సత్యలోకం శిరస్సు లేక సహస్రారము యీ లోకములలో యున్నవారు గూడ సహించరే యుద్ధము చేయుటకు కృష్ణా!

కృష్ణ:— జీవుడ యీ స్థూలాంగమే ఘటము. సూక్ష్మాంగమే చల్ల చిలుకు కవ్వము. సూక్ష్మాంగమనే కవ్వములో తరచినయెడల జ్ఞానమనే వెన్న దొరకును.

అర్జు:- అచ్యుతా! నవనీతము గూడ ఆశించను మాధవా.

కృష్ణ:- వెన్న ఆసించిన యెడల నెయ్యి సారము ఎట్లు లభించును జీవాత్మా!

అర్జు:- నెయ్యి సారమేగాదు; పంచామృతము లిచ్చిన నాకు వలదు, హే పుండరీకాక్ష!

కృష్ణ:- హే పార్థా; 25 తత్వములతో కూడిన యీ స్థూలాంగమె రాజ్యము. యీ రాజాంగములో యున్న అజ్ఞానమనే పెంటపోగులు కాల్చి భస్మము చేసినట్లయితె అప్పుడు నిర్మలమైన బ్రహ్మానందమె సుఖము దొరుకును. నీవు అనుభవించగలవు.

అర్జు:- ఆబ్రహ్మానందమనే సుఖము గూడ నాకు వలదు. హే నారాయణా!

కృష్ణ:- ముక్తికాంతతో గూడి రతి సల్పుచు మహా నందమనే సుఖమును వలదనుటకు నీవెంత అజ్ఞానుడవు ఫల్గుణా!

అర్జు:- యీ స్థూలాంగమనే రాజ్యము వలనను అశాశ్వత మనెడి భోగముల వలనను ఏమి ప్రయోజనము? సచ్చిదానందస్వరూపా అజ్ఞానవృత్తులనెడి కౌరవులను జంపుట వలన యే: : వ లాభములేదు.

కృష్ణ:— పూర్వము హృదయకమలమనె లక్క యింటి లో జ్ఞానవృత్తులనే పాండవులు నివసించి యుండగా క్రోధ గుణమనే దుర్యోధనుడు ప్రేరేపణచేత రజోగుణమనే అగ్ని చే గాల్పించిరి. త్వగింద్రియ భూతము, 25 తత్వములతో, గూడిన భీమునకు తమోగుణముతో, జనించిన అసూయ గుణము. యీరెంటిచేత పైత్యవికారములు పుట్టించుటయే విషముపెట్టిరి అర్జునా! ఇదిగాక జ్ఞానవృత్తులనే పాండవులను జంప బూనియున్నారు. జ్ఞానవృత్తులనే నిరాకారమే అన్యా యముగా అపహరించిరి. సప్త జ్ఞాన భూమికలు యనే మీా ధనము మింగిరి. సమాధిలో నున్నప్పుడు సనకోటి సూర్య కాంతి ప్రకాశముతో వెలుగుచున్న బింబ స్వరూపమే ద్రౌపది. ఆ ద్రౌపది అజ్ఞానవృత్తులనే కౌరవులు చలనముచే బింబ స్వరూపమును చీకటి గావించుటయే ద్రౌపదిని మాన భంగము చేయుట. ఇటువంటి అసూయపరులు వీరు, అర్జునా!

అర్జు:— నిరంజనా! అసూయపరులు, నీచులు, దుష్టులు, అహింసకులు, కిరాతకులు, పాపాత్ములు అని నీవే ఒప్పుకొంటివి. అటువంటి అనర్థములను సంహరించుట ఇంకా ఎక్కున పాపము కదా పేం ప్రద్యుమ్న!

కృష్ణ:— అయితే అజ్ఞానవృత్తులనే కౌలవులను జంపెద నని జ్ఞానమనే పురుషత్వము నొంది ఇప్పుడు అజ్ఞానమనే స్త్రీ రూపము నొందుచున్నావే ఎందుకొచ్చితివి?

అర్జు:- పూర్వము శుక్ల శోణితములచే గూడినప్పుడు అణువు స్వరూప మయిన బీజమునందు ఏలాటి ప్రకృతి వికారముచేత అనగా ఆ బీజము జాగ్రములో చేరలేదు గనుక అప్పుడు వికారము లేదు. కొద్ది రోజులకు బీజమనే జీవుడు జాగ్రమనే మాయతో గూడినప్పుడు ఈ అజ్ఞాన వృత్తులు స్నేహమాయెను హే పుండరీకాక్షా.

కృష్ణ:- కిరీటి ఆ స్నేహమే వదలిపెట్టుమని పరమాత్మ యనే శ్రీకృష్ణుడు జీవునకు జెప్పుచున్నాడు.

అర్జు:- హే దామోదరా! బీజము నేను ఏమి చేయుదును? ఈ అజ్ఞానవృత్తులనే స్నేహితులందరు నన్ను బాధించుచూ యున్నారు. బీజ వంశమునందు పుట్టిన అజ్ఞానవృత్తులను సంహరించుట అధర్మమని నా భావము.

కృష్ణ:- జ్ఞానము, అజ్ఞానము. యీ రెండు కులములు యీ రెంటిలో అజ్ఞానమనే కులము సంహరించుట చాలా ఉత్తమ మయిన పని అని నా భావము.

అర్జు:- నవనీతచోర యుద్ధమనగా గానుగవంటిది. గానుగలో నలుగుచున్న పప్పు మాదిరి. ఆత్మానాత్మ తగచడమే యుద్ధము. అందువలన వంశ పారంపర్యముగ అనేక జన్మములనుండి వచ్చు సంచితార్థములనే ధర్మములు నశించును.

కృష్ణ:— జీవా! నీను చెప్పెడి విషయములు గమనించక ధర్మములు అధర్మములు నీకేల?

అర్జు:- ధర్మాభివృద్ధివలన సంరక్షించి హద్దులో నుంచు భర్తలు లేనందున స్త్రీలు వ్యభిచారవృత్తి నవలంబింతురు. ఇదిగాక అధర్మాభి యనే అసత్యమును ధర్మమనే పురుషులు లేనందున చలనమనే గుణామే స్త్రీలు. సత్యమనే హద్దు దాటుటయే వ్యభిచారముగదా ఏం కృష్ణా!

కృష్ణ:— చలన గుణమనే స్త్రీలతో నీకు ఏమి పని పార్థా!

అర్జు:— శుద్ధ సత్వగుణమనే తెలుపు రజోగుణమే ఎరుపు, మిశ్రమ గుణమే ఆకుపచ్చ, తమోగుణమే నలుపు తెలుపు, ఎరుపు, మిశ్రమ, నలుపు యీ వర్ణములు ఒకటితో నొకటి కలిసి వర్ణ సంకర దోషములు గలుగుచున్నవి

కృష్ణ:— నీవు చెప్పినదంతా సాకారము గనుక నిరాకారుడనప్రకమున్న.

అర్జు— పై గుణములకు అనూయ, అజ్ఞానవృత్తులకు నేనే నియామకుడను.

కృష్ణ:— అర్జునా! నీవు తుర్యాతీతుడవైనట్టి సమాధానము చెప్పుచున్నావే?

అర్జు:— నా పాండిత్యము ఇందేమియు లేదు. పెద్దల

వలన వినిన విషయముల జెప్పితిని.

కృష్ణ:— పెద్దలనగా ఎట్టివారు?

అర్జు:— సత్యం, శాంతం, ఓర్పు, దయ, తపస్సు, అహింస, ఆచారము ఈగుణములే పెద్దవారు.

కృష్ణ:— భూతకాలమునకు ముందు అనగా మనసనే బీజము. జాగ్రమనే మాయతో గూడిన యెడల యీకష్టములు సంభవించునేమో యని నీకు యోచన కలుగలేదు. గనుక ఇప్పుడు ఆ మాయను సంహరించడము తప్పదు.

అర్జు:— అనిత్యమైన సంపదలు అజ్ఞానవృత్తిచే గలిగిన భోగములు అనే బంధువులను జంపను నేనెంతటివాడను మాధవా!

కృష్ణ:— జీవుడనే అర్జునా నీవు నేత్రమనెడిజ్ఞానమును మూసుకొని బల్కుచున్నవాడవు. అజ్ఞానవృత్తులనే శాగస్రులు నిన్ను జంపుదురు.

అర్జు:— పంచక్లేశములనే ఆయుధములు బూని అనగా రాగ, ద్వేష, క్రోధిని, అభినివేశ సమాధానమనే యివియే ఆయుధములు. వాటిచే నన్ను చంపినప్పటికిని నాకు జయమే యని శరశాపముల విసర్జించి అనగా వైరాగ్యమనే బాణ మును దీక్షయనే పట్టు వదలినవాడై దుఃఖితుడై అనగా సప్తవ్యసనములనే ఏడు సముద్రములు ఉప్పొంగి శరీరమనే రథము ముంచివేసెను.

# సాంఖ్యా యోగము

## రెండవ యధ్యాయము

కృష్ణ:— పంచక్లేశములతో గూడిన అనగా దుఃఖముతో కూడిన జీవుడనే అర్జునుని గాంచి అజ్ఞానవృత్తులను చలించనివాడా మోహమనే భ్రాంతి నీకేల కలిగెను? మోహమనగా నావారు అనుటయే మోహము పదునొకండు అక్షౌహిణుల జూచి అనగా భయము జెందితివా యేమి? అనగా ఆత్మా నాత్మ తరచడమే. యుద్ధమునకు లెమ్ము పార్థా!

అర్జు:— హే నిరాధారా! పైన చెప్పబడిన పదకొండు అక్షౌహిణుల సైన్యము వివరము తెలుపుము.

కృష్ణ:— సంజ్ఞానము, అజ్ఞానము, విజ్ఞానము, ప్రజ్ఞానము, మేధ, దృష్టి, దృతి, మతి, మనీష, జూతి, స్మృతి యీ పదకొండు అక్షౌహిణి సైన్యములు అర్జునా.

అర్జు:— కృష్ణా పదకొండు అక్షౌహిణుల చేయుపనులు తెలుపుము.

కృష్ణ:— సంజ్ఞానమనగా అంతఃకరణముననుండు సకల శరీరమునందు వ్యాపించెడి వృత్తి. అజ్ఞానమనగా ఈశ్వర భావము పాలించు స్థితివృత్తి. విజ్ఞానమనగా కళాది పరిజ్ఞానము. 60 నాడులు కళలు వలన బుట్టిన లోక సంబంధజ్ఞానము

ప్రజ్ఞామనగా తెలిసికొనుట తత్కాలము గోచరించు వృత్తి. మేధయనగా గ్రంధధారణ సామాన్యవృత్తి. దృష్టియనగా ఇంద్రియముల మూలముగా సమస్తమును తెలిసికొనుట. ధృతియనగా శరీరేంద్రియములు కృశించి యున్నప్పుడు శరీరమును ధరించెడి ధైర్యవృత్తి. మతియనగా మననము లేక ఆలోచించుట. మనీషయనగా మనస్సు యందలి స్వాతంత్రము సకల కార్యములను స్వతంత్రముగా నాలోచించుట. జూతి యనగా మనస్సునకు రోగాది దుఃఖిత్వభానము. స్మృతియనగా అనుభవించినదానిని స్మరించుట, ఇదే స్మరణమనబడును.

అర్జు:— ఓ మాధవా! దశేంద్రియాధిపతియగు భీష్ములును పంచతన్మాత్రాధిపతియగు ద్రోణుడను పట్టు యనెడి కఱకు రజోగుణమనే బాణముతో నేనెట్లు కొట్టుదును?

కృష్ణ:— జీవుడనే పార్థా! దశేంద్రియాధిపతియైన యనగా సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన, శ్రోత్ర, త్వక్కు, శక్షు, జింహ్వా, ఘ్రాణ యీ పది ఇంద్రియములకు అధిపతియైన భీష్ములును, పంచతన్మాత్రాధిపతియైన అనగా శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధములకు అధిపతియైన ద్రోణుడు వీరి వద్దనుంచి నిరంజనమై యుండు ఆవస్తువు జలమువలె ప్రకాశించుచున్నది. అందుండి అహంకారము కలిగినది కనుక, యోగమునందు జ్ఞానేంద్రియములైదున్ను, పంచప్రాణము లైదున్ను, పంచతన్మాత్రలైదున్ను ఇవి బంధించుటయే

అనగా సంకల్పములతో యుండుటయే బంధనము.

కృష్ణ:— ఆత్మానాత్మ తెలియక యుద్ధము చేయ పోవుటయే ఉత్తమని యెంచితివా?

అర్జు:- లేదు కృష్ణా! యుద్ధమొనరించుటయా? విరమించుటయా యని యాలోచించుచున్నాను. నాకేది శ్రేయము నైన గాని దానిని బోధింపుము. పోనిమ్ము, యుద్ధము చేసెదను. జయ మెవరికి కలుగునో జయము నాకే కలుగునని దృఢముగా జెప్పిన తప్పక యుద్ధము చేసెదను.

కృష్ణ:— జ్ఞానేంద్రియములలో, జిహ్వా దానికధిపతి ఇంద్రుడు. వానికుమారుడు జిహ్వా. నాలుకయనే యర్జునా నేను చెప్పెడి విషయములు ఆలోచింపుము. అజ్ఞానవిషయము లన్ని అశాశ్వతము. జ్ఞానవిషయములు శాశ్వతముగనుక నీవు జ్ఞానవృత్తియే పుష్పము. పుష్పములోయున్న సారమే బ్రహ్మస్వరూపము. ఆస్వరూపము ఎట్టిదో తెలియుటయే నిశ్చల తత్వము. అదియే జీవన్ముక్తి.

అర్జు:—అచ్యుతా! అజ్ఞానవృత్తులనే కౌరవులకా లేక జ్ఞానవృత్తులనే పాండవులకా జయము?

కృష్ణ:— చంచలస్వరూపా! అర్జునా జయమనగా ఇంద్రియాదులను బంధించి అజ్ఞానవృత్తులను నశింపజేసి అష్టాంగ యోగములు, వ్రతములు సల్పి, సాధన చతుష్టయములనే

చీకటి బంధుత్వం యెందుకు నిరంజనా? నీవు జీవుడనే శిష్యుడను జ్ఞాననేత్రము లేక చీకటి యనే దుఃఖములో మునిగి యున్నాను. నీవు తప్ప రక్షించువారు వేరు లేరు. నీవే పురుషుడవు, నేనే స్త్రీని. నాతప్పులు క్షమింపవలయును.

కృష్ణ:- జీవుడా! దశేంద్రాధిపతియైన భీష్ముని గురించి పంచతన్మాత్రాధిపతియైన ద్రోణుని గురించి దుఃఖించితివి. గుప్తయనె రహస్యము తెలియక అనగా సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన, శ్రోత్ర త్వక్కు, శక్షు, జింహ్వా, ఘ్రాణ, ఈఇంద్రియాదులకు అధిపతి భీష్ముడు, వీటిని జయించడమె యుద్ధము, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము, వీటికి అధిపతి ద్రోణుడు వీరు అజ్ఞానవృత్తులనే కౌరవులకు వీరి వల్ల చాలాబలము గనుక, యోగముచేత జెప్పిన పదిహేను ఇంద్రియములు జయించినట్లయితె అజ్ఞానవృత్తులనే కౌరవులను సునాయాసముగా జయించవచ్చును, యీరహస్యములు తెలియక వేదవాక్యములు బల్కుచుంటివి. స్థూలమునకు, సూక్ష్మమునకు, రెంటియొక్క గుణ తెలిసినవారు గతించిన వారలగూర్చి గాని, అనగా అజ్ఞానమునకున్నూ, బ్రతికి యుండు వారలగూర్చిగాని, అనగా జ్ఞానమునకున్ను సముులై యుందురు.

అర్జు:- దుఃఖించుటదోషమా, అనగా, ఈపాపములో యుండుట దోషమా;

కృష్ణ:— ఎవనిరిగూర్చి దుఃఖించితివి, దశేంద్రియాధిపతి భీష్ములును, పంచతన్మాత్రాధిపతి ద్రోణుడు త్వక్కు అనే దేహములు శాశ్వతములని దుఃఖించితివి. అట్టులైన నీతాతతండ్రులు యేరి, అనగా పంచభూతములు కూడికయే నీతండ్రులు, పంచభూతముల కూటస్థుడే నీతాత. వారందరు ఏమైరి?

అర్జు:— హేమాధవా! ఈస్థూలాంగముపై యున్న చర్మమనే త్వక్కు అశాశ్వతమైయున్నది. ఈచింతనాకేల యిట్లు కలిగెను.

కృష్ణ:— వేదవాక్యములు పల్కితివే అనగా పంచభూతములతో కూడినది ఈశరీరము.

అర్జు:— శరీరముయొక్క గుణ వంశములు దెల్పుము మాధవా?

కృష్ణ:— కఠిన మైనది పృథివి, ద్రవమైనది అప్పు, వుష్ణ మైనది యగ్ని, చంచరించు స్వభావము వాయువు, ద్వారము కలది ఆకాశము ఇదిగాక జ్ఞానేంద్రియములు ఆకాశవంశం యీ ప్రకారము పంచభూతములు కాక ఇరువదియైదు తత్వములతో గూడిన ఈస్థూలాంగమునకు దుఃఖమేల. సుఖ దుఃఖములను ఎవడు సముడో వాడు జ్ఞాని, వాడు మహాపురుషుడు. త్వక్కు వాయువంశం, చక్షువు యగ్నివంశం, జిహ్వా జలవంశం, ఘ్రాణ పృథివివంశం.

అర్జు:— పరమాత్మా ఆత్మానాత్మ తరపడములో ఏ

త్యాగము, ఏసాధన, ఏవైరాగ్యము యుంటే మోక్షము దొరుకును?

కృష్ణ:— దాశీలు, భటులు, పుత్రులు, బంధువులు, వాహనములు, ధనము, ధాన్యము, బంగారు హారములు ఈ ఎనిమిది అష్ట భోగములు. అవిద్య, రాగ, ద్వేష, క్రోధిని, అభినివేష ఈ ఐదు పంచక్లేషములు. దయ, మోహము, భయము, సంశయము, కులము, బలసీలత, రుగస్వము ఈ ఎనిమిది అష్టపాశములు.

అర్జు:— జీవేశ్వరులు మాయాసంభంధము గలవారని తెలుసుకొని సకల విశేషములను నేతి నేతి లేదు లేదు అని త్యజింపగా ఏది విశేషించి మిగులుచున్నదో అదియే అద్వాయమైన రెండవది లేని బ్రహ్మము అని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:— దేహేంద్రియ ప్రాణాదులన్నియు అనిత్యములని తెలుసుకోవడము నిత్యానిత్య వస్తు వివేకము దీనిపేరు. విరాగము పొందవలయును. శమమనగా అంతఃకరణ నిగ్రహము, దమ యనగా బాహేంద్రియ నిగ్రహము, తితీక్ష యనగా సుఖదుఃఖములకు వోర్చియుండుట, ఉపరతి యనగా పరమాత్మయందే క్రీడించుట, సమాధానమనగా చిత్తమును పరమాత్మయందే నిలుపుట, శ్రద్ధ యనగా గురువునందునూ,

వేదమునందునూ, శాస్త్రములయందునూ విశ్వాసముంచుట దీనిపేరు శమాదిషట్కసంపత్తి. ఫలభోగవిరాగము పొందవలయును. పుష్ప, చందనవస్త్రభూషణస్త్రీ, యిండ్లు తోటలు భూములు యివి యిహమాత్రార్థ ఫలభోగ విరాగము. ముముక్షుత్వము - తాపత్రయముచే గాల్పబడి జీవుడు శాంతి యెప్పుడు గలుగునో యని నిరంతరమునూ చింతించుట. దీని పేరు మోక్షేచ్ఛ.

అర్జు:-- పుణ్య, పాప కర్మానుసారముగ బొందియుండు దేహమును తాను పొందని దేహమునలె తలంచుకొనియుండు ప్రాణియైన అభ్యాసిజీవు డనబడును. యిదియేనా హే కృష్ణా దీని సూత్రము?

కృష్ణ:- జనన మరణ లేనిది బ్రహ్మ, విష్ణు, రుద్ర సదా శివాండములు. అండములలోని వృక్షములు, పర్వతములు పంచభూతములతోడి సూర్య, చంద్ర ఆత్మ అష్టప్రకృతులయ్యెను. అనగా స్వాదిష్టయందు బ్రహ్మ మణిపూరకం వద్ద విష్ణు అనాహతయందు శివుడు, శరీరమే అండము, రోమములే వృక్షములు, ఎడమభాగమే మందరగిరి, కుడిభాగమే కైలాసగిరి, మధ్య మహామేరు పర్వతము, యివియే. సహస్రారమే ఆకాశము, లలాటమే వాయువు, కంఠమే అగ్ని, అనాహతజలము, నాభిస్థానమే పృధివి, పంచభూతములు అయిదు మనోబుద్ధి చిత్త, యీ ఎనిమిది ప్రకృతులతో గూడి యున్నది.

అర్జు:— జీవుడనే అర్జునుడు పరమాత్ముని ఏలాటి సంకల్పములు లేక దేహము అనగా 25 తత్వములతో గూడిన స్థూలాంగమే దేహి. అనగా 18 తత్వములతో గూడిన సూక్ష్మాంగమే వీటి గుణములు తెలుపుము యని ప్రార్థిస్తూయున్నాడు, అర్జునుడు.

కృష్ణ:— జీవుడా ఆత్మ యనగా నిత్యమయినది. ఎట్టిదనగా 25 తత్వములతో గూడినది. బాహేంద్రియస్థూలాంగము. యిదియే అండము. 18 తత్వములతో గూడినది సూక్ష్మాంగము. యిదియే పిండము. అనాహతయందు హృదయకమలము, దానిలో యున్న మట్టి గుండెకాయ భూమి, నల్లగుండెకాయ జలము, పైత్యసంచి అగ్ని, నురదబ్బావాయువు, ముక్కోన గుండెకాయ ఆకాశము, వీటికే బ్రహ్మాండమని పేరు. ముక్కోన గుండెకాయ యనగా హృదయ కమలము. దానిలో యున్నదియే ఆత్మ. అదియే అంతర్జ్యోతి. దానిని చంపిన చచ్చేది గాదు. దానిని ఏమిచేసిననూ చలనము లేనిది. దానిని కమ్ముకొని యున్న దేహము ఎప్పుడో ఏ వేళనో పోవ సంసిద్ధము. శాశ్వతము కాదు. ఓ, జీవుడనే అర్జునా!

అర్జు:— రజో, తమో, సత్వ యని మూడు గుణములు. ఆ మూడు గుణములలో సత్వజ్ఞానస్వరూపము. రజో ఆగ్రహస్వరూపము. తమో అజ్ఞానస్వరూపము అనగా ఏమియు తెలియ

నిది గనుక రజో, తమో రెండునూ కలసి రజోకు బలము తమో. తమోకు బలము రజో. యీ రెండునూ అయిక్యమై పొందుగా యుండును గనుక అహం అనే స్వరూపము దేనిచే పుట్టబడినదో నాకు చక్కగా తెలియపర్చుము శ్రీనాధా!

కృష్ణ:— పూర్వము చెప్పబడిన రజోగుణమే అహం. ఆ యహం తమోగుణము ద్వారా అజ్ఞానము గూడుకొని నేను నాకు మించిన వారు లేరని పల్కుచుండును. నేను, నేను అను అహంను సంహరించడమునకు చిన్న సూత్రము గలదు. అది యెట్లనిన జలను జలములో గలియుట వలన 1 రసమనే రుచిని కట్టవలయును. 2 జలము ఆకాశములో కలియుట వలన శబ్దము కట్టవలయును. 3 జలము వాయువులో గలియుటవలన స్పర్శము గట్టవలయును. 4 జలము అగ్నిలో గలియుటవలన రూపము గట్టవలయును. 5 జలము పృధివిలో గలియుటవలన గంధము గట్టవలయును. 6 అగ్ని అగ్నిలో గలియుటవలన శక్షువు గట్టవలయును. 7 అగ్ని ఆకాశములో గలియుటవలన చెవులు గట్టవలయును. 8 అగ్ని వాయువులో గలియుటవలన చర్మము గట్టవలయును. 9 అగ్ని జలములో గలియుటవలన నాలుక గట్టవలయును. 10 అగ్ని భూమిలో గలియుటవలన ముక్కు గట్టవలయును. యీ పది ఇంద్రియములు యెప్పుడు గట్టినామో అప్పుడే అహం నశించును.

అర్జు:— శ్రవణ, మనన, ధ్యానము అనగా వినినదానిని

మనసున యిమిడ్చుకోలేక అనగా ఆచరణ లేక పైన చెప్ప బడిన యీ పది యింద్రియముల ద్వారా భంగమవుతూ యున్నాము కృష్ణా.

కృష్ణ:- ఆ పరమాత్మ నీలీలలు, వారియొక్క ఓం కార ధ్వనులు వినసివానివలన జీవుడనేవాడు వ్యర్థమవుతూ యున్నాడు.

అర్జు:- గోవింద! పూర్వము శుక్ల శోణితములచే బీజమై యున్నప్పుడు నీవు నాకు బోధించిన బోధ మరచితిని. నీవే పరమాత్ముడవు. నేనే జీవాత్మను. సుజ్ఞానముతో విన దను. ఇక నొకసారి చెప్పుము.

కృష్ణ:- జ్ఞాన, మనో, బుద్ధి, చిత్త, అహం యీ అయిదు ఆకాశ తత్వములు సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన యీ అయిదు వాయు తత్వములు. శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణ యీ అయిదు అగ్ని తత్వములు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ యీ అయిదు జలతత్వములు. వాక్కు, పాణి, పాద, గుహ్యం, గుదము యీఅయిదు పృథ్వీ తత్వములు, ఇటుల అయిదు అయిదుల 25 తత్వములు ఏర్పడి పంచీకరణ ప్రకారము జీర్ణములైన దేహములనగ ఇంద్రియ ములు లయమైయ్యేటప్పుడుపృథివి భూతమైన వాయువు. ఉదక మందు లయించును. జలభూతమైన రసము అగ్నిలో లయిం

చును. అగ్నిభూతమైన చక్షువు వాయువునందు లయించును. వాయుభూతమైన వ్యానవాయువు ఆకాశమందు లయించును. ఆకాశభూతమైన జ్ఞాత ఆత్మతో గలియును. యీప్రకారముగ లయించి అవసాన కాలమందు జీర్ణమైపోయి ప్రారబ్ధకర్మను బట్టి తిరుగ జన్మము వచ్చుచుండును. శరీరము మారుతున్న దే గాని జీవుడు మారడము లేదు.

అర్జు:— భీష్మ, ద్రోణాదులపై నేను బాణములను ప్రయోగించిన నవి వారిని బాధింపవా కృష్ణా?

కృష్ణ:—వాక్సద్గుణములు నాలుగు. అవి యెట్టివనగా జిహ్వతో సదా నిజము చెప్పుట, భగవంతుని పురాణములు చెప్పుట లేక వినుట, మంచి మాట లాడుట అనగా రజో, తమో గుణములు లేక యుండుట, హితములను వ్రాయుచుట సత్వగుణములతో యుండడమే హితము. ప్రయోజనముగా పలుకుట యెప్పుడున్ను భగవంతుని విషయమై త్యాగముతో నుండుట. శరీర సద్గుణములు మూడు. అవి యెట్టివనగా తీర్థ యాత్రలు చేయుట అనగా ప్రాతఃకాలమునందు కాలకృత్య ములు తీర్చుట, దంతశుద్ధి చేయుట, స్నానము చేయుట, ఇది యే యాత్ర. మనస్సుతో దానము చేయుట అనగా సూర్యు నికి ఆర్ఘ్యము వదలుట. మనసు సద్గుణములు మూడు. అవి యెట్లనగా సద్భక్తి అనగా ఇంద్రియములను బంధించుట. ఇది స్థూలాంగము. నిరాశ బంధించిన ఇంద్రియములను నిషా—

ముడై యుండుట. ఇదియే సూక్ష్మాంగము. తపశ్చింత అనగా మనస్సును సదా భగవంతుని యందుంచుట. యీవిధముగా యున్నది శరీరనిర్ణయము. గనుక జీవునకు చావులేదు. ఆత్మా నాత్మ తరచడమే యుద్ధము చేయుము ధనంజయ.

అర్జు:— మాధవా! ఈ యుద్ధము పేరు ఏమని చెప్ప వచ్చును, తెలియపరుచుము కృష్ణా?

కృష్ణ:—దీనినే శరీర యాగమందురు. అది యెట్టిదనగా ఆత్మయే యజమానుడు అనగా జీవుడు. ఇంద్రాదిదేవతల కంత అధిపతియైనవాడు జీవుడు. వీడే యజ్ఞకర్త. బుద్ధియే పత్ని. జీవునకు భార్య బుద్ధి. వేదములే మహాఋత్విజులు. అనగా సత్యవాక్కులు, క్రూరవాక్కులు ఇవి వ్యాహృతులు. అహంకారమే అధ్వరుడు. చిత్తమే హూత, ప్రాణవాయువే బ్రాహ్మణచంచి, అపానవాయువే ప్రతిప్రస్తాత, వ్యాన వాయువే ప్రస్తోత, ఉదానవాయువే ఉద్గాత, సమాన వాయువే మైత్రావరుణుడు. శరీరమే వేది, అనగా యజ్ఞ శాల, నాశికయే ఉత్తరవేది, శిరశ్శే ద్రోణకలశము అనగా యజ్ఞగుండము, దక్షిణహస్తమే స్రువము, సవ్యహస్తమే ఆజ్య స్తాలి, శ్రోత్రములు ఆధారములు, నేత్రములే ఆజ్యభాగములు, మెడయే వక్షోద్ధార, పాదమే పోత, ఋత్విక్కు శేషుడు పంచ తన్మాత్రులే సదస్యులు. మహాభూతములే మంత్రవిశేషములు, భూతములే సోమయాజులు, నాలుకయే యిడ, దంతోష్టములే

సూత్కవాకము. తాలువే శంయు వాకము అనగా దనడ, స్మృతి, దయ, ఓర్పు, అహింస నాలుగు మంత్రములు. ఓంకా రమేయూపము, ఆశగే రచన, మనసే రథము, కామమే యాగార్థమైన పసువు, తలవెంట్రుకలే దర్భలు, జ్ఞానేంద్రియ ములే యజ్ఞపాత్రలు, కర్మేంద్రియములే హావిస్సులు, అహిం సయే ఇష్టులు, త్యాగమే దక్షిణా, మరణమే అవబృధస్థానము, ఓయీ జీవుడనే అర్జునా ఆకాశ, వాయువు, అగ్ని, జలము, పృథివి యీ అయిదున్ను ఇంద్రియములకు అనగా శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణా, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ వీటికి అనగా యీ పంచభూతములకు ఇంద్రియములు అయిక్యమైయున్నవి. ఇంద్రియములు ఆత్మకు అయిక్యమై యున్నవి. గనుక ఆత్మ చలనములేనిది. వికారములేనిది. నిర్వి కారమైనది. అర్జునా ధుఃఖింపకుము.

అర్జు:— హే పుండరీకాక్షు అంతఃకరణములు కట్టు బాటులేక అనగా మనో, బుద్ధి, చిత్త, అహంకారము యీ నాల్గింటిచేత శోకము ఉత్పత్తియాయెను. మాధవా! ఏమిచేయు దును?

కృష్ణ:— ఓయీ జీవాత్మ! అంతఃకరణ కలవరముచేత సత్యము అసత్యముగా తోచును. అంతఃకరణము నాశనము ఎప్పుడు అవునో జ్ఞానస్వరూపిగా నున్నాడు. ఆత్మకు అన్య మైన వస్తువులు స్వప్నమువంటివని నిశ్చయించుకోనలయును.

అర్జు:— పంచమలముల చేత జీవుడనే అర్జునునకు చక్కగా తెలియక బోధపడలేదు. అవి ఏవి యనగా 1 ఆణవమలము, 2 కార్మికమలము, 3 మాయికమలము, మాయేమలము, 4 తిరోదానమలము అనగా ఆణవమలము పరబ్రహ్మ విషయిక జ్ఞానము అప్పుడప్పుడు కలుగగా దానిని మరుగు పరుచునది. కార్మికమలమనగా వేదాంత శాస్త్ర విషయములను గురువులు బోధించునపుడు దానియందు బుద్ధిని చేరనీయనిది. మాయికమలమనగా పరబ్రహ్మ విషయిక జ్ఞాన వాసనలను యెప్పుడును కలుగనీయనిది, మాయేమలమనగా పాప కార్యములయందు మనస్సును ప్రవేశపెట్టునది. తిరోదానమలము నిత్య సత్య పరిపూర్ణ పరబ్రహ్మమందు అనిత్యబుద్ధిని పుట్టించి పరబ్రహ్మమునకంటె వేరుగా దేవతలు మంత్రములు, క్రియలు మతములు, సాధనములు కలవనియు అవి సత్యములనియు చెడుబుద్ధిని కలిగించి జనన మరణాది దుఃఖములను అనుభవింప జేయునది. అందువలన జీవుడను అర్జునునకు బోధపడలేదు.

కృష్ణ:— బ్రహ్మజ్ఞానమునకు పాటుపడుగువాడు విహితమగు గురూపాసన చేత ఇండ్లు, తోటలు అనగా స్థూలాంగమే ఇండ్లు, సప్తఅజ్ఞానభూమికలే తోటలు, భూములు. త్యాగేంద్రియమనే భూమి, అజ్ఞానమనే ద్రవ్యములు, పంచక్లేశములనే ధాన్యములు వీటియందు ఆశ లేక నశింపుజేసినవాడు నిష్కాముడై క్రోధము లేనివాడై ఇంద్రియ నిగ్రహము గలవాడై

యుండవలయును.

అర్జు:— జ్ఞానియైనవాడు ఏ బ్రహ్మము. నిర్వికల్పమయినదో అనంతమయినదో, కారణములేనిదో, సమానములేనిదో ఊహింప నలవికానిదో, అనాదియైనదో దానిని తెలియుటయే బంధము వీడిపోవుట. ఇదియే నిశ్చలమైన తత్వము. మాధవా ఇంతేనా, ఇంకా అనుమానమున్నదా?

కృష్ణ:— కాను సంకల్ప లేని మనస్సు శుద్ధమైనది. మనస్సు విషయములందు ఆసక్తి గలుగుటయే బంధము. హృదయము నందుండు సంకల్పము క్షయమగు నంత నగకు మనస్సును బంధించవలయును.

అర్జు:— జీవుడనే అర్జునుడు సాధనము లేక యోగము తోనే యుండెదను. అని ప్రార్థిస్తూ యున్నాడు. అనగా సాధనలు లేక యోగము. యోగము లేక సాధనలు యెప్పటికీ కూడదు. యీ రెండును యుండవలయునని జీవాత్మ ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:— జీవుడనే పార్థా! నీవు ఇంద్రియములకు, ఇంద్రాది దేవతలకు అధిపతియైన రాజువు. అనగా క్షత్రియుడవు గనుక నీవు ఇంద్రియములనే సైన్యమును సంహరించిన అదియే క్షత్రియ ధర్మము.

అర్జు:— పుండరీకాక్షా! బీజము అనగా మనస్సుగొక్క—

వికల్పన చేత బుట్టిన ఈ అజ్ఞానవృత్తులే నాబంధువులు. వారిని చంపుట పాపము కదా యని జీవుడనే అర్జునుడు కోరుతూ యున్నాడు.

కృష్ణ:- ధర్మము అనగా సత్యముచేత సాధనాచతుష్టయములు నాలుగున్నూ, అష్టాంగయోగములు ఎనిమిదిన్నీ, ఈషణత్రయములు మూడున్నూ, రాగద్వేషాదులు పదమూడున్నూ సప్తఅజ్ఞానభూమికలు ఏడున్నూ, సంహాంచుటయే ధర్మము. అదే మోక్షమునకు హేతువగును.

అర్జు:- జీవుడు ఈఅజ్ఞానవృత్తులను చంపుట యుక్తమే గాని భూతకాలము. అనగా తల్లి గర్భమునందు పుట్టునకమును పే భూతకాలము. ఇప్పుడు జరుగుచున్నదే వర్తమానకాలము. ముందు రాబోవుకాలము భవిష్యత్తుకాలము. ఆకాలమునకు ఈఅజ్ఞానవృత్తులన్ని ఏమూనాయని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:- జీవుడా నీవు పూర్వము శుక్లశోణితములచే బీజమై యున్న అణువుస్వరూపముగా యున్నప్పుడు జాగరమనే ప్రకృతియే యుద్ధము నిన్ను చుట్టు కమ్ముకొనియున్నది. ఇట్టి ధర్మయుద్ధములో జీవుడా నీవు జాగరము కావలెనని కోరలేదు. దానియంతట అదే కూడినది. గనుక జాగరమనే ప్రకృతికి రాజుగా యుండి నీవు దయతో వాటిని సంహారించడం యెందుకు అని యూహా పడినట్లయితే ఆ యజ్ఞానవృత్తు

లన్ని జాగరమునకు రాజుగా యుండి మమ్ములను చూచిన తోడనే భయము చెందెను. అని పరిహాసము జేయుదురు.

అర్జు:— ఉపాధి లేనిదియు సత్యమైనదియు ఏకమయినదియు మాయలేనిది యేదియో అదే బ్రహ్మము, అదే కీర్తి. అటు వంటి కీర్తికూడ నాకు వలదు మాధవా!

కృష్ణ:— అసత్యమైన సంసార విషయమును ఆకలి, దప్పి, మోహం, మదం, మాత్సర్యం కలుగ చేయునదియేదియో దాని యొక్క సంసర్గమే చేరకయే నరకము. అదియే జీవునకు మరణము.

అర్జు:— శబ్దాది విషయములు లేకపోయినను తెలుపబడుచున్న వాసనామయమయిన శబ్దాదులను జాగ్రతవస్థయొక్క వాసనతో గూడియుండు పదునాలుగు కరణములచేత నెప్పుడు గ్రహించుచున్నాడో అది స్వప్నావస్థ యని చెప్పబడును.

కృష్ణ:— సూర్యాది దేవతలవలన అనుగ్రహింపబడిన విషయమును మనస్సు మొదలగు జ్ఞానేంద్రియములు ఐదు. కర్మేంద్రియములు ఐదు. అంతఃకరణములు నాలుగు శబ్దాదివిషయములతో గ్రహించుచున్నాడో ఆత్మను జాగ్రత వస్థ యని చెప్పబడును. జాగ్రత లేకపోవుటయే అజ్ఞానవృత్తులనే కౌరవులకు ఓడినట్లు తోచును. గనుక జీవుడనే పార్థా! ఇంద్రాది దేవతలకంతా రాజుగా యుండి నీవు యిటుల బల్కుట క్షత్రియ ధర్మము గాదు.

అర్జు:- పుండరీకాక్షా! నన్ను స్వప్నావస్థలో యుండు మన్నారా లేక జాగ్రతావస్థలో నుండుమన్నారా ఏదో తెల్పుము?

కృష్ణ:- జీవుడనే పార్థా! చెప్పెద వినుము. మమ, దమ, తాపత్రయములు, రాగద్వేషములు, ఈషణత్రయములు సప్తఅజ్ఞానభూమికలు. అహం, ఆశ, ఆకలి, దప్పి, మోహం, భ్రాంతి యివియే గొప్ప సంసారము. దీనిపేరే మహారణ్యము. దీనియందు క్రూరమృగములు, దొంగవాండ్రు, ఉచ్చులు యున్నవి. వాత, పైత్య, శ్లేష్మాదులతో కూడిన రోగము లని తెలియవలెను. మంచి మోహినీస్త్రీ తిరుగుతూయున్నది. దాని పేరు ముసలితనములని తెలియవలయును. యివి గాక ఐదు తలలు గల ఏనుగులున్నవి. శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణము. ఇవిరామే ఏనుగులు. ఈఅడవిలో బావి యున్నది. ఆబావిలో గొప్ప సర్పమున్నది. ఆసర్పమే యము డని తెలియవలెను. ఆయడవిలో గొప్ప తీగెయున్నది. ఆతీగె జన్మరహిత మయినంతవరకువుండే ఆశ. ఇదిగాక బావిమొద్దున ఒక వృక్షమున్నది. ఆవృక్షమే ఆయుసు అని తెలియవలెను. ఆచెట్టువద్ద ఒక ఏనుగు యున్నది. దానిపేరు సంవత్సరం. ఆ ఏనుగుకు శిరస్సులు ఆరు యున్నవి. పదిరెండు పాదములున్నవి. అవియే ఋతువులని తెలియవలెను. లేక పదిరెండు మాసము లని తెలియవలెను. ఆచెట్టువద్ద రెండు ఎలుకలు మొదలు

కొఱుకుచున్నవి. ఆ ఎలుకల పేరే రాత్రులు, పగలు యని తెలియవలెను. ఆ చెట్టుకు తుమ్మెద లున్నవి. వాటి పేరే కామములు లేక కోరికలు. ఆ చెట్టుకు తేనెపట్టు ధారలు కురియుచున్నవి. అవి కామ రసములని తెలియవలెను. తేనెపట్టు ఆయువని తెలియవలెను. వానివలన జీవుడు పైన జెప్పబడిన వాటియందు జేరి ఆశక్తులగుచున్నాడు. ఈ బంధనలు తెగగొట్టుటయే యుద్ధము.

అర్జు:— యోగులకు యోగి బలముచే రాగము, మోహము, స్నేహము, కామము, క్రోధము యీ చెడుగుణములు నశించినపుడు గొప్ప యధికులగుదురు. చెడు గుణములు ఎవరికి నశించునో వారికే జయము కాబోలు.

కృష్ణ:— జీవుడనే పార్థా! సాధన యోగములతో గూడి మూడు బంధనలు అనగా మూలాధారం, ఉడ్యాణ, జాలంధర వీటితో అజ్ఞానవృత్తులనే కౌరవులను సంహరించుట అనగా త్యాగముతో ఆధారము, స్వాధిష్ట మణిపూరకం అనాహత విశుద్ధ ఆజ్ఞేయస్థానమే చేరుటయే స్వర్గము లేక రజో, తమో, సత్వ యీ మూడు గుణములకు అతీతుడై ఎప్పుడు గలుగునో అప్పుడే నాశరహితమైన ముక్తికాంతతో గూడి రాజ భోగములు అనుభవింతువు. జీవుడనే పార్థా! లెమ్ము.

అర్జు:— సుఖము. మనస్సు నిర్మలముగా యుండుటయే

సుఖము. దుఃఖము: సంకల్ప వికల్పములతో యున్న మనసే దుఃఖము. యీ రెండింటికి సమిష్టితో యుండుట వలన పాపము లేదు. అని జీవుడు ఆలోచించుచున్నాడు.

కృష్ణ:— జీవుడు యిహము స్థూలాంగమునకున్నూ, పరము సూక్ష్మాంగమునకున్నూ యీ రెండింటికి సముడై నిష్కాముడై ఫలమును ఆశించక నిర్వికల్పసమాధియైయుండు టయే యుద్ధము చేయుట. అటుయుండిన నీకు ఏలాంటిపాపము అంటదు.

అర్జు:— ఓ మాధవా నన్ను చోరులు, అరిషడ్వర్గములు, కిరాతకులు, సప్త అజ్ఞాన భూమికలు, అష్ట మదములు అనే ఏనుగులు, యీషణాత్రయములనే పాశములు వీరు నాతో స్నేహము చేయుటయే పాపం. వీరు నన్ను విడచి పోవుటయే నాకుముక్తి. వీరు నన్ను వదలిపెట్టి వెళ్లు మార్గమైనసాధన ఒక సూత్రము చెప్పుము.

కృష్ణ:— కామము బుట్టుటకు అవిద్యే కారణము. కర్మలు చేయుటకు కామము కారణము, యీ రెండిటి వలన పునర్జన్మ, మరణములు, సంసారదుఃఖములు గలుగుచున్నవి. మరియు లోభ, మోహ మనెడి గుణములు పాప కర్మములను జయించును. అట్లు జయించుట వలన అవిద్య యనెడి భూమి మిక్కిలి దట్ట మయిన దగుచు కర్మము లనెడు వి త్తనములను మొలకలెత్తింప చేయుచుండును. మనుష్యుని హృదయమందు

సుఖ దుఃఖ విషయములు చిక్కి పెట్టుచుండగా మానవుడు ఆ యా కార్యములను చేయుచుండును గాని ముదిమి చావుల చేత దేహమునశించెడి విషయము తెలియక అజ్ఞానమునందు మునిగియున్నాడు. గనుక ధన, బంధు, భోగములు మొదలగు నవినన్నియు స్థిరములు గావనియు తనకు ఎరువులయి యుండి వెనుక నశించునవియు యిట్లు తలచిన యెడల శాంత గుణము గలుగును. ఆ శాంతిచేత మోక్షము ప్రాప్తించును.

అర్జు:— సంకల్పములే పాపములు. అవి విడిపోవుటయే మోక్షము. అని జీవుడనే అర్జునుడు ఆలోచించుచున్నాడు.

కృష్ణ:— సాంఖ్యమనియు సన్యాసమార్గమనియు యోగము కర్మమార్గమనియు జ్ఞానముతో గూడినది సాంఖ్యము స్థూలాంగములో నున్న 25 యింద్రియములతో గూడిన తత్వములు. సూక్ష్మాంగములో నున్న గుణములను అణగ పెట్టుటయే కర్మయోగము.

అర్జు:— రజో, తమో గుణములు రెంటిని నణచునపుడు సత్వగుణమనే జ్ఞానము వృద్ధియైన పిమ్మట నిష్కామబుద్ధితో జాగ్రత స్వప్న సుషుప్తులలో గూడ గుణములను అణగ పెట్టుటయే ప్రతి మానవునకును సత్యమగు పురుషార్థము. యోగకర్మముతో గూడిన జ్ఞానమని జీవుడనే అర్జునుడు ఆలోచించుచున్నాడు.

కృష్ణ:— ఆకాశము అగ్నిలో గూడుటవలన బుద్ధియనే యింద్రియము బుట్టెను. కార్యా కార్యములు నిశ్చయించు నట్టిది బుద్ధి. నిశ్చయములేని బుద్ధి వాసనత్రయములలో లోక వాసన బాహ్యేంద్రియముల వింతలు ఆలోచించుట దేహ వాసన. సూక్ష్మాంగములోయున్న గుణములను తర్కించుట శాస్త్రవాసన. చిత్తము జ్ఞాతతో చేయుటయే వాసనత్రయ ములు. యివియే శాఖము. ఒకటి ఒకటిగా స్ఫురించుచున్న గుణములే కొమ్మలు. బుద్ధి యనగా తెలిసికొనుటయే కర్మ చేయవలయునని నిచ్ఛవాసన మనస్సునందు వెడలును. బుద్ధి స్థిరములేదో వారి మనస్సునందు క్షణమునకు తరంగములు ఎన్నో పరిణామమును.

అర్జు:— సత్వగుణములతో గూడిన జ్ఞానము. అజ్ఞాన మును ఆచరణ పెట్టునదియే కర్మయోగము. అని శ్రీవారు ఆలోచన చేయుచున్నారు.

కృష్ణ:— సత్వ, రజో, తమో గుణములు. సత్వ గుణ మే ఉ కారము విష్ణు. రజోగుణమే అ కారము బ్రహ్మ. తమోగుణమే మ కారం రుద్రుడు. యీ మూడు గుణములే ఆకలి, దప్పి, భ్రాంతి, మోహం, లజ్జ, భయం ప్రకృతియొక్క సంసారమని తెలియవలయును. ఈ గుణములు నశించువరకు జనన మరణములు తప్పవు. సరియైన జ్ఞానముతో గూడి త్రిగుణరహితుడై గుణములు నశింపజేయుటయే కర్మయోగం దీని పేరే నిష్కామము.

యుండిన వారే మహా ముని.

అర్జు:- అంతరింద్రియములు నాల్గు, పంచప్రాణములు ఐదు, జ్ఞానేంద్రియములు ఐదు, పంచతన్మాత్రలు ఐదు. కర్మేంద్రియములు ఐదు. యీ 24 యింద్రియములు బంధించిన అనగా జ్ఞాత యనే తెలివితో నుండవలయును. అని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:- కూర్మము అనగా స్పర్శ. తన్మాత్రియగు వాయుభూతము త్వగింద్రియము యీ భూతమును కూర్మమని చెప్పిరి. అదియు గాక కూర్మమును చర్మముతో పోల్చుట తాబేలు పైచర్మము పెంకువలె నుండుటను బట్టియే కొండనైనను గదలింపు బూనినది. వికృతవాయువు గాన మందర పర్వతమును కూర్మమెత్తినట్లు చెప్పెను. అదియును గాక ఆత్మక్షేత్రజ్ఞుడని పేరు గలిగి వాయువుయొక్క ఆధారము వలన జీవము గలవాడై సంచరించుచుండును. అట్టి క్షేత్రజ్ఞుని శరీరము క్షేత్రమను వాయుభూతము ధరించుచున్నది. యిది స్పర్శ. తన్మాత్రసూచన అనగా స్పర్శ యన తాకుట. బాహ్యేంద్రియము. సూక్ష్మాంగమునకు యీ మనస్సనే వాయువును వాసనత్రియములోకి పోనివ్వక బంధించవలయును.

అర్జు:- నిరాహారుడగు వానికి విషయములు నివర్తించినను అనగా సత్వగుణమే నిరాహారము. ఆగుణము వలన చంచలమే విషయములు నశించినప్పటికిని పూర్వము యున్న

రజో, తమో గుణముల వలన అప్పుడప్పుడు చంచలమనె అభిలాష వదలదు. పరబ్రహ్మము యొక్క యనుభవము కలిగిన పిదప సర్వవిషయములును వానియందున్న చంచలమనే అభిలాషయు వదలిపోవును. అని జీవుడు ఆలోచించుచున్నాడు.

కృష్ణ:— పంచభూతములతో గూడిన పృధివియే కుంతి. ఆపృధివికి గలిగిన జీవుడా! యింద్రియ దమనార్థమే అనగా బాహ్యేంద్రియములే దమ. ఆ దమ యనే గుఱ్ఱములు మనస్సును పెడత్రోవలకు గైకొనిపోవును. అనగా మనస్సే కళ్ళెములు, బుద్ధియే సారధి. గనుక కళ్ళెములను బుద్ధి యనే సారధి గట్టిగా పట్టుటయే యోగము.

అర్జు:— ఈ యింద్రియము లన్నింటిని వశపరచుకొనుటయే నిష్కామము కాబోలునని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:— జీవుడా! యింద్రియములు చలనముచే సంఘము అనగా ఒకటి కొకటి తోడై కామము పుట్టును. అనగా కోరికలు. ఆకోరిక నుండియే క్రోధము పుట్టును సుమా.

అర్జు:— క్రోధము నుండి సమ్మోహము అనగా అవివేకము, వాటినుండి భ్రమ, భ్రమనుండి బుద్ధి నాశము. వాటి నుండి సర్వస్వమునూ నశించును. ఓహో చాలా కష్టముగా నున్నదే యని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:— యోగశిద్ధి లేనివానికి నిశ్చలమైనబుద్ధి ఆచారమనే నిష్ట యుండదు. నిష్ట లేనివానికి శాంతియుండదు. శాంతము లేనివానికి సుఖముండదు. అనగా మనస్సు యొక్క చంచలము నశించడమే యోగము. అదియే బుద్ధి, అదియే శాంతము, అదియే సుఖము.

అర్జు:— యింద్రియములు వెనుక లగ్నమయి యున్న మనస్సు నీటియందున్న గాలివలె పురుషునియొక్క బుద్ధిని హారించుచుండును కాబోలు. అని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:— జీవుడనే పార్ధా! త్రిగుణములనగా రజో, తమో, సత్వగుణములు చలనము లగుటయే రాత్రులని పేరు. ఆగుణములు చలనము లేక నిశ్చలముగా యుండుటయే స్థితప్రిజ్ఞుడని పేరు. గుణములు నిశ్చలమై యుండుటయే పగలు.

అరు :— మాయ యనే సముద్రము తనహద్దును అనగా ఎవ్వనియందు విషయములన్నియు నిర్మలమనే మనస్సును చెడగొట్టకుండ యుండునో యతడే నిజమగుశాంతిని బొందును కాబోలు. అని జీవుడు ఆలోచన చేయుచున్నాడు.

కృష్ణ:— రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంబము, దర్పము, అహంకారము ఈ పదమూడు గుణములు నశింపుజేసెడి వారు ఎవరో వారే చిత్తశుద్ధ గలిగినవారు.

అర్జు:— మాధవా! చిత్తశుద్ధిగలిగినదని ఎట్లు తెలియును?

కృష్ణ:— అనగా కోరికలు వదలుటయే అతనినే జ్ఞానాగ్నిచే దగ్ధమైన పండితుడని జ్ఞాతలు చెప్పుచున్నారు. అట్టి వారే భ్రాంతియే మోహము. ఆమోహము నశింపుచేయుటయే వైరాగ్యము.

అర్జు:— వైరాగ్యము కలిగిన పిదప ఏమిచేయవలెను? మాధవా!

కృష్ణ:— సద్గురువు నాశ్రయించి వేదాంత శ్రవణ, మనన ధ్యానాదులచే బ్రహ్మసాన్నిధ్యమునొంద ప్రయత్నించవలయును. అప్పుడు సమాధి లభించును. అప్పుడు యీసర్వాంగమనే దేహమునందు జ్ఞానేంద్రియములనే శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా, కర్మేంద్రియములైన వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదం, వీటికి సంబంధమైన విషయములను అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడు యింద్రియములకు చోరనియ్యక నిర్మలమైన జ్ఞానము ముత్పన్నమైనపుడు సత్వగుణము వృద్ధిపొందినదని తెలిసికొనవలెను.

అర్జు:— కృష్ణా! నిత్యమూ సమాధి యందున్న స్థితప్రజ్ఞుని లక్షణమేమి? అతడేమి మాట్లాడును? ఎట్లు ప్రవర్తించును?

కృష్ణ :— అనగా యింద్రియములను స్వాధీనములో

యుంచుకొని సూక్ష్మాంగములో యున్న వృత్తులను స్వాధీన పరచుకొని యీస్థూలాంగను నే జగత్తునందు వ్యవహారము చేయుచున్నాడు.

అర్జు:- అట్టి స్థితప్రజ్ఞుని పొందు టెట్లు?

కృష్ణ:- అంతఃకరణము అనగా మనోబుద్ధి చిత్త, అహం, ఎవరైతే కట్టెదరో అట్టివారు రాగద్వేషమునుండి విముక్తులగుచున్నారు. చిత్తము ప్రసన్న మగునేని యతని యొక్క దుఃఖము లన్నియు నశించును. అప్పుడు తాత్కాల మున నే బుద్ధియు స్థిరమగును.

అర్జు:- స్థిరమైన బుద్ధిని పొందు టెట్లు? హే నిరాధా గా తెలవిండు.

కృష్ణ:- స్పర్శతన్మాత్ర యగు వాయుభూతము త్వగింద్రియము. ఈభూతమును కూర్మమని చెప్పిరి. శబ్ద స్పర్శాది విషయములనుండి యింద్రియముల నుపసంహరించుకొనునో యతనిబుద్ధి స్థిరమైనది. అన్నరసముచే యింద్రియములు వృద్ధి యగును. బండికి కందిరవంటిది.

అర్జు:- అది యొక కష్టమగు కార్యము గాదు. ఆహారము మానిన నింద్రియనిగ్రహము సులభము గాదా!

కృష్ణ:- నిరాహారు డనగా ఆకలి, దప్పి, మోహము, భ్రాంతి మొదలగునవి లేకపోవుటయే నిరాహారము. గనుక వాటియందున్న అభిలాష వదలదు. దీనికి పరబ్రహ్మయొక్క

అనుభవము గలిగిన పిదప అభిలాష వదలిపోవును. మనస్సు నిగ్రహించిన సర్వ సాధనములకును మూలమగును. యింద్రియ విషయములందు వ్యగ్రములయి స్వేచ్ఛగా సంచరించు నేని ఆత్మజ్ఞానమును సంపాదించుకొనెడి వాసనాత్మకమగు బుద్ధియే పుట్టదు. బుద్ధి లేనిచో దాని విషయమై దృఢమగు ధ్యానము సహితము చేయుట సంభవింపదు. అందుమూలమున శాంతియు, సుఖము సహిత ముండదని సారాంశము. యింద్రియనిగ్రహ మనగా యింద్రియములను బొత్తిగా నణచివైచి కర్మల నన్నిటి బొత్తిగా వదలివైచుట యని యర్థము గాదు. నిష్కామబుద్ధితో కర్మలు చేయవలెను.

అర్జు:— అటువంటి పండితులకు సాధ్యముగాని యింద్రియ నిగ్రహము నాకు సాధ్యమగునా? హే నారాయణా!

కృష్ణ:— యింద్రియములు చలనమవుటయే రాత్రులు. యింద్రియ విషయములు ఐక్యమవుటయే పగలు. యింద్రియములు చలనమగుటయే అజ్ఞానవృత్తులు, యింద్రియములు ఐక్యమగుటయే జ్ఞానవృత్తులు. యిదియే జ్ఞానము పార్థా!

అర్జు:— నీయందు మనస్సును నిశ్చలముగా నిలుపజాలని వాని గతిఏమి?

కృష్ణ:— చింతయనగా చలనము. చలనముచే కామము కామముచే సత్వ, తమో గుణముల రెండింటిచేత కలిగెడి

అశ్రద్ధ, అశ్రద్ధయే భ్రాంతి, భ్రాంతియే మరుపు. మరుపువలన బుద్ధి నిశ్చలత లేకపోవుట. యిదియే జన్మమునకు పరబ్రహ్మ ఐశ్వర్యము లేకపోవుట.

అర్జు:— అయ్యో! విషయచింత యెన్ని అనర్థములకు హేతువైనది. దాని నిట యుంచుటకు యోగ మేదైన గలదా?

కృష్ణ:— జ్ఞానులు కామ్య కర్మలు తుచ్ఛము లనుకొందురు. వాటియందే సామాన్యులు సుఖులై యుందురు. మరియు జ్ఞానులుకు కావలసినది నిష్కామకర్మ. పామరులకు నిష్కామముతో అవసరము లేదు.

అర్జు:— జ్ఞానయోగాభ్యాసమునకు ప్రతిబంధకము కలిగించు ప్రవృత్తు లెవ్వి?

కృష్ణ:— కర్మము చేయుటకు మాత్రమే నీకధికారము. అనగా సూక్ష్మాంగములోకి గుణములు చేర్చక యుండుటగా కర్మము చేయుట. దీనిపేరే నిష్కామం, కోరికతో చేయు కర్మయే రాగద్వేషములు.

అర్జు:— యింద్రియ నిగ్రహము లేనివారికి సంభవించు అనర్థములు యింకనూ తెలవిండు.

కృష్ణ:— విషయములు కట్టుబాటు లేని వారికి అజ్ఞాన వృత్తులు తొలగవు. అట్టివారికి చిత్తము చింతన చేయుచుండును. అనగా సంకల్ప వికల్పములు ముందు వెనుకకు

లాగుచుండును.

అర్జు:— ఓహో యింద్రియ లోలత్వ మెన్ని యనర్థములకు కారణమో!

కృష్ణ:— అజ్ఞానవృత్తులే మహాసముద్రము. అనగా మాయ. రాగద్వేషములు పంచక్లేశములు, సప్తఅజ్ఞానభూమికలు, ఈషణత్రియములు. యివి ఆసముద్రమునందు చేపలు, తాబేళ్ళు, మొసళ్ళు, పీతలు సర్పములై సూక్ష్మశరీరమే నావయి నావకు అప్పుడప్పుడు అస్థతగులుచున్నవి. యిదిన్నిగాక యివిగో యింద్రియ చలనములు. ఎవరైతే వీటిని అస్థతగులనీయక తప్పించుకొనుటయే శాంతి పొందుట.

అర్జు:— నామరూపము లేనివాడా! నాటి లక్షణముల నింకనూ బోధింపుము.

కృష్ణ:— స్థూలవిషయ వ్యాపారములు, సూక్ష్మవిషయ వ్యాపారము లనునవియే భూతములు. ఈభూతములు తమోగుణముచే గాఢమయిన చీకటియే సుషుప్తి. ఆసుషుప్తిలో యింద్రియములన్నియు నిశ్చలముగా యుండుటయే రాత్రులు. సత్వగుణమనెడి యోగి కిదియే పగలు. రజో, తమో గుణముచే యింద్రియములు చలనమగుటయే సత్వ గుణ మనెడి యోగికి రాత్రులు.

అర్జు:— మాధవా! విపులముగా తెలియునట్లు బోధింపుము.

కృష్ణ:— బ్రాహ్మీస్థితి యనగా సుషుమ్నానాడి వెన్నెముక దండి; అనగా బ్రహ్మదండి. అబ్రిహ్మదండిలో ఎవరైతే మూలాధారము బధించి ఉడ్యాణము లాగి జాలంధరచే ఎవరైతే ఆ సరస్వతి నదిలో స్నాన మాచరించెదరో అట్టివారు గంగ ఎడమ, యమున కుడిభాగమునా, సికయే సరస్వతినది. యీమూడు నదులు పొంగి అనగా ఒకటిగా చేరిన సముద్రములు; అనగా లవణ సముద్రము, మూత్రము, యిక్షు సముద్రము చెమట, సుర సముద్రము కల్లు లేక శుక్లము, సర్పిసముద్రము నెయ్యి స్త్రీ పురుషులకు కలిగే మోహామనే ద్రవము దధి పెరుగు సముద్రము కళ్ళె, కఫము, పైత్యము, పాల సముద్రిము నోటి చొల్లు, మంచినీళ్ళ సముద్రము కన్నీరు, యీ సముద్రము లన్నిటికి పొంగకుండగ గట్లువేసి సుషుమ్నానాడి ప్రాణాయామం చేయుటయే జ్ఞానికి పగలు. మరియు నెవడెంత కాలమునందు అనగా స్థూలము దాటి సూక్ష్మాంగము దాటి కారణాంగము యీమూడు తనువులు దాటి జ్ఞాని 24 తత్వములపై భ్రాంతి వదలినవాడై ఓంకారమనే ప్రిణవములో జీవుడు ఐక్యము కావడమే నిష్కామ్యము. ఎవరైతే తురియాతీతుడై యున్నాడో వాడు నాసాన్నిధ్యము పొందును. జీవాత్మ యిందుకు సందేహాము లేదు.

---

# కర్మయోగము

## మూ డ వ య ధ్యా య ము

అర్జు:- కర్మయోగమునకంటె జ్ఞానయోగము శ్రేష్టమైనదని నీ అభిప్రాయము గదా కృష్ణా! అటులైన నన్నీ భయంకరమైన యుద్ధ కర్మయందేల నిరూపించుచున్నావు?

కృష్ణ:- జీవుడనే పార్థా! యింద్రియ నిగ్రహము దశేంద్రియములు బంధించుటయే సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన, శ్రోత్రి, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణ యివి బంధించుటదో భీష్ముని చంపుట. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ యివి బంధించుటయే ద్రోణుని చంపుట. అర్జునా బుద్ధియొక్క సమానత్వమును యోగముకంటె బాహ్యమగు స్థూలాంగము యొక్క కర్మ మిక్కిలి కనిష్టమైనది. గాన బుద్ధిని శరణుజెందుము. యీ ఫలహేతువులు ఫలమును గోరి కర్మలు చేయువారు కృపణులు. అనగా దీనులు లేక క్రింద మెట్టువారు. స్థూలాంగమును దాటనివారు.

అర్జు:- కర్మ గొప్పదని యొకసారి, జ్ఞానము గొప్పదని మరియొకసారి చెప్పి నాబుద్ధిని మోహపెట్టు చున్నావు. పై రెంటిలో నేది శ్రేయమో నిర్ణయించి చెప్పుము కృష్ణా?

కృష్ణ:- అధోలోకములు ఏడు, వూర్ధ్వలోకము లుఏడు

యీ పదునాలుగు లోకములు ఈశరీరమే స్థూలాంగము. ఈ స్థూలాంగములో యున్న ఆధ్యాత్మ దేవతలను ఆచరణపెట్టుటయే జ్ఞానయోగము. అట్టివారే సాంఖ్యయోగులు. ఆ ఇంద్రాది దేవతలను ఆచరణాలో పెట్టిన తదుపరి ఆత్మయజ్ఞం జేయువారే యోగులు. వారే యతీశ్వరులు.

అర్జు:— అయితే ఆపై చెప్పిన రెండున్నూ భిన్నములా?

కృష్ణ:— నైష్కర్మ్య అనగా జ్ఞానమని యర్థము. కర్మ నాచరింపని యెడల జ్ఞానము కలుగనేరదు. కర్మలచేతనే జ్ఞానము కలుగును. కారణము కర్మలు జ్ఞానమునకు సాధనములై యున్నవి. అనగా ఆచరణ.

అర్జు:— కర్మ రహితస్థితి గొప్పదికదా హే కృష్ణా?

కృష్ణ:— బీజమనే జీవుడా ఏకర్మలు సహజమైనవో పుట్టుక మొదలు గుణకర్మ విభాగముచే నియతములై యున్నవో యవి సదోషములుగా యున్ననూ వదలగూడదు. అనగా పొగచే అగ్నిహోత్రిము వలె సర్వారంభములు ఉద్యోగములు నేదో యొకానొక దోషముతో గూడియుండును. అనగా దేనియందును నాసక్తిని చెందక మనస్సును స్వాధీనములో నిడుకొని నిష్కామబుద్ధితో ప్రివర్తించినచో కర్మ ఫలములయొక్క సన్యాసమగును. గాన పరమునుగు నైష్కర్మ సిద్ధి ప్రాప్తమగును.

అర్జు:— మాధవా! కర్మ యెప్పటికిని తప్పదన్నమాట.

కృష్ణ:- కర్మ కంటె బుద్ధి శ్రేష్టము, మనస్సు శుద్ధము గాక లోకభీతి మాత్రముచే గాని లోకులు మంచివారనుకొనవలయునని కాని బాహ్యేంద్రియముల వ్యాపారమాత్రమును నిరోధించువాడు వేషధారి గాని సత్త్వమగు సదాచారుడు గాడు. కలియుగమున దోషము బుద్ధి యందుండదు. కర్మ యందే యుండును. నిష్కామబుద్ధితో కర్మచేయు యోగియే కర్మయోగి యని పిలువబడును. గనుక కర్మయోగమే ఆచరింపుము; జీవుడా!

అర్జు:- కృష్ణా! నేను కోరినది గూడా యదియేసుమా!

కృష్ణ:- జ్ఞానముచే ఆసక్తి అనగా ఏమాత్రము విషయచింతలు లేక సదా తత్వవిచారణ చేయుటయే కర్మయోగము. జీవాత్మా నీవు జ్ఞానయోగము చేతను దాటవలెనని ఎంత ప్రయాస పడిననూ విషయములనే తీగెలు నీకడ్డుతగులుచూ యుండును. గాన ఆవిషయతీగెలు నరకుటయే కర్మయోగము. నరికిన తీగెలు మొక్క మొలవ కుండుటయే జ్ఞానయోగము. గనుక యీరెండు యోగములు నీకు చాలా అనుసరములు.

అర్జు:- ఓ నిరాధారా! సంచితార్థములనే కర్మ యెప్పటికిని వదలదా?

కృష్ణ:- జీవాత్మా! నీలోయుండు చంచలమే సంచితార్థము. ఆసంచితార్థము భూతకాలమునుండి వర్తమాన

కాలములో ప్రవేశించి భవిష్యత్తుకు గూడా నీకు ముందే ప్రయాణమై నీకు ఎదురుచూస్తూయున్నది. గాన నీలోయున్న చంచలత్వము వదలుటయే కర్మయోగము. యిదియే మిక్కిలి శ్రేష్టము.

అర్జు: ఆది మధ్యాంతములు లేనివాడా సంచితార్థము లనే కర్మ ప్రకృతితో సంభందించినది. నీవు చెప్పెడు వాక్యములను నేను విస్వసింపను.

కృష్ణ:- ఆకాశభూతము అగ్నిలో గలియుట వలన బుద్ధి గలిగెను. అనగా తెలివి. యీ తెలివియే వేదము. యీ వేదముకన్న కర్మ మిక్కిలి కనిష్టమయినది. ఫలమును గోరి కర్మలు చేయువారు కృపణులు; అనగా దీనులు; అనగా క్రింద మెట్టువారగుదురు.

అర్జు:- కర్మలు చేయుట నాకిష్టములేదు; ఓ పరంధామా

కృష్ణ:- బీజమనే మనస్సు మాయతో గూడుటయే కలియుగదోషము. బుద్ధియందుండదు. కర్మయందేయుండును. గాన నిష్కామబుద్ధితో కర్మచేయు యోగియే కర్మయోగి యని గీతలయందు చెప్పబడుచున్నది. ఓ జీవాత్మా కర్మలు చేయకున్న నీ శరీరయాత్రకూడా నడవదుగదా శరీర రక్షణ కొరకు చేయబడు కర్మము ఈశ్వరార్పణముగా చేయుము; అనగా నిష్కామముతో యని అర్థము.

అర్జు:- కర్మము బంధహేతువు గదా మాధవా!

కృష్ణ:- కోరికతో చేయు కర్మయేబంధనము; అనగా చలనము. చలనము లేనిదే నిష్కామము. యిదియే మోక్షము.

అర్జు:- పూర్వ మెవరైననూ యీవిధముగా బోధించిరా? హేకృష్ణా!

కృష్ణ:- నారాయణుడ నగు నేను పూర్వము అనగా భూతకాలమునందు పాంచభౌతిక శరీరములో యున్న అధి దేవతలైన యింద్రాది దేవతలందరికి యుపదేశము; అనగా పంచీకరణ ప్రకారము 96 తత్వములలో యున్న ఆధ్యాత్మ దేవతలందరికి బోధించి యున్నాను; హే ఫల్గునా!

అర్జు:- ఓ నిరామయా! 96 తత్వములు చెప్పిరి గదా వాటి వివరములు వక్కగా తెల్పుము? ఓమాధవా?

కృష్ణ:- జీవాత్మా! 96 తత్వములలోయున్న అధిపతులయిన యింద్రాది దేవతలను దెల్పుచున్నాను వినుము. జ్ఞానేంద్రియములు శ్రోత్రము, దిక్సమూహము, అధి దేవత, త్వక్, వాయుదేవుడు అధిదేవత, చక్షు, సూర్యుడు, అధిదేవత. జింహ్వా, వరుణుడు అధిదేవత, ఘ్రాణము అశ్వినీ దేవతలు అధి దేవతలు కర్మేంద్రియములకు అధిదేవతలు. వాక్కు అగ్ని దేముడు అధిదేవత. గుహ్యము బ్రహ్మ అధిదేవత. పాణి

యింద్రుడు అధి దేవత. పాదము ఉపేంద్రుడు అధి దేవత. గుహ్యము బ్రహ్మ అధి దేవత. గుధము మృత్యువు అధి దేవత. పంచతన్మాత్రలుకు అధి దేవతలు. శబ్దమునకు సదాశివుడు అధి దేవత. స్పర్శకు ఈశ్వరుడు అధి దేవత. రూపముకు రుద్రుడు అధి దేనత. రసమునకు విష్ణువు అధి దేవత. గంధముకు ప్రజా పతి అధి దేవత. పంచ కోశములకు అధిపతులు. అన్నమయ కోశము యిదియే స్థూలాంగము. ప్రాణమయకోశము యీ రెండింటికి విశ్వుడు అధిపతి, మానుషత్వము. మనోమయ కోశము , విజ్ఞానమయకోశము. యిదియే సూక్ష్మాంగము. తైజసుడు అధిపతి దేవత్వము. ఆనందమయకోశము. దీనిపే రే కారణాంగము. హిరణ్యగర్భుడు అధిపతి. ఈశ్వరతత్వము. వీడే ప్రాజ్ఞుడు. అంతఃకరణములకు అధిపతులు: మనస్సుకు చంద్రుడు, బుద్ధికి బ్రహ్మ, చిత్తమునకు జీవుడు, అహంకారము నకు రుద్రుడు. రాగాదులు ఎనిమిది. వాటి వివరము: రాగము ద్వేషము, కామము, ఈర్ష్య, అసూయ, డంబము, దర్పము, అహంకారము. యీ ఎనిమిది 14 భువనములకు గూడా పరి పాలన చేయుచున్నారు. నాడులు 14. వాటి వివరములు: వీపుమధ్య శిరస్సు వరకు నెలకొని యున్నది. మేరుమధ్యమున శిరస్సుయొక్క నడుమ యున్నదే బ్రహ్మనాడి. అధిదేవత శివుడు. యిడానాడి ఎడమముక్కు అధిపతి విష్ణువు. పింగళకుడి ముక్కు అధిపతి బ్రహ్మ. కుహునాడి గుహ్యము వరకు వ్యా

పించియున్నది, అధిపతి అగ్ని. సరస్వతీనాడి నాలుకయందున్నది. అధిపతి విరాట్స్వరూపము. హస్తి జింహ్వా యిడా నాడినుండి ఎడమకాలి పెద్దవ్రేలి వరకు యున్నది. అధిపతి వరుణుడు. గాంధారినాడి యిడా నాడినుండి ఎడమ నేత్రము వరకు వ్యాపించియున్నది. అధిపతి చంద్రుడు, యింద్రుడని చెప్పుదురు. అశ్వనీనాడి పింగళ నాడినుండి కుడికాలి పెద్దవ్రేలి వరకు యున్నది. అధిపతి సూర్యుడు లేక బ్రహ్మ. పూషనాడి పింగళనాడినుండి కుడి నేత్రము వరకు వ్యాపించియున్నది. అధిపతి దిక్కులు లేక యీశ్వరుడు. హస్తి, జింహ్వా, కుహు యీనాడుల మధ్యనుంచి విశ్వోధర నాడి యున్నది. అది ముఖము వరకు వ్యాపించి యున్నది. అదిపతి అగ్ని దేవుడు. యశశ్వని కుహునాడిమధ్యవరుణానాడియున్నది. అదిక్రిందుమీదుగాశరీరమంతయు వ్యాపించియున్నది. అధిపతివాయుదేముడు పూష సరస్వతీ మధ్య యశ్వనీనాడి యున్నది. అది కుడి చెవి వరకు యున్నది. అధిపతి ప్రజాపతి. గాంధారి సరస్వతి మధ్య శంఖినీనాడి యున్నది. అది ఎడమ చెవివరకు యున్నది. అధిపతి చంద్రుడు. కంద మధ్యమునందు అనగా స్వాదిష్టగర్భము నుంచి గుదము వరకు అలంబసనాడి యున్నది. అధిపతి వరుణుడు లేక సూర్యుడు. అని రెండు నామములు కలిగియున్నది. ఓయి జీవాత్మా యీ నాడులన్నియునూ కందమునుండి అశ్వత్థపత్రముయొక్క నరములవలె శాఖోపశాఖలుగా పోవు

చున్నవి. అని తెలియవలెను. వాయువులు 10. వాటి వివరములు: సమానవాయువు యిది నీలవర్ణము. నాభిస్థానము నుండి ఆపాదమస్తక పర్యంత నాడులయందు వ్యాపించి అన్నరసము, వాటియొక్క సత్తును సమస్త నాడులకు పంచిపెట్టును. అధిదేవత జయుడు, వ్యానవాయువు, గోక్షీరవర్ణము సర్వాంగమును వ్యాపించి దేహమంతయు నిండియుండును. అధిదేవత విజయుడు. ఉదానవాయువు సౌదామిని వర్ణము. కంఠమందుండి తుమ్మునూ, దగ్గునూ పుట్టించును. రుచులు గోరును, కలవరించును, కలలు కనును. అధిదేవత విశ్వయోని. ప్రాణవాయువు యింద్రనీలవర్ణము. హృదయస్థానమందుండి అంగుష్టము మొదలు వెన్నెముక మొదటి వరకు వ్యాపించి ఉచ్ఛ్వాస నిశ్వాసములచే అన్నమును జీర్ణము చేయించును. అధిదేవత విసృష్టుడు. అపానవాయువు పసుపువర్ణము. గుదస్థానమందుండి మలమూత్రములను విడిపించి అధో ద్వారమును బంధించి అన్నరసమునందు చేరి సకల రోమ నాడులయందు వ్యాపించును. అధిదేవత విశ్వకర్త. ఓ అర్జునా! ఐదు వాయువులకు ఉపవాయువులు ఐదున్నవి. మొత్తం పది వాయువులు. రెండు వాయువులు జత. ఆప్రకారముగా ఐదు జతలు. యీజతలకు ఐదుమంది అధిదేవతలు. ఎట్లనిన నాగవాయువు పీతవర్ణము. రోమనాడులయందుండును. చలనము లేక గీతరాగాదులను చేయించును. దీని దేవత సమాన నాగవాయువుకు ఒకడే

అధిదేవత జయుడు. కూర్మవాయువు శ్వేతవర్ణము పాదముల యందుండును. శుష్కించి యున్న దేహమును పుష్టి చేయించును. కన్నులు నోరును మూయించును, తెరిపించును. కర్తయైయుండును. దీనికి అధిదేవత వ్యానవాయువు, కూర్మవాయువు ఒక జత. అధిదేవత విజయుడు. కృకరవాయువు రక్తవర్ణము. నాశికమందుండి తుమ్ము పుట్టించును. గమనము చేయించును. ఉదాన, కృకర వాయువులు కలసి ఒకజత. అధిదేవత విశ్వయోని. దేవదత్త వాయువు స్ఫటిక వర్ణము. గుహ్యమందునూ, నేత్రములందునూ యుండి కూర్చుండిన చోటనే పడుకోపెట్టును, లేచి నిలపెట్టును, వ్యర్థముగా మాట్లాడించును. ప్రాణవాయువు, దేవదత్తవాయువు కలసి ఒక జత. వీటికి అధిదేవత విసృష్టుడు. ధనంజయ వాయువు నీల వర్ణము. సహస్రారమయిన బ్రహ్మ స్థానమందుండి చెవుల రంధ్రములలో చేరి సముద్ర ఘోషగా ఘోషించును. చిత్రముగా నాదములను పుట్టించును. మరణ కాలమునకు ముందుగ నిర్ఘోషమైపోవును. అపానధనంజయవాయువు రెండునూ ఒక జత. వీటికి అధిదేవత విశ్వకర్త. ఓ అర్జునా! 10 వాయువులు వాటికి అధిదేవతలను తెలిపియున్నాను. పంచ భూతములను దెలుపుచున్నాను వినుము: ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి యివి భూతములు. చక్రములు దెల్పుచున్నాను వినుము: ఆధారము, స్వాధిష్ఠ, మణిపూరకం, అనాహత,

విశుద్ధ, త్రికూటము.

అర్జు:- హే పరాత్పరా! పంచభూతములకు అధిదేవతలు ఎవరో దెలుపుము?

కృష్ణ:- ఆకాశమునకు ఈశ్వరుడు, వాయువుకు జీవుడు లేక యింద్రుడు, అగ్నికి హిరణ్యాగర్భుడు, జలమునకు చంద్రుడు పృథివికి సూర్యుడు అధిపతులు.

అర్జు:- షట్చక్రములకు అధిపతులను దెలుపుము?

కృష్ణ:- ఆధారంకు విఘ్నేశ్వరుడు, స్వాదిష్టకు బ్రహ్మ మణిపూరకంకు విష్ణువు, అనాహతకు ఈశ్వరుడు, విశుద్ధకు సదా శివుడు, త్రికూటంకు జీవుడు అధిదేవతలు.

అర్జు:- ఓ సచ్చిదానంద స్వరూపా! మలములు మూడన్నావు ఏమిటవి?

కృష్ణ:- పరమాత్మయందు మనస్సు వెళ్ళకపోవడమే ఆణవ మలము. స్థావరజంగమాత్మ ప్రపంచోత్పత్తి స్థితిలయములుకు కారణమైనది మాయామలము. పుణ్య, పాప, సుఖ, దుఃఖాది ద్వందరూపమయి యుండునది కార్మికమలమని వీటికి నామములు.

అర్జు:- పరమాత్మా! అవస్థలైదన్నారే అవి ఎట్టివి?

కృష్ణ:- మానవ శరీరమునకు అవస్థలు ఐదు. శైశవము, బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము

యీ దశలు మారిననూ వ్యక్తి నశించదు.

అర్జు:— మండలములన నేమి దెలుపుము? మాధవా!

కృష్ణ:— మణిపూరకం సూర్య మండలం, అనాహత చంద్ర మండలం, కంఠ అగ్ని మండలం.

అర్జు:- మాధవా! త్రిగుణములు చెప్పితిరిగదా వాటి బలాబలము లెట్టివి?

కృష్ణ:— నిర్మలమయిన్న మనస్సె సత్వగుణము. కోప స్వభావమే రజోగుణము. భయం, చంచలం తమోగుణము.

అర్జు:— ఈషణాత్రయము లెట్టివో తెలుపుము?

కృష్ణ:— దారేషణ, దారాపుత్రాదులపై ప్రేమ. ధనీషణ ధనముండి గూడ దానిపై ఆదాయం లేదని విచారము. ధనము లేక విచారము. పుత్రులు లేరని చింత. పుత్రులుపుట్టి చచ్చుట చింత. దీని పేరే పుత్రీషణ.

అర్జు:— దేవా: వ్యాధులు 3 ఎట్టివి?

కృష్ణ:— వాత, పైత్య, శ్లేష్మ వ్యాధులుమూడు.

అర్జు:— గోవిందా! తనువులు రెండున్నూ ఎట్టివి?

కృష్ణ:— స్థూల తనువు, సూక్ష్మ తనువు అని రెండు.

అర్జు:— మహాత్మా! సప్త ధాతువులను దెలుపుము?

కృష్ణ:- వివేకము వైరాగ్యముతో నుండుట, వినిన దానిని మనస్సుయందుంచుట, అనేక విషయములను మనస్సు

చే గ్రహించుట, శుద్ధ సత్వగుణముచేత గలుగు అపరోక్ష జ్ఞానము. అజ్ఞానవృత్తులకు మనస్సును పోనీయకుండుట, సత్సంగ ములతో మనస్సుంచుట, సర్వము అశాశ్వతము శాశ్వతము ఎట్టిదో తెలిసికొనుట; యివియే సప్త ధాతువులు. జ్ఞానేంద్రియ ములు 5, శబ్దాదులు 5, కోశములు 5, అంతఃకరణములు 4, రాగాదులు 8, నాళ్ళు 14, వాయువులు 10, ధాతువులు 7, భూతములు 5, చక్రములు 6, మలములు 3, అవస్తలు 5, మండలములు 3, ఈషణత్రియములు 3, వ్యాధులు3, గుణాలు 3 తనువులు 2, కర్మేంద్రియములు 5. మొత్తం 96 తత్వములు అర్జునా; వీటినన్నిటిని జయించి ఆయాస్థానములలో యున్న అధిదేవతలను ఆచరణ పెట్టుటయే కర్మయోగము లేక యుద్ధము. అనగా 96 తత్వములనూ బంధించుటయే యుద్ధము.

అర్జు:- మాధవా! నీవాక్యములు బాణములై నన్ను బాధించుచున్నవి. నాకు భయమగుచున్నది; ఏమి చేయుదును?

కృష్ణ:- అర్జునా! యోగము మృత్యువును జయించును. 'జాతస్యమరణంధ్రువం' పుట్టినవారు గిట్టక మానరు ఆయోగము చిత్త పరిపక్వము లేనివారికి అభ్యాసయోగమనియు, చిత్తపరి పక్వము గల వారికి జ్ఞానయోగమనియు రెండు విధములు. అర్జునా! అభ్యాసము చేయునదియే కర్మయోగము. అభ్యా సము పరిపక్వమయినదియే జ్ఞానయోగము. నిష్కామకర్మ చేయుము. నీకు ఏమియు భయములేదు.

అర్జు:— కృష్ణా: పై విషయములకు ప్రమాణములెవ్వి?

కృష్ణ:- బ్రహ్మ సమస్తసృష్టిని అనగా ఊర్ధ్వలోకములు 7, అధోలోకములు 7 నిర్మించిన పిదప నీలోకులు అనగా అధ్యాత్మ దేవతలే లోకులు. ధారణపోషణ ఎట్లు సంభవించునని అనేకవత్సరములు తపము చేసి భగవంతుని సంతోష పెట్టగా భగవంతుడీ లోకుల కొరకు యజ్ఞచక్రము నిర్మించి దేవతలను అనగా జ్ఞానవృత్తులనే మనుజులను అనగా అజ్ఞానవృత్తులను యజ్ఞములయందు ప్రవర్తింపచేసి ఒకరి నొకరు ప్రవర్తింపచేసి ఒకరి నొకరు సంరక్షించుకొనుమని చెప్పెను. అర్జునా! నీవు ఫలమును కోరక యజ్ఞము చేయుము. యజ్ఞమే కర్మయోగము.

అర్జు:- కృష్ణా! యింతకు నన్నేమి చేయమనెదవు?

కృష్ణ:— జపయజ్ఞములు, జ్ఞానయజ్ఞము అనెడి యజ్ఞములే శ్రేష్టములు. ఓ ధనంజయా! ఏలాటి ఫలము కోరక సూక్ష్మాంగములో యున్న గుణములను కట్టువేయుటయే గొప్ప యజ్ఞము, ఓ అర్జునా! చేయుము.

అర్జు:— జ్ఞానియొక్క లక్షణము లెట్టివి?

కృష్ణ:— జీవాత్మా! నీవు సదా పరమేశ్వరుని యందే మనస్సు నుంచుము. ఆత్మయందే తృప్తుడై ఆత్మయందే సంతుష్టుడైనవానికి బాహ్యేంద్రియ పనులతో ఎంతమాత్రము లాభము లేదు. చేయకపోవుటచే ఏమియును నష్టముండదు.

అర్జు:- నిష్కామ కర్మముచేత నెవరైన మోక్షము జెందిరా? యేపుండరీ కాక్షా!

కృష్ణ:- కర్మలు వదిలిపెట్టుటచేత నైష్కర్మ్యము సిద్ధింపదు. అనగా మనస్సు నిశ్చలముగా యుండదు. ఆనిశ్చలముచేత అభ్యాసము చేయగా చేయగా సిద్ధాన్త కలుగును. జ్ఞానికి జ్ఞానముచేతనే ప్రాప్తమగును. అటువంటి జ్ఞాని ఏమియు సంపాదించుకొనన నక్కరలేదు. సదా నిష్కామయే కావలయును.

అర్జు:- జ్ఞాని స్వతంత్రుడని వింటిని; కర్మలు చేయవలయునను నిర్బంధయును వానికేల అంటకట్టెదవు?

కృష్ణ:- జ్ఞానికి ఏలాంటి కోరికలు లేనందున ఆశక్తిని విడచి అనగా లత తీగ యుంటిది. లత యనే కోరికలు తెగగొట్టడమే కర్మచేయడం. అట్టి వానికి పరమగతి లభించును.

అర్జు:- నీవెందులకుంత కష్టపడెదవు? నీవు కర్మలు ఆచరింపకున్న ఏమగును?

కృష్ణ:- జీవాత్మా! జ్ఞానవృత్తులు, అజ్ఞానవృత్తులు యనే ప్రజలు ధర్మాధర్మములు తెలియక అధర్మ పాలగుదురని వారి మేలుకొరకు నేను కర్మలు చేయుచున్నాను. నేను కర్మలు చేయని పక్షమున అజ్ఞానవృత్తులనే ప్రజలను చెరసిన వాడ నగుదును.

అర్జు:- కర్మ చేయు కాలమందు జ్ఞానికి, అజ్ఞానికి బేధము కలదా హే మాధవా!

కృష్ణ:- బాహ్యేంద్రియములకు యిరువురును మహా శ్రద్ధతోడనే కర్మల నాచరించినట్లు గానపడుదురు గాని జ్ఞాని వికార రహితుడై అనగా చంచలం, భయం, లజ్జ, సిగ్గు, మోహం, భ్రాంతి కోరికలు వదలినవాడై లోకము కొరకు కర్మ చేయును, అనగా ఆధారం లగాయితు మణిపూరకంవరకు యమలోకం, మణిపూరకం లగాయితు విశుద్ధం వరకు పితృ లోకం విశుద్ధం మొదలు సహస్రారం వరకు స్వర్గలోకం. యీ మూడు లోకములలో యున్న జనులు అనగా తమోగుణముతో సంబంధించినది యమలోకం రజోగుణముతో సంబంధించినది. పితృలోకం యీ రెండు లోకములలో యున్న గుణములే అజ్ఞానవృత్తులనే కౌరవులను జయించడమునకు జీవుడనే అర్జునుడు అజ్ఞానవృత్తులతో జేరక యుండడమే యజ్ఞం లేక సన్యాసం.

అర్జు:- అజ్ఞాని యేవిధముగా కర్మ జేయును?

కృష్ణ:- అజ్ఞాని ఫలాపేక్షతో అనగా కోరికలు, మమదను, భ్రాంతి, చంచలం, ప్రుదేకం, అహం, యీషణత్రయములతో మోహముతో కర్మము జేయును.

అర్జు:- మాధవా! కష్ట సుఖములను సమముగా యుండే వాడు యెవడు?

కృష్ణ:- అజ్ఞాని ఫలమును నాశించును. యంతశ్రద్ధతో కర్మ జేయునో జ్ఞాని ఫలాపేక్ష లేనివాడై దీర్ఘ వైరాగ్యముతో మహాశ్రద్ధతో వుపవాసదీక్షతో అనగా మనస్సును యేమాత్రం చలింపు చేయక సదా భగవంతుని యందు మనస్సు లగ్నపరచుటయే వుపవాసదీక్ష యీప్రకారముగా దీక్షతో కర్మజేయుచు జయాపజయములకు సముడై అనగా కష్టములకు, సుఖములకు, భోగములకు దారిద్ర్యమునకు సమానముగా యుండును. అజ్ఞాని కష్టములకు దుఃఖింపుచు సుఖమునకు సంతోషించుచు జయములకు వుప్పొంగుచు అపజయములకు చింతించుచు యుంటాడు అజ్ఞాని.

అర్జు:- యెట్లైనను కర్మ జేయవలసినదేనా?

కృష్ణ:- జీవుడా! నేను చెప్పెడి వాక్యములు చక్కగా ఆలోచించుము. అధోలోకములు 7, వూర్ధ్వలోకములు 7. మూడు మండలత్రయములకు యధిపతిగా యుండి యింద్రాది దేవతలకంత నీవు రాజు పెద్దవాడుగా యుండి నీవే కర్మ చేయకపోతే నీక్రిందువారు కర్మచేయగలరా, వాటిని బాగుగా ఆలోచించుము, చేయరు చేయరు. గనుక యీఅధర్మ నీది కాని నీక్రిందువారిది గాదు గావున నీవు కర్మచేస్తూ నీ క్రిందువారినిగూడ కర్మచేయించుతూ యుండవలెను. అనగా జీవుడా నీమనస్సు స్థూలమును వదలి సూక్ష్మాంగములో యున్న గుణములను చలింపులేక నిశ్చయముగా యుండడమే, వారిచేత

కర్మ చేయించడము యిదియే రహస్యము.

అర్జు:- కర్మయోగి లక్షణముల నింకను సెలవిమ్ము.

కృష్ణ:- సోయీ జీవాత్మా నేను జపము చేయుచున్నా ననే అహం లేక నేనెవరు? నేనెంతటివాడను యని నిస్సంగుడై అనగా మనస్సును ప్రకృతి విషయములలో చేర్చుటయే సంఘం. అటువంటి విషయములలో చేర్చక మనస్సును నిష్కామముతో యుండడమే నిస్సంఘంచేత కర్మల ననుష్ఠించును జ్ఞాని.

అర్జు: మాధవా! అజ్ఞాని యేవిధముగా కర్మ చేయును?

కృష్ణ:- అజ్ఞాని సంఘముతో కూడుకొని అనగా కోరికలు అసూయగుణములు. నేను యీపనికి కర్తను. నేను లేనిదే యేపని జరుగదు. పైగా నామాటే ముందు యుండవలయును. అని అహంతో కూడుకొనినవాడై యిదియే సంఘం వీటితో చేరినవాడై అజ్ఞాని పాడైపోతూ యున్నాడు.

అర్జు:- నన్ను యేమి చేయుమని యాజ్ఞాపింతువు!

కృష్ణ:- జీవుడా! అజ్ఞానవృత్తులనే కౌరవులను చంపుట కొరకు అపరోక్షజ్ఞానమనే ఖడ్గము చేత బూని వైరాగ్యమనే పట్టుపట్టి దీక్షయనే దారి చూచుచు యనగా భవిష్యత్తు అనే గమ్యస్థానమునకు చేరుటకై యుద్ధము చేయుము.

అర్జు:- యేవిధముగా యుద్ధము చేయవలయును?

కృష్ణ:— స్థూలాంగమనే రథము ఎక్కియున్నట్టి యనేడి శ్వేత అనగా తెల్లటి గుఱ్ఱములు కట్టి సంకల్ప వికల్పముల నే కళ్ళెములు వేసి అష్టాంగయోగములనే కవచమును దాల్చి అనగా యమ, నియమ లక్షణములు పది, కవచము అనగా చొక్కా వేసి మనోవాక్కాయములచే హింసచేయకుండుట. యీ బుద్ధియే శ్రేష్టమయినదని అహింస యనబడును. చూచినది వినినది దాచక చెప్పుట సత్యము. స్త్రీలయందు, సంపత్తులయందు, భోగములయందు మనస్సు పోనియ్యక యుండు టయే అస్తేయము. సదా భగవంతునియందు మనస్సులయము చేయుటయే బ్రహ్మచర్య మనబడును. అరిషడ్వర్గములయందు మనస్సును పోనీయక అడ్డగించుట క్షమ. అనగా కష్ట వేదములచేతనే సంసారనివృత్తి అనగా జననం, మరణం యిదియే సంసారం. యీసంసారమునకు వేదమే భగవత్స్వరూపము. దీనిని నమ్మియుండుటే ధైర్యము. ఆర్తజనులు కాని లేనిని కోరికయే దయ. బాహ్యేంద్రియములయందు పామరులయందు శత్రువులయందు, మిత్రులయందు, గురువులయందు, శిష్యుల యందు సమబుద్ధితో నుండుట ఆర్జవము. యోగము చేయు వాడు అర్ధకడుపు భుజించుటయే మితాహారము. స్నానము చేయునపుడు మురికి యేవిధముగా పోవునో ఆవిధముగానే జీవుడికి యున్న మలినము పోవుటయే శౌచము. అర్జునా! యమము యొక్క పద్ధతులు పది. యికను నియమ లక్షణము

ప్రకారము కర్మ చేయువాడు లేక చేయకున్నను శ్రద్ధ గల్గి యుందురో శ్రద్ధ లేకున్న దూషింపకుందురో ఈముగ్గురికి మోక్షము లభించును.

అర్జు:- హే పరంధామా! నీవు బోధించు నట్లాచరింప కున్న నేమగును?

కృష్ణ:- జీవుడా! నాలీలలు తెలిసికొనలేక నామతో క్తమైన కర్మయోగ నిష్టింపనివారు చెడిపోదురు. అనగా అవివేకము ఎక్కువై జ్ఞానసూన్యమై బుద్ధిహీనమై తమోగుణము హెచ్చయి రజోగుణముచేత నరకమునకు ప్రాప్తులై యుందురు.

అర్జు:- కృష్ణా! నీమతమగు కర్మయోగ అనిష్టింప ధృడ సంకల్పము గలవాడైననూ మాయ క్షణములో వశపరచుకొని నీయందు విశ్వాసము పోగొట్టుచున్నది. ఏమి చేయుదును?

కృష్ణ:- ఓయి జీవుడా! నిన్నే కాదు. మనో, బుద్ధి, చిత్త, అహం ఈనాల్గు అంత రేంద్రియములు బధించినవారు మహామునులు. అటువంటి మహామునులను గూడా తప్పక ఒక నిముషమైనా వారి పంచజేరి వారిని పరీక్ష జేస్తూ యుండును. యిది గూడా నాసంకల్ప మే. ఎవరైతే నేను జేయు పరీక్షకు ఆగుచున్నారో వారు నాలో ఐక్యమగుచున్నారు.

అర్జు:- మాధవా! యిందులకు యింత బాధ కర్మచేయు

మని మీరు చెప్పడం వెంటనే నీమాయను పంపడం యిది ఏమనా ధర్మములు?

కృష్ణ:— నీవుచేయు యోగాను వట్టిదో గట్టిదో నాకు ఏవిధముగా తెలియును?

అర్జు:— గట్టిది, వట్టిది అనుటకు పరీక్ష ఏమిటి?

కృష్ణ:— అహంకారము లేనివాడు మనసు, దయ లేనివాడు, ఫలములు కోరనివాడు, సందేహము లేనివాడు, ఆశ లేనివాడు యిట్టివారు నిష్కామయోగులు. వీరే స్థితప్రజ్ఞులు. పైన వ్రాసియుండు గుణములు లేనివారు నిష్కామయోగి యని పేరు. అట్టి వారిని జనన మరణ మనే విచారచక్రం పట్టి బాధించుచూ వుంటుంది.

అర్జు:— మాయను జయించుట కసాధ్యముగానున్నది. దీనికి మంచి దివ్యమైన బాణమొకటి నియ్యుము; కొట్టెదను.

కృష్ణ:— అర్జునా శభాష్! మంచి మాట్లాడితివి. నాకెంతో పరమానంద మాయెను. ఇంద్రియములు అనగా శ్రోత్ర, త్వక్కు, చక్షువు, జింహ్వా, ఘ్రాణ మీటియందు రాగద్వేషములు స్థిరముగా నాటబడి యున్నవి. మీటిని కొట్టే బాణము సాధన శతుష్టయములే ముఖ్యమైన బాణము. యీబాణము చేత మాయ యనే రాక్షసుని జయించవచ్చును.

అర్జు:— కర్మ చేయుము. ఫలము కోరరాదు. అనిచెబు

తూయున్నారే! నేను ఫలముగోరి కర్మ జేయుదు నేగాని ఫలము గోరక కర్మల చేయజాలను.

కృష్ణ:— కోరికయే కామము. కామమే క్రోధముగా మారును. దీనిచేత అనేకమైన గుణములు అజ్ఞానవృత్తులు ఏర్పడి జ్ఞానవృత్తులకు చోటులేక చేస్తాయి. ఇది మాత్రము నిశ్చయము. జీవునకు పరమశత్రువు; ఈకామము మోక్షము నకు వెళ్ళనీయక చేయునది యీకామమే. జాగ్రతగా యుండుము.

అర్జు:— కామము యున్నచోట నిష్కామ ముండదా?

కృష్ణ:— కామమున్నచోట నిష్కామ ముండుటకు చోటు లేదు. కారణము తెలుపుచున్నాను వినుము. కామమే కౌరవులు, నిష్కామమే పాండవులు. గనుక కామము నే తప్పక జయించుమని నాభావము.

అర్జు:— మీరు నుడివినది మూర్ఖుని విషయముగదా?

కృష్ణ: - కాదు; జ్ఞానికి కామము నిత్యశత్రువు, అజ్ఞానికి కామము పరమ మిత్రువు.

అర్జు:— మాధవా! కామమనే శత్రువులను జయించడము నాకు చాలా కష్టముగా యున్నది.

కృష్ణ:— సదా మనో బుద్ధిని రెంటిని కామము వ్యాపించి యిందిృయములద్వారా మానవులను మోహా అనగా భ్రాంతి

లోపడగొట్టుచున్నది. నీవు యింద్రియముల నిగ్రహింపుము. తరువాత కామమును జయింపవచ్చును.

అర్జు:- మాధవా! ఆత్మజ్ఞానము గల్గునా అప్పటికైనా?

కృష్ణ:- ఇంద్రియములకన్నా మనస్సు, మనస్సుకన్నా బుద్ధి, బుద్ధికన్నా ఆత్మ శ్రేష్టములైనవి. మొత్తము బాహ్యేంద్రియములలో వీటిని ఒక్కొక్కటిగా జయించి చివరకు స్వాధీనము చేసుకొనవలయును. ఇదిముఖ్యము. అందుకే అర్జునా కామమనే రాక్షసుని ముందుగా చంపవలయును.

# జ్ఞానయోగము

## నాల్గవ యధ్యాయము

అర్జు:— ఆపద్బాంధవా! చరాచరాత్మములో యున్న పదార్థములకు అన్నిటికి మిగిలి శేషుండవై నిత్యుడై పరిపూర్ణుడై షడ్వికారములులేనివాడై జననం, మరణం, దయ, దయ, భ్రాంతి, ఆకలిదప్పి, మోహం, భయం, లజ్జ, అహం ఏలాటి ప్రకృతికి నీకు సంబంధములేనివాడా జీవుడు పైన వ్రాసియుండు గుణములన్నియు వదలినవాడై సదా యెల్లప్పుడును నీలోలగ్నమైయున్న సమయంబున ఆజీవునకు ఏలాటి భంగము లేకుండా కాపాడుటచేత ఓ ఆపద్బాంధవాయని నీకు నామము కల్గెను. కృష్ణా! ఈ యోగవిద్య ఇదివరలో ఎవరికైనా బోధించితివా? క్రొత్తగా నాకే సృష్టించి నాకుపదేశించితివా; మాధవా చెప్పుము?

కృష్ణ:— జీవుడా! రెండవఅధ్యాయము సాంఖ్యాయోగములో ఇంద్రాది దేవతలకు అధ్యాత్మ దేవతలకు చాలా మందికి వుపదేశించితిని.

అర్జు:— హే నారాయణా! నీబోధ విన్నవారందరు నీ యుక్తికి లోబడిరా?

కృష్ణ:— పార్థా! సత్సంగమే నాయుక్తి. సత్ శాస్త్ర

తమైన పదవియే నాయుక్తి. పూర్వము పంచభూతములకంతా కూటస్థుడే సూర్యుడు. ఆసూర్యునికి ఉపదేశించితిని ఆసూర్యుని పుత్రుడు మనువు అనగా మనస్సునకు బోధించితిని. ఆ మనువు ఇక్ష్వాకు అనగా బుద్ధికి బోధించితిని. ఈప్రకారముగా పరంపరముగా తొంబదియారు తత్వములలో యున్న అధ్యాత్మ దేవతలందరకూ బోధించియున్నాను.

అర్జు:— దామోదరా! నీబోధ చాలా అసాధ్యముగా యున్నది. నన్ను వదలిపెట్టుము.

కృష్ణ:— రెండవ అధ్యాయములో జ్ఞానవృత్తులు అనే వెలుగునందు అజ్ఞానవృత్తులనే చీకటి బంధుత్వ మెందుకు. నీకు జీవుడనే శిష్యుడను జ్ఞాననేత్రములు లేకచీకటి యనే దుఃఖములో మునిగియున్నాను. నీవుతప్ప రక్షించువారు వేరు లేరు. నీవే పురుషుడవు, నేనే స్త్రీని. నాతప్పులను క్షమించవలయును. అని యిదివరలో నాకు వాగ్దానమిచ్చి యిప్పుడు నన్ను వదలిపెట్టు మనుట ఏమి ధర్మమో ఆలోచింపుము.

అర్జు:— గోవిందా! సరి; నాకెందుల కుపదేశింతువు?

కృష్ణ:— పూర్వదిశ తూర్పు. ఈ స్థూలాంగములో యున్న తూర్పు నాభిస్థానం. పది దళములచేత వ్యాపించెడి సూర్యునకు ఈయోగవిద్యను బోధించియున్నాను. నీవును దానిని అభ్యసింపుము.

అర్జు:- మాధవా! చిన్న మనవి. ఈస్థూలాంగములో యున్న సూర్యునకు పది దళములన్నా రే; అవి యేవి? వాటిని చక్కగా తెల్పుము?

కృష్ణ:- నాభిస్థానము తూర్పు. దీనికధిపతి సూర్యుడు. కుడికన్నగ్నిమూల. దీని కధిపతి శుక్రుడు. కుడిచెవి దక్షిణం. దీని కధిపతి కుజుడు. కుడిభాగం కణతలు నైరుతి. దీని కధిపతి రాహువు. కంఠం పడమర. దీని కధిపతి శనేశ్వరుడు. ఎడమ కన్ను వాయవ్యమూల. దీని కధిపతి చంద్రుడు. ఎడమచెవి ఉత్తరం. దీనికధిపతి బుధుడు. ఎడమకణతలు ఈశాన్యమూల. దీనికధిపతిగురుడు. రాహువు కేతువు లిద్దరూ ఒకేఫలితమునిచ్చెడివారు గనుక వీరే నవగ్రహములు. ఇవిగాక ఆధారస్థానం యమలోకం. అధిపతియముడు. సహస్రారము వైకుంఠం. దీని కధిపతి సాక్షాత్ నారాయణ లేక శివుడు. ఈ పది దళములలో పరిపాలనచేయుసూర్యునకు ఉపదేశించియున్నాను.

అర్జు:- హరీ! నీవు మొన్నటి వాడవు. సూర్యుడు అనాదివాడు నీవెట్లు సూర్యున కుపదేశించితివి?

కృష్ణ:- జీవుడా పూర్వ జన్మము పంచ భూతముల కూడికచేత యీస్థూలాంగమనే శరీరము యేర్పడినది. ఇటువంటి శరీరములు యెన్నియో నేను చూచియున్నాను. నీకు తెలియదు. కారణ మేమనగా మాయకు ఐక్యమయినవాడవు గనుక నీకు తెలియదు. నేను మాయను దాటిన వాడను.

మాయకు అతీతుడను. గనుక ఇదివరలో నీజన్మము లన్ని నాకు తెలియును. నీకు నాకు మధ్య మాయ యనే మోహిని శక్తి యొకటి మహావినోదముగా అతిసుందరముగా యుంటూ జీవుడా నిన్ను బట్టి ఆడించుచూయున్నది. జీవుడా నీకు మొగుడు మాయ. మాయకు మొగుడు నేను.

అర్జు:— మహాత్మా! నీకును జన్మ యున్నదన్న మాట?

కృష్ణ:— కాదు; కాదు. నాకు అవతారములని పేరు. నీకు జన్మములని పేరు. నాకు సంసారమే లేదు. అనగా జననం మరణం లేనివాడను. నాకు రాత్రియు పగలు లేదు. సదా నిర్వికార నిరంజనుడను. అయినా నీకు సంసారమున్నది. అది యేదనగా పుట్టుట, చచ్చుట సంసారము. షడవికారములు మోహం, నిద్ర, స్త్రీకూటమే, అనగా అజ్ఞానవృత్తులే స్త్రీలు ఇటువంటి చర్యలు అన్నియు నీకు వున్నవి పార్థా!

అర్జు:— నీ వెప్పుడెప్పుడు పుట్టుచున్నావు?

కృష్ణ:— జీవాత్మా! ధర్మము నశించి అనగా సత్యము, శాంతము, ఓర్పు, దయ, తపస్సు ఆచరణ, అహింస యివియే జీవునకు ధర్మములు. ఈధర్మముల ప్రకారము నడువక అధర్మ ముల ప్రకారము ఎప్పుడు జీవుడు నడచుచున్నాడో అనగా మనస్సు చలనమే వ్యభిచారము, కామమే కోరికలు, డంబా, అసూయ, అహం, పంచక్లేశములు, ఈషణాత్రయములు,

రాగద్వేషములతో జీవుడు యెప్పుడైతే నడచుచున్నాడో అదియే అధర్మము. అప్పుడు అధర్మములకు నేను సహించలేక అవుతారములు ఎత్తుతూయున్నాను. ఆప్రకారముగ అవుతారములు ఎత్తి సాధువులను రక్షణ చేయుచు దుష్టులను శిక్షించుతూ యున్నాను.

అర్జు:- పరాత్పరా! సాధువులను ఏవిధము రక్షణ చేయుచున్నావు?

కృష్ణ:- జీవుడా చక్కగా వినుము. అజ్ఞానవృత్తులు ఏమియు లేక జ్ఞానవృత్తులతోటి అవి ఏవనగా శుభేశ్చ, విచారణ, తనుమానసి, సత్వాపత్తి, సంసక్తినామిక, పదార్థభావన, తురీయము యివి జ్ఞానభూమికలు 7 సాధనచతుష్టములు నాలుగు. అవి యేవనగా చెప్పెద వినుము. నిత్యానిత్య వస్తువివేకము, యిహాముత్రార్థ ఫలభోగవిరాగములు2. శమాది షట్కసంపత్తి 3, మోక్షేచ్ఛ 4, అష్టాంగయోగములు 8. అవి ఏవనగా యమ, నియమ, మానస, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి యివి అష్టయోగములు. యివి గాక సత్సంగత్వము పరమాత్మని కథలు చెప్పుచు లేక వినుచూ పరమాత్మ స్మరణ యిదిన్నీ గాక అష్టపుష్పపూజలు అవి ఏవనగా అహింస ప్రథమపుష్పం, యింద్రియనిగ్రహము 2 వ పుష్పం, సర్వభూతదయ 3 వ పుష్పం, క్షమాపుష్పం 4 వది, శాంతిపుష్పం 5 వది, తపఃపుష్పం 6 వది, ధ్యాన

పుష్పం 7 వది, సత్యంపుష్పం 8 వది, వీట్లచే శ్రీమహావిష్ణువు ప్రీతి చెందును. ఆపుష్పములతో పూజ చేయువారే సాధువులు. వీరిని రక్షణచేయుట అనగా వాసనత్రయ అనేచింతలు లేకుండగా ఆపరమాత్ముని యానందములో వారిని యుంచుటయే రక్షించుట.

అర్జు:— నవనీత చోరా! దుష్టులు ఎట్టివారు? వారిని శిక్షించుట ఎట్లు?

కృష్ణ:— రజోగుణ తమోగుణ అనగా అజ్ఞానవృత్తులలో పంచక్లేశములు అయిదు, అరిషడ్వర్గము లారు. రాగద్వేష గుణములు పదమూడు. ఈషణత్రయములు మూడు. అజ్ఞానభూమికలు ఏడు. ఈగుణములతో నిండియుండినవారు దుష్టులు, దుర్మార్గులు, రాక్షసులు. వీరిని యిహామునందు అనగా యీస్థూలాంగమే యిహాము, సూక్ష్మాంగమే పరము. యీరెండింటియందు బాధలు పెట్టుటయే శిక్షించుట. అనగా శరీరమునకు రణములో, దెబ్బయో, గాయమో యివియే స్థూలాంగబాధలు. సూక్ష్మాంగబాధలు ఎట్టివనగా మనస్సు సదా వాసనత్రయములలోబడి నాయొక్క మహిమలు గనలేక నాయొక్క భక్తులను జూచి వారు ఎవరనగా సత్వగుణముతో గూడిన జ్ఞానవృత్తులే నాభక్తులు. వారిని యీఅజ్ఞానవృత్తులనే దుష్టులు, దుర్మార్గులు ఛండాలురు జూచి సహించలేనివారై వారి తపస్సు చెడగొట్టుచూ అనగా స్మరణ; వారిని

నానాబాధలు పెట్టుచుండుట జూచి నిష్కామము నే నాయొక్క చక్రిముచే వారి నప్పుడప్పుడు తరిమివేసి భక్తులను రక్షించుచుందును.

అర్జు:— ఓ నిరాధారా! నీజన్మ కర్మలను గూర్చి స్వాతంత్రముగా నడిగి శ్రమ గల్గించినందులకు క్షమించవలెను.

కృష్ణ:— కిరీటీ యిట్లడుగుట యిదియే తరచుట. తరచగా తరచగా వెన్న వచ్చుచునేయుండును. యిదియే గొప్ప యోగము. నీవు జీవాత్మవు. నేను పరమాత్మను. నీవు చంచలుడవు, నేను అచలుడను. నీవుగూడ నీచంచలత్వము ఎప్పుడు నశింపచేసికొని నాలో ఐక్యమగుచున్నావో నేనే నీవు, నీవే నేను. అట్టి నీకు పునర్జన్మ లేదు.

అర్జు:— మరి యేమగును?

కృష్ణ:— నన్నుచేరి నాతో శాశ్వతముగా లీనమై యుండును.

అర్జు:— నారాయణా! నీస్వరూపము నెరింగి ఎవరైనను ముక్తినొందిరా?

కృష్ణ:— రాగద్వేషాదులొదలి నిష్కామముచే త్వం, జీవుడు, తత్ పరమాత్మయని నెరింగి మోక్షమును సాధించిరి.

అర్జు:— అనేకమంది అనేక రకములగు కోరికలచే ఆరిహా వేల్పులను ప్రార్థించుచుండిరే ఆకోరికలు నెరవేరునా?

కృష్ణ:— జీవుడా! ఎవరైతే కోరికతో ధ్యానించిరో ఆ కోరికయే వారిని పోషించుచున్నది. ఆఫలితముల నిచ్చుచున్నాను. ఏ దేవుని ఎవరు ప్రార్థించుచుండిరో ఆస్వరూపమున దర్శన మిచ్చుచున్నాను.

అర్జు:— వీట్లన్నిటికన్న నిష్కామముగా నిన్ను భజించుట యుక్తముకదా!

కృష్ణ:— ధనంజయా! ఫలాపేక్ష లేనివారు నన్ను నిష్కామముతో ఆరాధించుచున్నారు. అనగా వారు నిశ్చలమైన మనస్సు గలవారు. ఫలితము గోరి ఆరాధించువారు చంచల గుణములతో యింద్రాది దేవతలను ప్రార్థించుచున్నారు.

అర్జు:— నిశ్చలభక్తి, చంచలభక్తి యని రెండు విధములుగా చెప్పితిరే అవి యెవ్వి?

కృష్ణ:— అవును. నిష్కామమునకు పరమేశ్వరుడధిపతి. పరమేశ్వర స్వరూపమే గమ్యస్థానము. గమ్యస్థానము చేరిన జీవునకు పునర్జన్మ లేదు. అర్జునా కామమునకు యింద్రుడధిపతి. యింద్రుడశాశ్వత భోగములు. అశాశ్వత సంపదలు యిచ్చెడివాడుగనుక జీవుడు తిరిగి జన్మ మొందుచున్నాడు.

అర్జు:— ఏల నిశ్చల, చంచలముగా ప్రార్థించుచున్నారు?

కృష్ణ:— నిష్కామమే నేను. దానిని సిద్ధిపొందుట కొరకు కొంతకాలము పట్టును. ఆకారణముచే ఓర్పు లేనివా

రందరూ యింద్రాది దేవతలను ప్రార్థించుచున్నారు.

అర్జు:- యింద్రాది దేవతలకు, మీకు భేదమేమి?

కృష్ణ:- నన్నారాధించు వారికి శాశ్వతమోక్షము ఇచ్చెదను. అట్టి శక్తి ఇంద్రాదులకు లేదు. ఇంద్రాదులను ప్రార్థించువారికి స్వల్పభోగముల నిచ్చెదరు. అవి అశాశ్వతము

అర్జు:- మాధవా నిన్ను వదలి అశాశ్వతభోగములు ఇచ్చెడివారిని పూజించు టెందులకు?

కృష్ణ:- వారి వారి భూతకాలములో చేసిన ఫలితము ప్రకారము త్రిగుణములద్వారా సత్వగుణములు గలవారు పరమేశ్వరుడగు నన్ను ధ్యానించెదరు. రజోగుణ తమోగుణ పరులు యింద్రాది దేవతలను పూజించెదరు.

అర్జు:- మాధవా! జీవులు మూడురకములుగా కనబడుచుందురే?

కృష్ణ:- అవును. ఉత్తములు సాత్వికభక్తి తేనెటీగల వంటివారు. మధ్యములు రాజసభక్తి మామూలు ఈగవంటి వారు. అధములు తామసభక్తి పేడపురుగులవంటివారు.

అర్జు:- నియామకముచే గుణములు మారునా ఏమి?

కృష్ణ:- అవును. సంచితప్రారబ్ధ ఆగామిచే గుణములు మారుచుండును.

అర్జు:- అది ఎట్లు మారుచుండును?

కృష్ణ:— సంచితము పూర్వజన్మ కర్మఫలితము. దీనినే భూతకాల మందురు. ప్రారబ్ధము యిపుడు అనుభవించునది దీనినే వర్తమానమందురు. ఆగామి యీజన్మలో చేయు ఫలితము ముందుజన్మలో వచ్చునది. దీనినే భవిష్యత్తు కాలము అందురు. యీగుణములచేతనే నేను నాల్గు వర్ణములుగా సృజించియున్నాను.

అర్జు:— మాధవా! ఆ వర్ణములెవ్వి?

కృష్ణ:— సత్వగుణమే బ్రాహ్మణ, వీరు సదా స్మరణ, తపస్సు, ధ్యానములచే పరమేశ్వరుని నిష్కామముచే పూజించువారు. రజోగుణమే క్షత్రియులు. డాంభికము, అహం, గర్వము వీరు ఇంద్రాదులను పూజించువారు. మిశ్రమగుణము వైశ్యులు. వీరు దేశదేశములకు వస్తువులు పంపువారు. అనగా అధోలోకములు 7, ఊర్ధ్వలోకములు 7. ఈ 14 భువనములకు రాజాజ్ఞకు లోబడినవారై పరమాత్మయే రాజు. ఆరాజుకు వ్యతిరేకము లేక సాంఖ్యమనే సరుకులను తత్వ విచారణచేయువారు వీరు కోమట్లు. తమోగుణమే శూద్రులు. వీరు అమితమైన చంచలము గలవారు ఎట్లనగా పితృదేవతలను, కర్మదేవతలను, భూత, ప్రేత, పిశాచములను పూజించుచుందురు. ఈనాలుగు జాతులవారికి గూడ నేనే ఫలితము నిచ్చుచున్నాను. వారి వారి భక్తితో ఏదో దేవునకు ఏది అనగా ఫలం, పుష్పం, తోయ, భోజనము లేవిచ్చుచున్నారో

అవియు గూడ నన్నే చేరుచున్నవి.

అర్జు:— కర్మయన నెట్టిదో? అకర్మయన నెట్టిదో తెలియ జాలకున్నాను. విశదముగా బోధింపుము.

కృష్ణ:— తనయొక్క తెలివిచే అనగా తెలివియేబుద్ధి, బుద్ధియే జ్ఞానము, జ్ఞానమే వేదము. ఆరంభింపబడిన నిష్కామ కర్మలచే జ్ఞానమును సంపాదించుకొనుట యనునది జ్ఞానము కలుగుటకు ముఖ్యము. జ్ఞానము కలిగినవానికి పరమ శాంతి కలుగును. దీనినే కర్మ యందురు. జ్ఞానము కలిగి శాంతి లేని వారికి అకర్మ యందురు.

అర్జు:— కర్మ యొక్క ఎద్ధాస్థితి ఎవరున్నా తెలిసి కొన జాలరా?

కృష్ణ:— జ్ఞానిమాత్రము తెలిసికొనుచున్నాడు. ఏవిధ మనగా తెలిపెద వినుము. ఘటావస్థయందు ప్రాణ వాయువు. ఆత్మతోడ నాదబిందువులను ఏకముచేసి కంఠస్థా నము నందలి మధ్య చక్రము నందుండునపుడు యోగి దృష్టాం సనము గలవాడై జ్ఞానియై శ్రేష్ఠుడై దేవతలకు సమానమైన వాడగుచున్నాడు.

అర్జు:— మాధవా! నీవు భోధించు వాక్యములను ఆచ రణ యందుంచుట కష్టముగా నున్నదే?

కృష్ణ:— జ్ఞేయము, జ్ఞానము యీరెండు మనస్సు

యొక్క కల్పనచేత మనస్సని చెప్పబడుచున్నవి. జ్ఞానము, జ్ఞేయము సమిష్టియై మనస్సుతో లయమగునేని వేరేమార్గము లేదు. అనగా ద్వైతము లేదు.

అర్జు:- ఓ చక్రీ! నీవు ఉపదేశించినట్లు జేయ నుత్సాహము కలుగుచున్నది. యికను కర్మయోగి లక్షణములు సెలవిండు.

కృష్ణ:— అరిషడ్వర్గములనుండి విడిన జీవుడు శివుడనబడును. యోగములేని జ్ఞానము మోక్షము నెట్లు నొసంగును? యోగము జ్ఞానము లేనియెడల మోక్షకర్మమందు సామర్థ్యము కలది కానేరదు. గనుక జ్ఞానమును, యోగమును, ముముక్షువులు ధృఢముగ నభ్యసింపవలయును.

అర్జు:— ముముక్షువులు అనగా యెట్టివారు?

కృష్ణ:— వారు గొప్ప మహామునులు. వారికి ఇచ్ఛా భయము, క్రోధము కోర్కెలు, రోగములు లేనివారు అనగా జ్ఞానేంద్రియములందు వారి మనస్సు చేరకపోవుటయే రోగములు లేనివారని యర్థము. జీవుడా అజ్ఞానవృత్తులన్ని భ్రాంతిగా విడచుటయే యోగము. ఇంకా చెప్పెద వినుము. ఆసగించు పరిమాణము గుణము యుండకుండవలెను. ఫలాపేక్ష నేను చేయుచున్నాననే కోరిక భ్రాంతిగా యుండకుండవలెను. ఉండినచో అదే అహం. కర్మచేయు కాలమందు అనగా గుణములను కట్టడిలో పెట్టుటయే కర్మచేయు కాలము. అప్పుడు మితిలేని కష్టములు

వచ్చుచుండును. జాగ్రత్తగా కాయవలయును. పడవ చాప ఎత్తుకొని పోవుచున్న సమయమున సుడిగాలి ఏప్రకారముగా వస్తుంటే ఆపడవవాడు జాగ్రత్తగా కాసుకొని ఆపద తప్పించుకొని ఏవిధముగా పడవను నడుపుకొనుచున్నాడో ఆవిధముగానే ఈస్థూలాంగమనే పడవను వాత, పైత్య, శ్లేష్మములనే సుడిగాలికి తప్పించుకొనుటకు అజ్ఞానవ్యాధులనే చేపలు, ఎండ్రలు, నీటిసర్పములకు పడవను తప్పించుకొంటూ చూచిపోవలయును.

అర్జు:- కర్మ చేయుట కన్నను యజ్ఞ మొనర్చుట గొప్ప కదా!

కృష్ణ:- నీవు చెప్పినది సరియే. బాహ్యేంద్రియ యజ్ఞములకన్న మానసయజ్ఞమే శ్రేష్ఠముగాని కర్మ చేయుటకే నీవు భయపడుచున్నావే మానసయజ్ఞము చేయగలవా?

అర్జు:- దేవా! బాహ్యేంద్రియ యజ్ఞము చేయుదునే గాని మానసయజ్ఞము నేను చేయలేను. కాని ఒకసారి మానస యజ్ఞము యొక్క విధానము చెప్పుము; వినెదను.

కృష్ణ:- చెప్పెదను వినుము. వినినదానిని ఆచరణ పెట్టుట మానసయజ్ఞము. సర్వేశ్వరా అధోలోకములు 7, ఊర్ధ్వలోకములు 7. ఈ 14 భువనములకు అకల్పితస్వయం అనగా నిన్ను పుట్టించేవారు ఒకరులేరు. నీయంతట నీవేపుట్టే వాడవు. బ్రహ్మమైయున్న నీవు విశ్వబ్రహ్మ నీవే, మయ

బ్రహ్మ నీవే, మనుబ్రహ్మ నీవే, త్వష్టబ్రహ్మ నీవే, శిల్పి బ్రహ్మ నీవే అనాదిమూల ప్రకృతిస్వామైన ఓ పరమాత్మా! దీపమునకు నీడ యెట్టిదో ఆలాగునే ధర్మాధర్మములు నిరూపించుటకై మాయతో గూడి ప్రకృతి, మాయ రెండూ ఒక్కటే. పురుషాసంయోగము వలన జ్ఞానమే పురుషస్వరూపము. జ్ఞానమనే పురుషుడు అజ్ఞానమనే స్త్రీ ఈరెండు సంయోగములచేత జగన్నాటక అనగా ఈశరీరమే జగత్ వినోదంబు సలుపుచుండుటచే అనగా షడరుచులున్న, కష్ట సుఖము లున్న ఓ పరంధామా! నీచేతి కీలుబొమ్మవలె నీవెట్లాడించిన అట్లాడుచున్నవి. ఈవిలాసంబులు నీవినోదంబు కొరకే గాని వేషధారియైన నావినోదంబు కొరకు గాదు. కాబట్టి నాయొక్క పాంచ భౌతిక శరీరమే నీయొక్క దేవాలయంబును, నా దేహాదులను ప్రకాశింపచేయుచున్న పరమాత్మయే సాక్షియైన సర్వేశ్వరుడున్ను నాసంకల్పరూపమైన మనస్సే పరాశక్తియైన పార్వతి. నాయొక్క యింద్రియసమూహమే నీయొక్క సేవకబృందమున్ను, నాయొక్క విషయానంద భోగమే మీయొక్క పూజార్చనమున్ను, నాయొక్క నిద్రావస్థయే మీయొక్క ఆత్మసమాధిన్ని, నాయొక్క పద సంచారమే మీయొక్క ప్రదక్షిణ నమస్కారంబులును, నాయొక్క వాక్కు ప్రసంగములే మీయొక్క స్తోత్రపాఠంబులు మాయాకల్పిత జీవుండనైన నేనొనర్చు సర్వవ్యాపారమును పార్వతీపరమేశ్వ

రుల యీరాధనగాను నిశ్చయించి నాహృదయంబున మానస పూజ చేయుచున్నాడను. ఓ పరమేశ్వరా 14 భువనములకు మూడు లోకములకు చరాచరాత్మకమునకు, గృహమునకు యజమాను డెట్టివాడో ఆలాగునే నీటికంత యజమానుడవు సర్వాధిష్టానకూటస్థ పరబ్రహ్మమై సర్వ భూతముల యందు ప్రకాశించుట వలన అన్ని భూతములయందున్న ఆత్మ నీవే సుమా! నీయందైక్యము జెందుటకై నాహృదయంబు నత్యాసక్తితో నిన్ను ధ్యానించుచున్నాడను. ఓ జగంధామా! నీవు సర్వ పరిపూర్ణుండవై అండము, పిండము, బ్రహ్మాండము. స్థూలాంగమే అండము, సూక్ష్మాంగమే పిండము, అనుసన్ధమే బ్రహ్మాండము యీమూటిని దాటిమిగిలి శేషమైయున్న వాడవని భావము జీవుండనైన నేను నీనిజరూపమును దర్శించుటకు నిన్ను నాహృదయంబున నిష్కామముతో నాహ్వాన చేయుచున్నాడను. ఓ పరమేశ్వరా! నీవు సర్వధారుండవై చరాచరాత్మయందు అధోలోకములు 7, ఊర్ధ్వలోకములు 7 యమలోకము, పితృలోకము, స్వర్గలోకము, సూర్యమండలం, చంద్రమండలం, అగ్నిమండలం, వాయుమండలం, కైలాస, మంధరగిరి, మహామ్మేరు. సప్తద్వీపములు సప్తసముద్రములు యీసర్వమునూ నిండి మిగిలియున్నావాడవు గనుక నీకు నవ రత్న ఖచిత సింహాసన నమర్పించుచున్నాడను.

అర్జు:- కృష్ణా! ఏమి యింత వేగముగా చెప్పుచున్నావే?

నావంటి మందమతికి యిట్లు చెప్పుట ధర్మమా! చక్కగా నాకు తెలియునట్లు మీరిప్పుడు చెప్పినవన్నియు ఏయేస్థానములో ఏవేవియున్నవో చక్కగా తెల్పుము.

కృష్ణ:— నీకూ, నాకూ యున్న బేధమును చెప్పుచున్నాను వినుము. పెద్దఎత్తైన పర్వతముపై నిలబడి క్రిందికి చూడగా భూమండలములో యున్న వస్తుపదార్థము లన్నియు అణువుతో సమానముగా కనబడుచున్నవి. అలాగున క్రింది భాగమున యున్నావు. నీకు పై భాగమున మాయయున్నది. మాయకుపైన నేనున్నాను. నీవు మాయను దాటి నాలో చేరితే నేను చెప్పిన విషయములన్నియు నీజ్ఞాననేత్రములకు అప్పుడు శుభ్రముగా కనబడును. ఎంత భ్రాంతితో అడుగుచున్నావో తెలిపెద వినుము. అధోలోకములు 7. అతల అరికాళ్ళు, వితల మీగాళ్ళు, సుతల మడిమలు, తలాతల పిక్కలు, రసాతల మోకాళ్ళు, మహాతల తొడలు, పాతాళము గుదమందున్నది. ఊర్ధ్వలోకములు 7. భూలోకము ఆధారము, భువర్లోకము స్వాధిష్టానము, సువర్లోకము నాభిస్థానము, మహర్లోకము హృదయము, జనర్లోకము కంఠము, తపోలోకము లలాటము, సత్యలోకము శిరస్సు. ఆధారము లగాయితు నాభిస్థానము వరకు ఎమలోకము; నాభిస్థానము లగాయితు విశుద్ధ వరకు పితృలోకము; విశుద్ధ లగాయితు సహస్రారంవరకు స్వర్గలోకము. మండలములు చెప్పెదను. మణిపూరకమనగా సూర్య

మండలం; అనాహత యనగ చంద్రమండలం విశుద్ధస్థానమనగా అగ్నిమండలం; లలాటస్థానమే వాయుమండలం. ఎడమభాగమే శిరస్సు, మంధరగిరిపర్వతం, కుడిభాగం శిరస్సు కైలాసగిరి పర్వతం శిరస్సునకు మధ్య మహామేరు పర్వతము. సప్తద్వీపములు అన నేమిటో చెప్పుచున్నాను వినుము. జంబూద్వీపము శిరస్సు చుట్టున యున్నది. పక్షద్వీపము ఎముకలయందున్నది. శాఖ ద్వీపము సహస్రారమనే శిరస్సు యందున్నది. శాల్మలీ ద్వీపము చర్మమునందున్నది. పుష్కరద్వీపము గోళ్ళయందు ఉన్నది. కుశద్వీపము మాంసమందున్నది. క్రౌంచద్వీపము వెంట్రుకలయందున్నది. సప్తసముద్రములను చెప్పుచున్నాను. లవణ సముద్రము మూత్రము [ఉప్పు], యిక్షుసముద్రము చెమట [చెరుకు], సురసముద్రము యింద్రియశుక్లము [కల్లు] సర్పిసముద్రము స్త్రీ పురుషులకు మోహమువలన గలుగు ద్రవము [నెయ్యి] దధిసముద్రము శ్లేష్మ, కళ్ళె, కఫము [పెరుగు], క్షీరసముద్రము నోటిజొల్లు (పాలు), శుద్ధోదక సముద్రము కన్నీరు [మంచినీళ్ళు], వీటికి అన్నిటికి అతీతమైన వాడు, నిత్యుడు, శాశ్వతుడు, నామరూపము లేనివాడు, సంగరహితుడు ఎక్కడ చూచిన నిండియున్నవాడు. అర్జునా! యిప్పటికైనా తెలిసెనా?

అర్జు:— మాధవా! మరొక అనుమానమున్నది. దానిని గూడా చెప్పుము?

కృష్ణ:- ఆ యనుమాన మేమిటో చెప్పుము.

అర్జు:- తిధులు, వారములు, నక్షత్రములు, యోగములు, కరణములు యీ ఐదున్ను కలసి పంచాంగమని చెప్పెదరే అదెట్లు?

కృష్ణ:- ఔను; నిజమే. దీనిపేరే పంచ బ్రహ్మలని వాడెదరు.

అర్జు:- పుండరీకాక్షా! ఈబ్రహ్మలు దేనికధిపతులు?

కృష్ణ:- మనుబ్రహ్మ యితడే ఉమామహేశ్వరుడు, ఆదిశక్తి యిదియే తిధులు. మయబ్రహ్మ యితడె లక్ష్మీనారాయణ. పరాశక్తి యిదియే వారములు. త్వష్టబ్రహ్మ యితడే సరస్వతి బ్రహ్మ. యిచ్ఛాశక్తి యిదే నక్షత్రములు. యోగం యిదియే శిల్పి బ్రహ్మ శచీదేవి దేవేంద్రుడు క్రియాశక్తి. కరణములు విశ్వబ్రహ్మ వీడే ఛాయాసూర్యుడు. జ్ఞానశక్తి. తెలిసినదా.

అర్జు:- మాధవా! తెలిసినది; గాని మానస పూజ విధానము చెప్పుము.

కృష్ణ:- పరమపురుషా! పరంజ్యోతిమైయుంసి అనగా బాహ్యేంద్రియమునకు సూర్యుడు ఏవిధముగా ప్రకాశించుచున్నాడో ఆవిధముగా నీవు యీస్థూలాంగమునందు ప్రకాశించుచున్నావు. గనుక నాలోయున్న అరిషడ్వర్గములను నీకు

అర్ఘ్యముగా వదలుచున్నాను. ఓ ప్రత్యేకాత్మా నీవు అశరీరుండవై చంచలము లేక ఏల నిర్మలముగా యుండుట వలన నాలోయున్న రాగద్వేషముల నే పంచక్లేశములు నీకు పంచామృతస్నాన మర్పించు చున్నాను. ఓ జగదీశ! విశ్వము నే నీవు వస్త్రముగా ధరించుట వలన నాలోయున్న అవిద్యాయ నే మాయ సువర్ణ పీతాంబరముగా నీకు సమర్పించు చున్నాను. ఓ దేవా నీవు సూత్రాత్మగండవై సర్వజీవులను జ్ఞాన నేత్రంబుగా నుండుట వలన నాలోయున్న సూషణాత్రయములు నీకు యజ్ఞోపవీతముగా సమర్పించుచున్నాడను. ఓ జగన్నాథ! నీకు సుగంధ లేపన మక్కర లేకున్నను దుర్గంధ దేహుండవైన నాలోనున్న వాసనత్రయము నే గంధము నీకు సమర్పించు చున్నాను. ఓ జగత్సాక్షీ నీవు హిరణ్మయుండవై ఆభరణములు నీకు లేకున్న, నాలోయున్న సప్త అజ్ఞాన భూమికలను. నీకు ఆభరణములుగా సమర్పించు చున్నాను. ఓ జగత్పతీ! నీవు వాసనారహితుండవై నిరంజనముగా నుండుట వలన నీకు పుష్పవాసన లక్కర లేకున్నను నాలోయున్న పుష్పములను నీకు సమర్పించు చున్నాడను. ఏవిధముగా అనగా అహింసా ప్రథమపుష్పం అనగా మాతా పితాదులను గురువు సాధు సజ్జనులను హింస పెట్టకుండా యుండడమే లోకజ్ఞానమే గాని బ్రహ్మజ్ఞానముగాదు సత్యమే తల్లి జ్ఞానమే తండ్రి యీ రెండు మరచుటయే హింస పుష్ప మింద్రియ నిగ్రహం; అనగా

జ్ఞానేంద్రియములు బంధించినది గాదు. అవి స్థూలమునకే గాని సూక్ష్మాంగమునకు గాదు. రాగ ద్వేషములైన పంచ క్లేశములు అవిద్యా, రాగ, ద్వేష, క్రోధ అభినివేశములు బంధించవలెను. సర్వభూతదయాపుష్పం లోకమునందు యున్న భూతముల యందు దయ అది లోకధర్మమే గాని జ్ఞాన ధర్మము గాదు. అనగా 25 తత్వములలో యున్న అధిపతులైన అధ్యాత్మ దేవతలను ఆరాధన చేయుటయే భూత దయ. క్షమాపుష్పం విశేషతో హాసమస్తమునందు ఓర్పు గలిగి యుండుట లోక ధర్మమే కాని జ్ఞాన ధర్మము గాదు. ఏవిధమనగా అశ్రద్ధ లేకుండ సదా కష్టమునందు సుఖమునందు వైరాగ్యముతో భగవంతుని ధ్యానించుటయే జ్ఞాన ఓర్పు శాంతి పుష్పం లోకమునందు ఒక [illegible] యుండుట అది లోక శాంతమే గాని బ్రహ్మజ్ఞాన శాంతము గాదు. మనస్సును చలనము లేకుండ నిర్మలముగ ఒకచోట నిలబడియుండుటయే బ్రహ్మజ్ఞానము. తపఃపుష్పం స్నానము చేయుట జపము చేయుట, భగవంతుని ధ్యానించుట ఇది లోక తపస్సు గాని ఆత్మ తపస్సు గాదు. సదా యెప్పుడును జాగ్రత, స్వప్న, సుషుప్తులలో గూడ మూడవస్థలనైన [illegible]మునందు స్మరించుటయే తపస్సు. ధ్యానపుష్పం తెల్పెదను. మనస్సును వాసన త్రయములందు నిలుపక సదా కష్ట సుఖములలో గూడ భగవంతునియందు మనస్సు నిలుపుటయే ధ్యానము. సత్యపుష్పా

మిదంపుష్పం. ప్రపంచమందు ఏది శాశ్వతము ఏది ఆశాశ్వతము అని తెలుసు కోవడమె సత్యం. విష్ణోః ప్రీతికరంభవేత్ ఈఎనిమిది పుష్పములు జనన మరణము లేని పరమాత్మకు యీపుష్పములతో పూజించవలెనని నాప్రార్థన. ఓపరాత్పరా దేహేంద్రియాదుల కతీతుండవై వెలుగుచుండుట వలన నాలోయున్న పంచ మలములు, ఆణవ, కార్మిక, మాయిక, మాయేమల, తిరోదాన యీ 5 మలములు నీకు కర్పూర ధూపానికి ఒదలుచున్నాను పరాత్పరా: ఓ సర్వాంతరా! నీకు దీప ప్రకాశము లేకున్నను నాలో యున్న అజ్ఞానమే నీకు దీపముగా నిలుపుతూ యున్నాను. ఓ నిర్విషయానంద! నీవు విషయశూన్యుండ వగుట వలన నీకు తాంబూలం అక్కర లేకున్నను నాలో యున్న తృష్ణ యనే యాశను నీకు తాంబూలముగా ఇచ్చుచున్నాను. యీప్రకారముగా అనగా జీవుడు పరమాత్ముని మానసముగా అనగా యిదే ఆత్మయజ్ఞం చేయ వలయును.

అర్జు:— జ్ఞానమునొందుటకింత శ్రమపడవలయునుకదా:

కృష్ణ:— అవును; జ్ఞానముతో సమానమైన వస్తువు లేదు. అది పరమ పవిత్రమైనది. గురూపదేశానుసారము చాలాకాలము యోగాభ్యాసము సల్పుకొని ఆత్మజ్ఞానము కలుగును.

అర్జు: - నాకేమియు తోచకున్నది ఏమిచేయనగుదును?

కృష్ణ:— విష్కామకర్మచేయుము. యుద్ధమొనర్పుము.

# కర్మ సన్యాస యోగము.

అ యి ద వ య ధ్యా య ము

అర్జు:- హే మాధవా! నీఒకసారి కర్మ వదలమనియు మరొకసారి చేయుమనియు చెప్పుచున్నావు. యీ రెండింటి యందు ఏది శ్రేష్టమో దానిని నిశ్చయము చెప్పుము.

కృష్ణ:- నీలోయున్న కోరికలు నశింపయినంతవరకు అజ్ఞానగుణములనే వృత్తులను కట్టడిచేయుటయే కర్మచేయుట. గుణశూన్యములై సదా నిశ్చలముగా లయమైనవో అప్పుడు కట్టడిలేదుగనుక కర్మవదలిపెట్టుమనిభావము. కర్మచేసి వదలుటయేగొప్ప యోగము. దీనినేకర్మయోగముగొప్పదనిభావము.

అర్జు:- మాధవా! సన్యాసము గొప్ప యందురే నేను సన్యశించెదను.

కృష్ణ:- సంకల్పములు: మనస్సు చంచలమే సంకల్పము రాగద్వేషములు 13 గుణములు. ఎవడయితే నరుకుచున్నాడో అదియే కర్మయోగము. వాడే సన్యాసి, వాడు సులభముగా జనన మరణము నే సంసారమునుండి తప్పించుకొనువాడు.

అర్జు:- మాధవా! కర్మ చేయునప్పుడు ఏవిధమున చేయుచో పాపము లేదు?

కృష్ణ:- కర్మ చేయునప్పుడు అహం, డాంభికము,

గర్వము యున్నచో తప్పక పాపము కలుగును. పైన చెప్పిన పరిహారము ఆమూడు గుణములను నశింపచేశి శుద్ధ సత్వగుణములతో కర్మ ఎవరు చేయుచున్నారో వారికి పాపము లేదు. యింద్రియ నిగ్రహము గలవారికి పాపము లేదు. యింద్రియ నిగ్రహము లేనివాడు పాపుడు.

అర్జు:- కృష్ణా! నీచకార్యములు చేయువారు ఎవరు? చేయనివారెవరు?

కృష్ణ:- ఆత్మతత్వమెరింగినవారు నీచమైనపనిచేయరు. పుష్పములయందు మకరందమును గ్రోలు భ్రమరము అటుగా తుమ్మెద అశుద్ధ పదార్థములపైకి పోవునా? పోదు. గనుక సదా నిత్యమాత్మానందము అనుభవించు తత్వజ్ఞుడు విషయానందము కోరునా? కోరడు. యింద్రియ నిగ్రహము లేక ఆత్మజ్ఞానము కలుగునని ఎచ్చటను చెప్పబడి యుండలేదు. జ్ఞాని శాస్త్రవిధి ననుసరించి కర్మల చేయును. స్వేచ్ఛ ఆచరింపడు.

అర్జు:- మాధవా! సర్వకార్యము లెట్లుజరుగుచున్నవి?

కృష్ణ: - వారి వారి గుణ స్వభావము వలన.

అర్జు:- స్వభావ మన నెట్టిది?

కృష్ణ:- అదియే మాయ,

అర్జు:- మాధవా! ఆత్మకు పుణ్య పాపములు అంటనప్పుడు పుణ్యకార్యములు మాత్రమే ఏల చేయవలయును?

కృష్ణ:- పాప కార్యముచే అవివేకమున్నా అందు వలన మోహము, అజ్ఞానము, భ్రాంతి గలుగుచున్నది. పుణ్యకార్యములచే జ్ఞానము, వైరాగ్యము, శ్రద్ధ, దీక్ష మొదలైనవి గలుగుచున్నవి. మోహముచేత నరకము, మనస్సు భగవంతునియందు లగ్నముగాక చలించుటయే నరకము. పార్థా! వైరాగ్యముచే కష్ట సుఖములు కలిగినప్పటికి పట్టినపట్టు వదలకుండుటయే వైరాగ్యము. దీనిచే మోక్షము కలుగును. కర్మ చేసినగాని యాజ్ఞానము శుద్ధింపదు కర్మజ్ఞానమునందు కర్మలు చేయుచున్నను యివి జ్ఞానపూర్వకము లగుటచే బ్రహ్మప్రాప్తికి ప్రతిబంధకములు గావు.

అర్జు:- నిత్య సుఖము నిచ్చు మోక్షమునకు కారణములగు పుణ్యకార్యముల నాచరింపక నరకమునకు కారణములగు పాపకార్యముల నాచరించి మానవులేల దుఃఖించుచున్నారు?

కృష్ణ:- దీనికి మూలము అజ్ఞానముచే.

అర్జు:- అజ్ఞానము ఏవిధముగా నశించును?

కృష్ణ:- ఆయజ్ఞానము జ్ఞానముచే పోగొట్టుకొనిన వారి జ్ఞానము సూర్యునివలె పరమాత్మ తత్త్వమును ప్రకాశింపచేయుచున్నది. సూర్యబింబమునకు మేఘములు అడ్డుతగిలి కిరణములు నాశనమగుచున్నవా? అలాగునే అజ్ఞానమనే మేఘములు ఆత్మయను సూర్యుని అడ్డుతగిలి ఆత్మప్రకాశము లేక చీకటిలో మునిగి బాధపడుచున్నారు జీవులు. అట్టి జీవులు

సదా ఆత్మయనే సూర్యునియందు మనస్సును లగ్నపరచి అజ్ఞానమనే మేఘము అడ్డురాదు. మనస్సు భగవంతునిలో లగ్నపరచుటయే అజ్ఞానము నశించుట.

అర్జు:— అజ్ఞానము నశింపచేసిన శిద్ధిపురుషుడు ఏవిధముగా ప్రవర్తించును?

కృష్ణ:— విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణుని సప్తజ్ఞానభూమికలు వంట ఎవరైతే చేయుచున్నారో వారే జ్ఞానసంపన్నులు, వారే నిజమగు బ్రాహ్మణులు. అట్టివారిని గోవును అనగా బుద్ధి, తెలివి, జ్ఞాత లేక వేదమని భావము. ఈగోవుయొక్క పాలు త్రావినవారెవరో అట్టివారిని ఏనుగును అనగా అహం దానిని కట్టినవారెవరో అట్టివారిని కుక్కమాంసమును దిను ఛండాలుని అనగా మనస్సు కుక్కవంటిది. సదా కుక్క ఛండాలమునే గోరుచుండును. అట్టి కోరికను జయించినవాడు మనస్సనే కుక్కను చపలముపోగొట్టి నిశ్చలత్వముగా దానిని బట్టిన వాడెవడో వాడే కుక్కమాంసమును దిననివాడుగా భావింపుము. అట్టివారిని సిద్ధపురుషులు జూచి సంతోషించెదరు.

అర్జు:— నావంటివాడు శిద్ధిని పొందుటెట్లో చెప్పుము?

కృష్ణ:— మొదట విషయసుఖములయందు ఆశ వదలవలయును. ఇంద్రియములకు ఏది యిష్టమో దానిని వదలి

పెట్టవలెను. స్తోత్రమునకు గానము యిష్టము గాన దానిని వదల వలయును. త్వక్కు: దీనికి శయనించుటకు పరువు మొదలయిన సుఖములు, సువాసన ద్రవ్యములు యిష్టము. దానిని వదల వలయును. చక్షు: దీనికి రూపము జూచుట యిష్టము దీనిని వదల వలయును. జింహ్వా రసములు గుర్తించుట యిష్టము దానిని వదల వలయును. ఘ్రాణము దీనికి సువాసన యందు యిష్టము దానిని వదల వలయును. వీటికి ద్వంద భూతములని పేరు. అవి ఏవి యనగా: శబ్దము గుర్తించుట, స్పర్శతాకుట, రూపము పోల్చుట, రసము రుచిని గ్రహించుట, గంధము పీల్చుట, వాక్కు వాసన వృత్తులు పలుకుట, పాణి దుష్కర్మ చేయుట పాదము తిరుగుట గుహ్యము స్త్రీలోలుడై యుండుట గుదము అపానమును గట్టుట ఏయే యింద్రియములు ఏయే విషయములు చెప్పబడి యున్నవో వాటిని బంధించిన మనస్సు స్వాధీనము కలుగును.

అర్జు:- కృష్ణా! యింద్రియములను జయించు విధాన మిదియేనా మరేమయిన నున్నదా?

కృష్ణ:- అర్జునా! యింకా మరొక విధమున్నది చెప్పెదను వినుము. శ్రోత్రములు బంధించి దశనాదములు వినుటయే బహ్మజ్ఞానము. త్వక్కు చలనము లేక విభూతి ధారణచే ఆ శరీర శుద్ధి కలిగి యుండవలెను. చక్షు యీ స్థూలాంగములో యున్న ఆత్మను చూచుటయే బ్రహ్మజ్ఞానము జింహ్వా లంబికా యోగము నందు పెద్ద నాలుకవద్ద యుండే కొండ నాలుక దానికి సమీపము నందున్న బిలములో నాలుక కొనను గుచ్చి

అమృతమును పీల్చుట లేక చప్పరించుట బ్రహ్మజ్ఞానమయినది. ఘ్రాణము త్రికాలముల యందు ఉచ్ఛ్వాస నిశ్వాస స్థంభిన చేయుటయే బ్రహ్మజ్ఞానమయినది. జ్ఞానేంద్రియములు 5. తన్మాత్రములు 5. యీ పది యింద్రియములుకు యిదియే స్వభావములు.

అర్జు:— కృష్ణా! కర్మేంద్రియములకు ఏదైన నియామక మున్నదా? లేదా?

కృష్ణ:— వాక్కు, మానసికముగ సదా భగవంతుని ధ్యానించుటయె బ్రహ్మ జ్ఞానమైనది. పాణి పరమాత్ముని సాధువులను పూజింపబడుటకై యున్నది. పాదపద్మాసనాసీనుడై యుండుట బ్రహ్మజ్ఞానమై యున్నది. గుహ్యం ఊర్ధ్వరతి మూలాధారం బంధించి వుడ్యాణ లాగి జాలంధర చేత శుక్లమును సహ స్రారమనే కమలములో పడుటయే ఉపరతి. దీనిని అమృతమందురు. అధోరతి యనగా శుక్లముగా మారెను. ఊర్ధ్వరతి అమృతముగా మారెను. గుదము నందు ఎడమకాలి మడమను. గుదమునందు నిలిపి కుడికాలు మడమను స్వాధిష్టమునందు నిలిపి యోగముతో అపాన వాయువును బంధించ వలయును. ఆ ప్రకారము చేయుచు మనస్సును స్వాధీనము చేసుకోవలయును.

అర్జు:— మాధవా! యోగి యొక్క లక్షణముల నింకను సెలవిండు.

కృష్ణ:— నేను చెప్పిన ప్రకారము ఎవరైతే నడచెదరో వారికి మోక్షానందము ననుభవించుచున్నారు.

# ఆత్మ సంయమ యోగము.



## ఆరవ యధ్యాయము

అర్జు:— మాధవా! మీరిప్పుడు సన్యాసమును యోగమును వేరు వేరుగా బోధించితిరి. సన్యాసమే గొప్పదని నాకు స్ఫురించు చున్నది. గాన నేను సన్యసించి యోగము ననుష్ఠింతును. ఇక యుద్ధమెందులకు.

కృష్ణ:— కామ క్రోధ రహితమైన వాడును, ఆత్మసంయమనము గలవాడును, వాడే యాత్మ జ్ఞానసంపన్నుడు. అట్టివానికి త్వరలోనే మోక్షము లభించును.

అర్జు:— కృష్ణా సర్వ సంగ పరిత్యాగమొనర్చి కాషాయాంబరములు ధరించి యెట్టి కర్మలు చేయక ఆత్మనిష్ఠయందుండుట సన్యాసమని చెప్పుదురే?

కృష్ణ:— నిజమైన సన్యాసి ఫలాశను వదలి కర్మలు చేయును. కర్మఫలనాశ్రయింపక శాస్త్రానుసారముగ కర్తవ్య కర్మల చేయుచున్నాడో యతనినే సన్యాసియనియు, యోగియనియు చెప్పవలయును.

అర్జు:— కర్మలు ఎంతవరకు యాచరింపవలయును?

కృష్ణ:— కర్మయొక్క శమము అనగా మనశ్శాంతి యని అర్థము. శాస్త్రప్రకారము కర్మ ఎప్పటికి వదలరాదు.

అని వేద స్మృతులు చెప్పుచున్నవి.

అర్జు:- పుండరీకాక్షా! మనస్సు పూర్ణశాంతి లభించినదని యెట్లు తెలిసికొనగలము?

కృష్ణ:- ఎప్పుడైతే నేను ఈపని చాయించాల నేను చేస్తూయున్నాను. ఇది నాది నీది యనే భావము వదలినాడో బాహ్యేంద్రియ కర్మలయందాశక్తి నశించెనో వాడు సంకల్ప రహితమైన జ్ఞానియగుచు పూర్ణశాంతిని పొందినవాడు.

అర్జు:- మాధవా! సంకల్పమే లేనపుడు సకామకర్మ గాని నిష్కామకర్మ గాని చేయుట యెట్లు?

కృష్ణ:- ఎవనియొక్క ఆత్మ జ్ఞానముచేతను విజ్ఞానము చేతను వివిధమగు జ్ఞానముచేతను తృప్తినొందినదో ఎవడు తన యింద్రియముల జయించెనో ఎవడు కూటస్థుడాయెనో త్రివేణి సంఘమందు చేరినవాడెవడో మట్టిగడ్డరాయి, బంగారము మొదలగువానిని సమానముగా దలచునో యాకర్మ యోగినే యుక్తుడని సిద్ధావస్థ నొందిన వాడని చెప్పుదురు. వాడే నిష్కామయోగని పేరు.

అర్జు:- మాధవా! మనస్సు మహాచంచలమైనదికదా?

కృష్ణ:- నిజమే; మనస్సు వాసనత్రయములలో చేరుటయే బంధము. మనస్సు చలనము లేక స్వాధీనమైనది మోక్షము.

అర్జు: మాధవా! మనస్సును జయించుటెట్లు?

కృష్ణ:- వాసనత్రయములందు మనస్సును వెళ్ళనీయక పోవడమే దర్భాసనము. దానిపై మనస్సు జింకయంటిది. ఆ జింకకు యుండే సందేహములు విడగొట్టడమే కృష్ణాజినము. దానిపై శుద్ధసత్వగుణమనే వస్త్రము పరచి భూమిని మెరక పల్లములులేని స్థలము అనగా త్వక్కు చర్మమునందు ఏలాటి బేధ వికారము లేకపోవుటయే భూమి చిత్తము యొక్క అనగా చిత్తము సదా ఆలోచనచేయు స్వభావము గనుక ఆ చింతను తృణీకరించి యింద్రియముల యొక్క వ్యాపారములు నిరోధించి అనగా శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణ అనగా చెవులు శబ్దము లాలకించుట, త్వక్కు వేడి చల్లదనము చలి వీటిని గమనించుట చక్షు బాహ్యేంద్రియములలో ఏది మనము చూచుచున్నామో అదే మనము యోగము నందున్న దానినే మనము చూచుచున్నాము. జింహ్వా షడ్రుచులు కోరికయే దీనిపని. ఘ్రాణ సువాసన దుర్వాసన చూచెడిపద్ధతి ఘ్రాణ; గనుక యివి వాటి వ్యాపారములన్నియు కట్టివేశి మనస్సు నేకాగ్రము చేశి అనగా చలింపు లేక యుండుటయే ఆసనము లేక యోగమనిపేరు. తెలిసినదా కాయము [శరీరము] నూ లేక వెనుదండిని నిక్క పొడుచుకొని అనగా మూలాధారము బంధించి ఎడమకాలి మడమను ఆధారమువద్ద నిలిపి కుడికాలి మడమను స్వాధిష్ట

నేయి, కలకండ, వెన్న, చక్కెర, తేనె, శొంఠి, పొట్లకాయ. పంచశాఖములు అవి ఏవనగా: చక్రవర్తికూర, పొన్నగంటి, చిరుకూర, తెల్లగరగ, తిప్పతీగ, పచ్చపెసలు, శుద్ధోదకం యివి యోగులకు ముఖ్యములు.

అర్జు:— యోగి నిద్దుర యెక్కువ చేయవచ్చునా?

కృష్ణ:— జాగ్రత్తవదలి అజాగ్రత్తయే నిద్దుర గనుక అదియే సుషుప్తి. సుషుప్తియే నిద్దుర; గనుక జ్ఞాని జాగ్రత్తను సదా వదలడు. అజాగ్రత్తలో జ్ఞాని యుండగూడదు.

అర్జు:— కృష్ణా! యిక నెట్లుండవలెను?

కృష్ణ:— ఎవనికి ఆహారము మితమై కర్మాచరణము తగుమాత్రముండునో నిద్రలేమీలు పరిహారము చేయుచూ నిద్ర మేల్కొనుటయు ఎవనికి విపరీతముగా యుండునో అట్టి వానికి యీ యోగము దుఃఖములు పోగొట్టును. అనగా సుఖము కలుగును.

అర్జు:— మాధవా! చిన్న మనవి.

కృష్ణ:— ఏమిటా చిన్న మనవి?

అర్జు:— పైన చెప్పిన పరిహారము ఆహారము, కర్మ. నిద్దుర మేల్కొనుట యివి సుఖములు గలుగ చేయునని చెప్పినావే అవి బాగుగ దెల్పుము?

కృష్ణ:— జ్ఞాని సదా తపస్సు, స్వాధ్యాయ, యీశ్వర,

ప్రణిధానము సదా చేయుచుండును గాన వానికి నిద్ర లేదని భావము. పై వృత్తులు చేయుచూ 5, 6 లిప్తలు ప్రకారం ధ్యానము మరచి సమాధిలో యుండుటయే నిద్దుర.

అర్జు:— తపస్సు స్వాధ్యాయ, యీశ్వర, ప్రణిధానములన నెట్టివో తెలుపుము.

కృష్ణ:— నే చెప్పెడు విషయములు బాగుగ విని శ్రద్ధతో ఆచరణ పెట్టుము. నీకు సుఖము కలుగును. శాస్త్రములప్రకారము నడచుటయే తపస్సు. ఓంకారప్రణవధ్వనితో మంత్రానుష్టానమే స్వాధ్యాయము. ఈశ్వరుడు ఓంకార వాచ్యుడు గనుక మనస్సు సదా వానియందు లగ్నమయి యుండుటయే ఈశ్వర ప్రణిధానము.

అర్జు:— మాధవా! ఈమూడింటిని పెద్దలేమని చెప్పుదురు?

కృష్ణ:— క్రియాయోగములని చెప్పబడుచున్నవి.

అర్జు:— ప్రద్యుమ్నా! యీ యోగము చేయుటవలన వచ్చు లాభమేది?

కృష్ణ:— సమాధి స్థిరముగా నిలబడును. క్లేశములన్ని తొలగిపోవును.

అర్జు:— మాధవా! క్లేశములంటి రే అవేవి? చెప్పుము.

కృష్ణ:— సమాధిచే అవిద్య యనెడి సంశయములు, విచారములు యివన్నియూ నశించును. అవిద్యయే క్లేశములు.

అర్జు:- అప్పుడు చిత్త మేమగును? మాధవా!

కృష్ణ:- చిత్తమునందు శుద్ధ సత్వగుణము విస్తరిల్లును. ఏకాగ్రత గల్గును. యోగులందరు ఈ క్రియాయోగమే చేయుదురు.

అర్జు:- నారాయణా! నిష్కామయోగి భ్రష్టుడైతే వాని గతి ఏమిటి?

కృష్ణ:- నిష్కామ యోగి కొన్ని సంవత్సరములు, కొన్ని నెలలు, రోజులు, ఘడియలు, నిముషములకు భ్రష్టుడైతే దానికి కారణం భూతకాలమే సంచితం. ఆసంచితముగా సృష్టియైన ప్రజాపతి పైన చెప్పిన గణితప్రకారము సంవత్సరములు, నెలలు, రోజులు, ఘడియలు, నిముషములు వాని పూర్వ జన్మమునందు ఏమి చేశియున్నాడో యీ వర్తమాన కాలమందు హరిహరాదులు గూడా తప్పక అనుభవించియే తీరవలయును.

అర్జు:- మాధవా! పూర్వజన్మమునందు చేసిన సంచితమనే ప్రారబ్ధము ఈ వర్తమాన కాలములో అనుభవించి తీరవలయునని శలవుయిచ్చితిరి. ఈ వర్తమాన కాలములో కొన్ని రోజులుమాత్రము యోగముతోనుండి పాడైనవారు. వారు చేసిన యోగము లన్ని వట్టివేనా?

కృష్ణ:- ఎప్పటికిని వట్టివి కావు. రాబోవు భవిష్యత్తు

కాలమే లేక ఆగామి. అప్పటికి వర్తమానకాలములో చేశ్ని నిష్కామయోగము ఆకాలమునకు భ్రష్టుడైన యోగి శ్రీమంతుల కులములో పుట్టుచున్నాడు. అనగా మహాసిద్ధపురుషుడు గర్భమునందు పుట్టి యుంకనూ ఎక్కువైన నిష్కామయోగముతో సిద్ధిపొందుచున్నాడు.

అర్జు:— మాధవా! పెద్దలు చెప్పినది అటువంటి పురుషుడు ధనవంతులలో లేక యోగులయందు పుట్టుచున్నారని చెప్పిరే ఎవరు దేనియందు పుట్టుట శ్రేష్టమో చెప్ప వేడెదను.

కృష్ణ:— ధనవంతులకన్న యోగులయి పుట్టుటయే మిక్కలి శ్రేష్టము. అనగా ధనవంతు లెవరనగా జ్ఞానవృత్తులు గలిగిన మహాజ్ఞానులు. యోగులనగా జ్ఞానులకు పైవారు శిద్ధి పురుషులు, వారే శ్రీమంతులు. అర్జునా తెలిసినదా?

అర్జు:— యోగముకన్న తపస్స్వాధ్యాయములుగొప్పవి అందురే అవి యెవ్వి?

కృష్ణ:— స్థూలాంగముతో గూడి చేయు ధ్యానమే భోగి, స్థూలాంగము వదలి సూక్ష్మాంగముతో చేయు ధ్యానమే త్యాగి, సూక్ష్మాంగము దాటి కారణాంగముతో చేయు ధ్యానమే విరాగి. భోగి, త్యాగి, విరాగి యను తత్వము చెప్పెదవినుము. వాసనత్రియములతో గూడినవారు భోగులు. వీరినే స్థూలాంగము. కందమూలములు తినుచు వానప్రస్థులు

త్యాగులు వీరు సూక్ష్మాంగములు, నిరాహారదీక్షులు, విరాగులు వీరు కారణాంగములు. నీవు భోగికన్న, త్యాగికన్న, విరాగి యనే యోగి యవుటయే నాకు చాలా యిష్టము.

అర్జు:- మాధవా! యోగియను శబ్దము అన నేమియో మరల బోధింపుము.

కృష్ణ:- నైష్కర్మ అనగా నిష్కామకర్మ సదా నన్నే ధ్యానింపుము.

---

# విజ్ఞాన యోగము.

## ఏడవ యధ్యాయము

అర్జు:— మాధవా! నిన్నే సేవించువార్కి జ్ఞాన మల వడునా?

కృష్ణ:— చిత్తము సదా చింతించు చుండును. అట్టి చిత్తము యొక్క చంచలము నశింపుచేసి నీచిత్తము నాలో లగ్నపరచి కర్మయోగము అనగా చిత్తమును అజ్ఞానవృత్తు లకు పోనీయక వుంచడమే కర్మయోగము. దానివలన నన్ను కనుగొను విధానమును వినుము.

అర్జు:— మాధవా! బోధింపుము; ఇంకను అధికముగా నితరుల నడిగి తెలిసికొందును.

కృష్ణ:— వేలకొలది జనులలో అనగా 96 తత్వము లతో కూడిన స్థూలాంగము పరము పరముగా వచ్చుచున్న సంచితమునుబట్టి కోటికి ఒకడు, లక్షకు ఒకడు, వెయ్యికొకడు, నూటికొకడు, పదికొకడు యీప్రకారముగా నన్ను నిష్కా మముతో ధ్యానించెదరు. అట్టి వారికి నాయొక్క సత్యమైన జ్ఞానమును అపరోక్షజ్ఞానమనే అనుభవజ్ఞానము కలుగును.

అర్జు:— కృష్ణా! నీవు బోధించిన జ్ఞానము అంత గొప్ప దైన అందరు ఏల అనుష్టింపరు?

కృష్ణ:— ఈ స్థూలాంగమునకు కమ్ముకొని యున్న త్వక్కు యనె చర్మము పృథివి, నెత్తురు, మూత్రము, పైత్యము, శ్లేష్మము, కళ్ళె, కఫము ఇవి జలము. జఠరకోశ మునందు వెలుగుచున్నదే అగ్ని. ఉచ్ఛ్వాస నిశ్వాసములచే నడుచుచున్న దే వాయును. సహస్రారము లేక చెవులే ఆకాశము. ఈఅయిదు సూక్ష్మభూతములు ఆకాశము వాయున్పుతో కూడుట చేత మనస్సు కలిగెను. ఆకాశము అగ్నిలో కలియుట వలన బుద్ధి పుట్టెను. ఆకాశము పృథివిలో గూడుట వలన అహంకారము పుట్టెను. పై అయిదు భూతములు మనో, బుద్ధి, అహం ఈమూడు పైన వ్రాసియున్న అయిదు మొత్తము ఎనిమిది చేరి ప్రకృతి ఆయెను. అర్జునా! జీవ స్వరూపము నా రెండవ పకృతి యని యెరుంగుము.

అర్జు:— శుద్ధ సకృతియె నీజగమును సృజించినప్పుడు సృష్టితో నీకు సంబంధము లేదా కృష్ణా?

కృష్ణ:— అర్జునా! చరాచరాత్మలో యున్న వ్యక్తుల యందు జీవులయందు వెలుగుచున్న ఆత్మనేనే సూత్రమువలె మణులు గ్రుచ్చ బడినట్లు నాయందలి గుచ్చ బడినవి.

అర్జు:— మాధవా? నీవు సృష్టించిన, జగంబునందు వస్తువులు బిన్న బిన్నములు గలిగి యున్న వే.

కృష్ణ:— అగ్ని భూతము జలములో కలియుటవలన జింహ్వాకలిగెను. జింహ్వాద్వారారసము గుర్తించుట నావిభూతి

ధారణనేనే అగ్నిలో అగ్ని కలియుట వలన సమష్టి భూత ములకు నేత్రము గలిగెను. నేత్రము ద్వారా రూపమనెడి ప్రకాశము కలిగెను. ఆకాశము ఆకాశమునకు కలియుట వలన సమష్టి భూతంబను జ్ఞాతయే తెలివి లేక బుద్ధి బుద్ధియె వేదము వేదమె ఓంకారము కలిగెను. జలము ఆకాశము చేరుట వలన శబ్దము పుట్టెను. ఆకాశము పృథివితో కూడుట వలన అహంకారము కలిగెను. అగ్ని భూతం పృథివి భూత ముతో కూడుట వలన ఘ్రాణమనెడి ముక్కు గలిగి సుగంధ దుర్గంధములను గుర్తించెను. ప్రతి జీవులయందు జ్యోతిర్మయ మణి వెలుగుచే తేజస్సు కలిగెను. తాపసుల యందలి అనగా సత్త్వ గుణమనే తపస్సుల యందు నేనే యని సర్వము నిండీ కృతముగా యున్నానని నమ్ము అర్జునా.

అర్జు:— కృష్ణా! నీకు మించిన వారు కారణ పురుషు డెవరు?

కృష్ణ:— జీవాత్మ! నాకు పైవారు ఎవరు లేరు. నేనే శాశ్వితుడను. ఆదికారణుడను.

అర్జు:— మహాత్మా! దైవమనె పదార్ధము సత్యముగ నున్నదా? లేదా? పూర్వజన్మ మందలి కర్మయె దైవమని కొన్నిచోట్ల చెప్పబడి యున్నది. ఓ కృష్ణా! నాకు చాలా సందేహము కలుగు చున్నది.

కృష్ణ:— ఓయి అర్జునా! పౌరుషమనె అహం ఫలితముల

నన్నిటిని అదె అను భవించు చున్నది. దైవము లేక మరిం కొక వస్తువు కర్తయును గాదు. భోక్తయును గాదు. అర్జునా! అహంచే కలుగు శుభాశుభ కర్మలను లోకులు దైవమని వ్యవహరించు చున్నారు.

అర్జు:- నీ వలన కలిగిన త్రిగుణములు వాటి కార్యములు నిన్ను బంధింపవా కృష్ణా?

కృష్ణ:- సంచిత కర్మ ఫలము లభింప నాకిట్టి బుద్ధి కలిగినది. ఇట్లు నిశ్చయించు కొంటిని. ఇట్లు ఫలము లభించిన దందురు. ఈ మాటయె దైవ కల్పనకు మూలము. కర్మను బట్టియె గుణములు మార్పుచేసి జీవుని నరకమునకు త్రోయు చున్నది. గుణములకు అతీతుడను. నేను అర్జునా.

అర్జు:- మాధవా! నిన్ను ఎందులకు త్రిగుణాతీతునిగా నెరుంగ జాలకున్నారు.

కృష్ణ:- పూర్వ కర్మ వలననె ఇట్టి ఫలము కలిగినదని చెప్ప బడుమాటయె నాయుక్క దైవ స్వరూపము.

అర్జు:- సర్వ ధర్మజ్ఞ! పూర్వ కర్మల సంచితమె దైవ మని చెప్పుచున్నావు లేదనుచున్నావు. ఇది ఏమి?

కృష్ణ:- అర్జునా! చెప్పుచున్నాను వినుము. దీని వలన దైవము లేదు. అని నిశ్చయము నీకు కలుగగలదు. వెనుకటి జన్మలలోని యగు వాసనలు ప్రబోధితములై కర్మలుగా

మారెను. అర్జునా! వాసనల ననుసరించియె జీవుఁడొనర్చు కర్మలు కూడా యుండును. కర్మలు యొక రీతిగను మనోభావములు వేరొకరీతిగను యుండవు. పల్లెకి పోగోరువారు పల్లెనే జేరును. పట్టణమున కరుగు గోరువారు పట్టణమున కేగును. ఆప్రకారమే యెవని కెట్టి వాసన లుండునో వాఁడు వాటి నిమిత్తమే యెల్లప్పుడు యత్నించు చుండును. అదిగాక ఫలమును బొంద మక్కువమగు కోరికతో తీవ్రముగా నొనర్పబడు కర్మయే దైవమనబడు చున్నది.

అర్జు:- మాధవా! అట్లయిన అందరున్ను నిన్ను ఆశ్రయించి మాయను దాట నెందులకు బ్రయత్నింపరు?

కృష్ణ:- అర్జునా! పూర్వము వాసనలు జీవునకు మరుగు గలిగించి నాపై ఏమాత్రము స్మరణ లేక చేయును. వాసనలలో మునిగిన జీవుఁడు నీ దేరాకునుఁడు. వీనియొద్ద అజ్ఞాన వృత్తులు యెక్కువై యున్నవి.

అర్జు:- ఇక నిన్నెవరు ఆశ్రయింతురు?

కృష్ణ:- నన్ను పుణ్యాత్ము లాశ్రయింతురు.

అర్జు:- పుణ్యాత్ము లెట్టివారో దెల్పుము.

కృష్ణ:- భక్తులు పూర్వ సంచితమునుబట్టి సర్వపదార్థములు అశాశ్వతం, శాశ్వతం పరమాత్మ స్వరూపమే యని 24 గంటలలో రేయి గాని, పగలు గాని ఏదో ఒక సమయమందు నిర్మించుకొని గంటవరకు నా చరిత్రలు, నాస్వరూప

మును పోల్చుట, నాకథలు చెప్పుట, వినుట, సాధు దర్శన, సత్సంగత్వము జరుపుట. ఇట్టివారు నా భక్తులు.

అర్జు:- మహాత్మా! ఒకగంటసేపు టైము ఇచ్చినారు గదా ఆగంటలోనే కామముతో యున్నవారా లేక నిష్కామముతో యున్నవారా భక్తులు; తెల్పుము.

కృష్ణ:- పది నిముషములైనా మనస్సు నాయందు లగ్నపరచి (శ్రోత్రేంద్రి)యములు కట్టి అంతరింద్రియములు బంధించి దగ్గరకు రాకుండా చేర్చి నాతత్వమును విచారించు చున్నారో వారే నిష్కాములు, వారే నాభక్తులు, ఒకటవ తరగతివారు వీరే భోగులు.

అర్జు:- మాధవా! ఇంకా ఎట్టివారు నీభక్తులు?

కృష్ణ:- సాంఖ్య, తారకము ఈ రెండు తరగతులుగా సాధనాచతుష్టయములు నాలుగున్ను, అష్టాంగయోగములు చేయువారును భాగ్యవంతులకు, భక్తులకు, జ్ఞానులకు దాసులై యుండువారు. వీరే సాధువులు లేక యతీశ్వరులు. వీరు రెండవ తరగతివారు. వీరే త్యాగులు.

అర్జు:- అచ్యుతా! మూడవ తరగతివారు ఎట్టివారో తెల్పుము.

కృష్ణ:- చిత్తము సదా జ్ఞాతతో చేర్చి గంగ, యమునల మధ్య సరస్వతీ నదిలో స్నానము చేసినవి 27 యోగులు. అవి ఏవనగా ఆకాశతత్వము లైదు, వాయుతత్వము లైదు,

అగ్నితత్త్వము లైదు, జలతత్త్వము లైదు, పృథివితత్త్వము లైదు, జీవాత్మ ఒకటి, పరమాత్మ ఒకటి. యీ 27 తత్త్వములతో అజప, గాయిత్రీ మహామంత్రముచే సదా జపించుచున్నాడు. వీడే విరాగి లేక దూతయనిపేరు. వీడే మూడవతరగతివాడు.

అర్జు:— నాలుగవ తరగతివారు ఎట్టివారో తెల్పుము.

కృష్ణ:— స్థూలాంగము, సూక్ష్మాంగము, కారణాంగము దాటి జాగ్రత, స్వప్న, సుషుప్తి మూటిని దాటి పీటి పరిహారము రజో, తమో, సత్వ, త్రిగుణములు దాటినవాడు త్రిగుణారహితుడు. యుగము, జగము జయించిన వాడని భావము. యుగమనగా స్థూలాంగము. జగమనగా సూక్ష్మాంగము జయించి గంగ, యమున, సరస్వతి దాటి మానస, కైలాస, మహామేరు దాటి సంసిద్ధ పరిపూర్ణ కళల తోటివి నలుగుచున్నవాడు. వీడే సిద్ధపురుషుడు. వాడు నాలుగవ తరగతివాడు. వీరినే నేను నాలుగు వర్ణములుగా సృష్టించి యున్నాను.

అర్జు:— ఓ కేశవా! నాలుగు వర్ణములు ఎవరెవరో తెల్పుము?

కృష్ణ:— సిద్ధ పురుషుడే బ్రహ్మణ, విరాగియనే దూతి క్షత్రియ, త్యాగియే వైశ్యుడు భోగులే శూద్రులు. నేను చెప్పిన విషయములు చక్కగా వినుము. అజ్ఞానమనే అడవిలో భోగులనే కోడుజంతి లేక కోడు వారలున్నారు. బ్రహ్మ

మధ్య కొండ మొదలలో యున్నారు. త్యాగులనే కోమట్లు ఆ కోమట్లు అప్పుడప్పుడు యీ కోయవారికి జ్ఞానమనే సరుకులు అమ్మించుందురు. కొండమధ్య నున్నవారు విరాగి యనే రాజులు వారు జ్ఞానపంటసరుకులు క్రింది వారికి పంపుచుందురు. కొండ పైభాగమున యున్న సర్వాంతర్యామియైన సర్వేశ్వరునిలో అయిక్యమయినవాడు శిద్ధి పురుషుడు. అనే బ్రాహ్మణ క్రింది యున్నవారు గుణగణములు పరికించుచు సాక్షీభూతుడై యున్నాడు.

అర్జు:- మాధవా! యీ నలుగురిలో నీకు ప్రేమ అయిన వారు ఎవరు శ్రేష్ఠుడు.

కృష్ణ:- నాలుగవ తరగతి శిద్ధి పురుషుడు నాకు ప్రేమయిన వాడు శ్రేష్టుడు.

అర్జు:- కృష్ణా! నిన్ను కొందరు బొంద ప్రయత్నింపగా ఇతర దేవతల నారాధింతు రేల?

కృష్ణ:- భూత కాలమునందు సంచి తయనే చక్రము ఏలాగున త్రిప్పుచున్నదో ఆలాగునే జీవుడు తిరుగుతూ యున్నాడు. గనుక ఇప్పుడు ప్రయత్నించిన పురుషాకారము వలననే అపరోక్ష జ్ఞానమె పురుషా కారము నీకు శాశ్వతమగు శ్రేయస్సు లభించును. అజ్ఞాన వృత్తులనే కొరవులను జయించుటకు లెమ్ము.

# అక్షర పరబ్రహ్మ యోగము.

ఎనిమిదవ యధ్యాయము

అర్జు:— కృష్ణా! బ్రహ్మ మన నేమి?

కృష్ణ:— కృత, త్రేత, ద్వాపర, కలియుగ, అండ, పిండ, బ్రహ్మాండ, చరాచరాత్మకమను ఈ సర్వం నశించిన నశించకున్న వస్తువు ఏదియో స్థూల, సూక్ష్మ కారణ నశించినప్పటికి, నశించని వస్తువేదియో నదియే బ్రహ్మ స్వరూపము.

అర్జు:— మాధవా! కర్మ మనగా యేమి?

కృష్ణ:— ప్రాణుల యొక్క స్థూల, సూక్ష్మములలో యున్న గుణములే ప్రాణులు. వాటిని నశింపు జేయుటయే యజ్ఞము లేక కర్మము.

అర్జు:— మనస్సును జయించిన యోగి మరణకాలమందు యెట్లు భావించును.

కృష్ణ:— అవసాన కాలమనగా జీవుడు స్థూల భ్రాంతిని, సూక్ష్మ భ్రాంతిని రెంటిని వదలి నిశ్చింతగా నిష్కామముతో త్రివేణి సంగము దాటి సహస్రారమునందు యున్న బ్రహ్మ కపాలము చేరుటయే నిష్కామయోగము వాడే నా భక్తుడు వాడే యోగి వాడే నాలో ఐక్యమవు చున్నాడు.

అర్జు:- మాధవా! నీ స్మరణకు, ముక్తికి సంబంధమేమి?

కృష్ణ:- జీవుడు వాసనభ్రాంతి, స్థూలభ్రాంతి, సూక్ష్మభ్రాంతి. యేభ్రాంతిలో జీవుడు వెళ్ళుచున్నాడో ఆభ్రాంతిని అనుభవించేదానికి ఆభావముననే పొందుచున్నాడు.

అర్జు:- అవసానకాలమందు నిన్ను స్మరించవలయును. యిప్పటినుండి కష్టపడుట ఎందులకు?

కృష్ణ:- ఓయీ! ఎంత చక్కనిమాట జెప్పితివి. ఇప్పటినుండి శ్రిద్ధతో జాగ్రతా, స్వప్న, శుషుప్తులలో గూడా కష్టములయందు, సుఖములయందు, భోగములయందు, సర్వావస్తలయందు నెవరైతె యిప్పటినుండి నన్ను నిష్కామముతో స్మరించుతూ యుంటారో వారు అవసానకాలమందు వానియొక్క మనస్సు నాయందునిలుపుటకు అధికారమున్నది.

అర్జు:- సదా నిన్ను స్మరింపక అవసాన కాలములో వాని మనస్సు నీయందు జేర్చుట యెందుకు అధికారములేదు?

కృష్ణ:- అందరికి నేను సహాయభూతుడనే. అవసానకాలమందు వాని మనస్సు నాలో ఐక్యమగుట చాలా ప్రమాదము. ఏమనగా యిప్పటినుండి వాసనత్రయములనే తీగెలు తెంచుతూ ఈషణత్రియములనే వుచ్చులు నరుకుచూ కఫ, వాత, పైత్య, శ్లేష్మ యనే సముద్రిమునకు రోజుకు కొద్ది కొద్దిగా గట్టు వేయుచు యోగియైనవాడు సదా సాధనలే

గట్టు వేయుచు అవసానకాలమునకు దారిలో యేమియు లేక యుంటే అట్టివాడు శరీరమువదలి స్థూలాంగమనే భ్రాంతియే వదలి నాలో ఐక్యమవుతాడు.

అర్జు:— సదా నిన్ను భజించవలెనని నామనస్సు కోరు చున్నది. అశ్రద్ధ యనే పిశాచము నిన్ను స్మరింపనీయక పాడు చేయుచున్నది. ఏమి చేయుదును?

కృష్ణ:— అశ్రద్ధ యనే పిశాచమును జయించుటకు చిన్న సూత్రమున్నది. దాని ప్రకారము చేయుము.

అర్జు:— మాధవా! ఆసూత్రమును దెల్పి అటుపై నీ తత్వమెట్టిదో తెల్పుము.

కృష్ణ:— పంచక్లేశములు ఐదు. ఈఐదు మందికి ప్రధానమంత్రి అశ్రద్ధ, రెండవమంత్రి అనాచారం, మూడవమంత్రి అహింస. వీరి ముగ్గురినీ నశింపుజేసి మిగతా నాయకులను ఐదుమందిని శిక్షించవలెను.

అర్జు:— ఆ నాయకుల పేర్లు, వారి వృత్తులు తెలియ పర్చుము కృష్ణా!

కృష్ణ:— అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము వీరే పంచక్లేశముల నాయకులు.

అర్జు:— మాధవా! ఎవరెవరు ఏవృత్తులను కలుగజేయు చున్నారో చక్కగా దెల్పుము.

కృష్ణ:- అజ్ఞానమే అవిద్య నాకే కలిగినది. నేనే కారణము, నాదేయిది యని యహంకారముతో ప్రయాణమగును. అస్మిత ప్రపంచము నందలి సౌఖ్యమునకు సాధనమే రాగము. సంకల్పములు నెరవేరుటలో నశింపుజేయుటకు ఉదయించునదియే ద్వేషము. జీవితమునం దేకొరత లేకుండా సమస్త భోగ భాగ్యములతో భగవంతుని మరచి నోలలాడుచుండునదియే యాశ. దీని పేరు అభినివేశము. ఈ ఐదింటిని జయించినవాడే గొప్ప ధన్యుడు.

అర్జు:- ఓ పరమేశ్వరా! వీటి నామరూపము లేకుండా చేయుటకు ఏదైనా తగు సూత్ర మున్నదా?

కృష్ణ:- ఈఐదు దుఃఖమును కలుగజేయుటకు కర్తలు.

అర్జు:- మాధవా! ఏవిధముగా కర్తలయినవో తెల్పుము.

కృష్ణ:- ఆనంద వృక్షములకు ఇవి కుటీరములు. సంతోష మనే తీగెలకు వేరు పురుగులు. యోగమును విడచి పాడుచేయును గనుక యోగులైనవారు తొలుత వీటిని తప్పించుకొననలయును. బాధాగోపమైన పరితాపమును బుట్టించి సంసారపాశము ననుదినము జనన మరణమే సంసారము. ధృఢతరము చేయుటలో పంచక్లేషమునకున్న శక్తి మరి దేనికిన్నీ లేదు. ప్రాపంచక ధర్మమును సంసారవ్యామోహామున్నూ యివి హెచ్చించును. వీనిని విడువకున్న యోగ

మలవడదు. చిత్తము నైర్మల్యమును బొందదు. చిత్తము కుదురుగా యుండదని భావము.

అర్జు:- మధుసూధనా! వీటిని జయించుటకు ఏది సూత్రమో దెల్పుము.

కృష్ణ:- కొన్ని స్థూలాంగములు కొన్ని సూక్ష్మాంగ ములు రెంటిలోను కలసియున్నవి. క్లేశములు వీటికి తగిన సాధనలు. ఆసన విభేధములచేతనే జయించబడును.

అర్జు:- ఆసన లెట్టివో దెల్పుము.

కృష్ణ:- వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము, సిద్ధాసనము, సింహాసనము, కుక్కుటాసనము, భద్రాసనము, యోగాసనము, కూర్మాసనము, గోముఖాసనము, ధనురాస నము, కపాలాసనము. మొత్తము నూట యిరువది ఎనిమిది ఆసనములు. వీనిలో నేను చెప్పిన ఆసనములను తప్పక ఆచ రించుము. నీకు ఫలము గలదు. యిది గాక పామరులు కొంత మంది ఆసనముల చేత మోక్షము లేదని చెప్పుదురు. వారి మాటలు నీవు నమ్మకు. ఆసనములే యోగము, యోగములే మంత్రములు, మంత్రమే మనస్సు. యేవిధమనగా ఆసనశిద్ధి తరువాత యోగశిద్ధి, దానిపై మంత్రశిద్ధి, అటుపై మనశ్శిద్ధి గలుగును. ముమ్మాటికి ఈ నాలుగు శిద్ధి కానిదే పంచక్లేష ములు పోవు. సిద్ధియైన తక్షణమే నామరూపము లేక నీరు మాదిరి నశించిపోవును.

---

# రాజవిద్య రాజగుహ్యయోగము.

తొమ్మిదవ యధ్యాయము

అర్జు:- వామనా! నేనింత వరకూ నీవుపదేశించిన జ్ఞానమును వింటిని. ఇకను వినదగు అంశములు గలవా?

కృష్ణ:- అర్జునా! యికనూ నెంతెయో గలదు. యికముమ్ముందు ముఖ్యములగు విషయముల జెప్పెదను. పరమ రహస్యమైన అనుభవ శిద్ధమైన జ్ఞానమును నీకుపదేశింతును.

అర్జు:- నేను అట్టి జ్ఞానమును వినుటకు దగుదునా?

కృష్ణ:- అర్జునా! పక్షులలో నీచమైనది కాకి. జంతువులలో నీచమైనది పంది. గుణములలో నీచమైనది అసూయ గుణము. దీనిజతలు రాగ, ద్వేష, క్రోధ, డంభ, అహం, మదం ఈ యేడు గుణములు సూక్ష్మాంగమునకు గ్రిహములు.

అర్జు:- ఏడు గ్రహములని జెప్పితే మిగిలిన రెండు గ్రిహము లేమాయెను.

కృష్ణ:- సంకల్ప వికల్పములు రెండు గ్రహములు. ఈ రెండు గ్రహములు పరంపరం అనగా భూత వర్త భవిష్యత్తు ఈ మూడు కాలములయందు మారుచూ యుంటవి. పైన జెప్పబడియున్న తొమ్మిది గ్రహములలో యీ రెండు ఛాయా గ్రిహములు. ఈ రెండూ ఒకటే ఫలితమిచ్చును.

అర్జు:- నవగ్రహాము లెన్ని రకములు కృష్ణా!

కృష్ణ:- స్థూల గ్రిహాములు, సూక్ష్మాంగ గ్రిహాములు ఈ రెండును ఐక్యమై యుండును. యివి నవగ్రహాములను చెందియుండును.

అర్జు:- మాధవా! వారువ యే స్థానములలో యున్నారో దెల్పుము?

కృష్ణ:- రవి: ఎముకల యందు గలడు. చంద్రుడు: రక్తములో గలడు. కుజుడు: యెముకలలో నుండు ధాతు మూలికలలో గలడు. బుధుడు: చర్మము యందు గలడు. గురుడు: మెదడు యందు గలడు. శుక్రిడు: రేతస్సు శుక్ల మందు గలడు. శని: నరముల యందు గలడు. వీటికి గ్రిహ ధాతువు లని పేరు. ఓ యర్జునా! గ్రహముల యొక్క రుచులు జెప్పెదను వినుము. రవికి కారమిష్టము. చంద్రునికి లవణ మిష్టము. కుజునికి చేదు యిష్టము. బుధునికి షడ్రిసముల కూటమి యిష్టము. గురునికి తీపి యిష్టము. శుక్రినికి పులుపు యిష్టము శనికి వగరు యిష్టము.

అర్జు:- కృష్ణా! ఈరుచులు బాధలుకల్గించే నవగ్రహాము లివియేనా?

కృష్ణ:- అవును. వీటి పేరు సూక్ష్మాంగ గ్రహాములు యని పేరు.

అర్జు:- వీరు ఏయే దిక్కున యున్నారో దెల్పుము?

కృష్ణ:- మణిపూర్వకం తూర్పు రవి యున్న చోటు. కుడి కన్ను శుక్రనిస్థలము. ఎడమ కన్ను చంద్రుడు. కుడిఎడమ కణతలు శని. కుడి చెవి కుజుడు. ఎడమ చెవి బుధుడు. సహస్రారము గురుడు.

అర్జు:- సూక్ష్మాంగములో యున్న పంచభూతములకు అధిపతు లెవరు.

కృష్ణ: - త్వక్కు- పృథివి, బుధు డధిపతి, నెత్తురు, మూత్రం కళ్ళె, కఫం, శుక్ల శోణితములు, జలము నీటికి చంద్ర శుక్రులు అధిపతులు. సూక్ష్మాంగములో యున్న అగ్ని రవి కుజు లధిపతులు. శ్వాస వుచ్ఛ్వాసల నేవాయువుకు శని యధిపతి. సహస్రార మే ఆకాశమునకు గురుడు అధిపతి.

అర్జు:- మాధవా! కాలపురుషు డెట్టివాడు?

కృష్ణ:- ఈశ్వరుడే కాలపురుషుడు.

అర్జు:- ఏవిధముగానో జెప్పుము.

కృష్ణ:- పదిరెండు నామములచేత వెల్గుచున్నాడు కాలపురుషుడు.

అర్జు:- ఏవిధముగా వెల్గుచున్నాడో చెప్పుము కృష్ణా.

కృష్ణ:- మేషము, సహస్రారము, వృషభము ముఖము, మిథునము వక్షస్సు, కర్కాటకము-హృదయము, సింహము కుక్షి-కన్య-కటి. తుల-వస్తి నాభి లింగ మధ్య ప్రదేశము.

వృశ్చికము-లింగము. ధనస్సు-ఊర్ధ్వగళము. మకరము-జాను యుగళము. కుంభము-జంగాధ్వయము. మీనము-అంగ్రి ధ్వయము. ఈ ప్రకారముగా ఈ పాంచి భూతిక శరీరములో యింద్రాది దేవతలు కర్మదేవతలు పితృదేవతలు అధిదేవతలు అధ్యాత్మిక దేవతలు పంచభూతములు నవగ్రహములు మందర కైలాస మహామేరు పర్వతములు సప్త ద్వీపములు సప్త సముద్రములు యిన్నిటితో కూడి వెలుగుచున్నది మానవజన్మము. జీవుడు చేయు పాపములు యింతమంది చూచుచు యుండగా వీను కాలునివద్ద యేవిధముగా తప్పించుకొనును? గనుక సదా నిష్కామముతో యెవరైతే నన్ను ధ్యానము చేయుచున్నారో వారు నాలో అయిక్యమగుటకు ఏమియును సందేహము లేదు.

అర్జు:- కృష్ణా! నాకు చాలా భయము కల్గుచున్నది. యీ నవగ్రహములే జీవుని చాలా బాధ గల్గుజేయు నటుల తోచుచున్నది.

కృష్ణ:- తప్పక జీవుడు చేయు అజ్ఞాన వృత్తులను జూచి ఈ గ్రహములు బాధ గల్గు జేయుచున్నవి.

అర్జు:- కృష్ణా! బాధ కలుగ నీయక వాటి శాంతి మార్గము ఏదైన వున్నదా?

కృష్ణ:- లేకేమరునా! వాటికి పంచభూతములు యున్న బీజములే వాటికి మంత్రములు.

అర్జు:- కృష్ణా! ఈగ్రహములకు దానము లేవియైననూ వున్నవా?

కృష్ణ:- తప్పక యున్నవి. అర్జునా! ఏ యింద్రియములు బాధలు పెట్టుచున్నావో కన్గొన్నావా?

అర్జు:- అవి యెట్టిదో తెల్పుము కృష్ణా.

కృష్ణ:- రవి ఆత్మను విఫలం చేయు చున్నాడు. చంద్రుడు మనుస్సును పాడు చేయుచున్నాడు. కుజుడు జ్ఞానమును పోగొట్టుచున్నాడు. బుధుడు వాక్కుయందు జేరి దుష్టపలుకులు పలికించుచున్నాడు. గురుడు జ్ఞానమునకు బదులు అజ్ఞానమును గలుగ జేయుచున్నాడు. శుక్రుడు యింద్రియ సుఖములను పోగొట్టుచున్నాడు. శని అజ్ఞానమనే దుఃఖమును కలుగ జేయుచున్నాడు.

అర్జు:- వీటికి ఏయే వస్తువులు దానము చేయవలెనో చెప్పుము కృష్ణా?

కృష్ణ:- అర్జునా! నేను చెప్పిడి విషయములను ఎవరైతే భక్తితో దానము చేయుచున్నారో వారిని గ్రహములు పీడించవు. ఇచ్చెడి దానములు కూడా నాకే జేరుతవి.

అర్జు:- వీటి కేవారములలో దానము జేయవలయును?

కృష్ణ:- అర్జునా! నేను చెప్పెడి వారములలో రోజు యివ్వవచ్చును.

అర్జు:- ఆ వారము లెట్టివో చెప్పుము మాధవా?

కృష్ణ:- ఆదివారం ఆధార స్థానము. సోమవారం స్వాధిష్ట. మంగళవారం మణి పూర్వకం. బుధవారం అనాహాత. గురువారం విశుద్ధ. శుక్రవారం త్రికూటం. శనివారం సహస్రారం.

అర్జు:- మాధవా! యీ వారములలో ఏ సమయములలో దానము చేయవలెను.

కృష్ణ:- అర్జునా! సమాధి నిశ్చలము గల్గినవాడు సదా ఏ రోజును మూలాధారము బంధించిన వాడై ఆధార స్థానమునందు జేరి ద్వయిత భావములు వదలుటయే గోధుములు దానం రవికి, ఆధార స్థాన మొదలు ఉడ్యానముతో స్వాధిష్టము చేరి సంకల్పమనే బియ్యం దానం చంద్రునకు, స్వాధిష్ట వదలి మణిపూర్వకమందు జేరి అహంకారమనే కందుల దానం కుజునకు, మణిపూర్వకం వదలి అనాహాతయందు జేరి వాసన వృత్తులనే పెసలు దానం బుధునకు, అనాహాత వదలి విశుద్ధ యందు జేరి రజోగుణ తమో గుణమే సెనగలు దానం గురునకు, విశుద్ధ వదలి త్రికూటం జేరి విషయ సుఖములు యింద్రియసుఖములనే బొబ్బర్ల దానం శుకృనకు, త్రికూటంవదలి సహస్రారం జేరి యీ స్థూలాంగమనే శరీరముపై ఆశ వదులుటయే నువ్వుల దానం శనీశ్వరునకు. అర్జునా! ఈ ప్రకారముగా రోజూ దానం చేయగా చేయగా ఆ గ్రహాములు వారిని కాపాడుతాయి గ్రహాములు గూడా నా వీబూధి ధారణలే.

అర్జు:- నీ మహాత్మ్యము వినుటచేత నిన్నెల్లప్పుడును పూజింప బుద్ధి పొడముచున్నది. అట్టి నిన్నేల జనులు దూషించుచున్నారు?

కృష్ణ:- మూఢులు తమోగుణముచేత గల్గు మూర్ఖం. వీటి పేరే అజ్ఞానవృత్తులు. ఈవృత్తులు నాతత్వమునకు మేఘముల మాదిరి అప్పుడప్పుడు అడ్డము వస్తుంటాయి. ఆకారణముచేత మేఘములనే మాయలో బడి నన్ను మరచుటయే నరకము.

అర్జు:- అటుల నిన్ను మరచుటచేత గల్గు ఫలమేమి?

కృష్ణ:- అట్టి నాస్తికులు మాయకు లొంగినవారై దేముడు లేడు, దయ్యము లేదని అహంభావముతో వుండడమే బంధనలో చిక్కి పుట్టుట, చచ్చుట సంసారములోనే బాధపడుతూ వున్నారు.

అర్జు:- ఎట్టివారు నిన్ను శ్రద్ధతో పూజించెదరు?

కృష్ణ:- సాత్వికసంపన్నులు జ్ఞానవృత్తులే నాయొక్క ఐశ్వర్యములు. అట్టివారు చరాచరాత్మలోయున్న పదార్థములన్ని అశాశ్వతములని భావించి శాశ్వితరూపుండైన నన్నాశ్రయించి జనన మరణ మనే సంసారము దాటుచున్నారు.

అర్జు:- మాధవా! భక్తులు యిచ్చెడి యేవస్తువులచే నీకు ఆనందము కలుగును?

కృష్ణ:- భయపడకుము. నేనతిసులభుడను. చెప్పెదను వినుము. నీలో యున్న అపరోక్షజ్ఞానమును ఫలముగా నాకు సమర్పింపుము. నిశ్చలమైన మనస్సును తులసి దళముగా నాకు సమర్పింపుము. నీలో యున్న శాంతము నాకు పుష్పముగా సమర్పింపుము. నీయొక్క ఆనంద బాష్పములే నాకు తోయగా సమర్పింపుము. ఈ నాల్గు ఎవరైతే నాకు సమర్పించుచున్నారో వారు నాకు అత్యంతమైన ప్రియులు.

అర్జు:- అటుల నీ కర్పించిన ఫలమేమి?

కృష్ణ:- సర్వ కర్మ సర్వ సంఘములకు బంధ విముక్తి గల్గును. నాయందు చిత్తముచు నిలిపి సర్వకర్మలను చేయుము.

అర్జు:- మాధవా! స్త్రీలు శూద్రులు వైశ్యులు వీరు వేదపఠన చేయ గూడదు. వారికి ఓంకార ప్రణవధ్వని మంత్ర ములు చెప్పకూడదు. వీరు జపములు తపములు చేయ గూడదని కలియుగము నందలి నామధారులగు బ్రాహ్మణులు చెప్పుచున్నారు. ప్రకృతికి బ్రాహ్మణులే గాని బ్రహ్మ జ్ఞాన మునకు బ్రాహ్మణులు కారని నా భావము. ఏమి శెలవు.

కృష్ణ:- నీవు చెప్పెడి మాట నిజమే. స్త్రీలు వైశ్యా, శూద్రులు ఎవరుఅని బ్రహ్మజ్ఞాని ఆలోచన చేయును. సాంఖ్య శాస్త్ర ప్రకారము అష్టమదములలో కుల మదం నేను బ్రాహ్మ ణుడను అని ఆలోచన చేయునేగాని నేను ఏవిధముగా బ్రాహ్మ ణుడను? అజ్ఞాన వృత్తులు పోలేదు. అరిషడ్వర్గములు తెగ లేదు.

ఈషణత్రయములు చావలేదు. పంచక్లేషములు నాశనము కాలేదు అని వారి వారి తప్పు వారు చూచుకోరుగదా! యిది గాక నాభక్తులైనవారు నాయొక్క తత్వవిచారణ చేయుచుండగా నాభక్తులపై చెడ్డ వేయువారు చాలామంది యున్నారు.

అర్జు:- మాధవా! నీ భక్తులను పరిహాసము చేయు వారి గతి ఏమిటి?

కృష్ణ:- కృతయుగం తల్లీదండ్రీ సంయోగకాలం త్రేతా యుగం పిండమై తల్లి గర్భము నందుండుట ద్వాపరయుగము తల్లి గర్భము వదలి భూలోకము చేరుట కలియుగం వాసన వృత్తులలో జేరి ప్రకృతి బాధలుపడుటయే ఈ నాల్గు యుగములలో గూడ శివభక్తులు గాని విష్ణుభక్తులు గాని పరిహాసము చేయువారికి ఈ బాధలే నరకములు.

అర్జు:- మాధవా! నన్ను ఏమి చేయమనెదవు?

కృష్ణ:- నీ మనస్సును సదా నాయందే నిలుపుము.

అర్జు:- మాధవా! స్త్రీ, వైశ్య, శూద్ర ఈ మూడు జాతులు అంత నీచమైన జాతులా ఏమి నాకు తెలియజెప్పుము.

కృష్ణ:- ఫల్గుణా! నేను చెప్పెడి విషయములు చక్కగా విని అనుభవ జ్ఞానముతో ఆలోచించుము. అజ్ఞానవృత్తులే స్త్రీలు. చంచలములే వైశ్యులు తమోగుణములచే గూడిన మూర్ఖమే శూద్రులు యీ మూడు జాతులు భూతకాలము నుంచి యీ మూడు గుణములు పుట్టుచున్నవి.

అర్జు:- దామోదరా! సాంఖ్య శాస్త్ర ప్రకారము అష్టమదములన్నారే అవి ఏమిటి?

కృష్ణ:- నేను బ్రాహ్మణ, నేను ఎక్కువకులము యనడమే కులమదం, నాకు కోట్ల పర్యంతం ధనమున్నదనడమే ధనమదం, నేను మహా బలవంతుడన డమే యౌవనమదం, నేను రూపమునందు మన్మథుడు కూడా చాలడు అనడమే రూపమదం, నేను ఈ సంసారమును ఈ రాజ్యమునుపరిపాలన చేయుచున్నా ననడమే రాజ్యమదం, నేను సాధువును జపం, తపం చేయుచున్నా ననడమే తపోమదం, నా మాదిరి కవిత్వము చేసే వారు లేరు అనడమే విద్యామదం, నావారు నా మిత్రుడు అంటే ఎందుకు పడడు అనడమే చలనమదం, యీప్రకారముగా ఎనిమిది మదములతో గూడిన జీవుడు ఏలాటి మద వికారము లేకుండ మనస్సు ఏకాగ్రముగ నాయందు నిలిపిన వాడు యెవడో అట్టివాడు నాకు ప్రియుడు వాడే బ్రహ్మజ్ఞాని, వాడే నిజమైన బ్రాహ్మణ.

అర్జు:- బ్రహ్మ జ్ఞానము తెలిసిన బ్రాహ్మణ గుణములు. వారి యాచరణ వారి ధర్మములు ఎట్లో తెలియ పరచుము.

కృష్ణ:- బ్రహ్మజ్ఞానము తెలిసిన బ్రాహ్మణుడు తెల్లని వాడు. శుద్ధ సత్వగుణము వానియొద్ద సత్యము, శాశ్వతము అశాశ్వతము ఈ రెండును తరచి శాశ్వతముగా యున్న వస్తు

వేదియో దానిని కనుగొనుటయేసత్యము. దానము మనస్సును సదా భగవంతునియందు ఐక్యపరచుటయే దానము. వాసన త్రయములలో కష్ట సుఖము, దుఃఖము, దారిద్ర్యము ఏది వచ్చిన చంచలము లేక ఓర్చి యుండుటయే ఓర్పు. మనస్సును అజ్ఞానవృత్తులకు పోనియ్యక సదా జ్ఞానవృత్తులకు మరల్చుట యే ఆచారము. సత్యము, శాంతము మరచుటయే అహింస. తపము, జపము, వేదపారాయణ, ఓంకారప్రణవము, భగవంతుని పురాణములు, సత్సంగత్వము, యతీశ్వరుల దర్శనము, సదా నిజము పలుకుట, దయ, బ్రహ్మజ్ఞానము తెలిసిన బ్రాహ్మణులయొద్ద యుండును.

అర్జు:- మాధవా! సత్వగుణము బ్రాహ్మణుల యందు తెలిపియున్నారు. రజో, తమోగుణ ధర్మములు తెలుపుము.

కృష్ణ:- గర్వము, క్రోధము, అహంకారము, విషమ వాదము, అప్రియవాదము, ఉద్యోగము, మత్సరం, రోషం యీ ఎనిమిది రజోగుణము. అజ్ఞానము, మోహము, నిద్ర, చాపల్యము, పరనింద, హింస, హీనవృత్తి, పాపిష్టత్వము యీ ఎనిమిది తామస గుణములు. త్రిగుణముల పోలికలు యిట్టివి.

---

# విభూతి యోగము.

## పదియవ యధ్యాయము

అర్జు:— కృష్ణా! నీయుపదేశము ముగిసినదా?

కృష్ణ:— లేదు; మరల బోధింతును. బ్రహ్మవిద్యకు అంతము కలదా?

అర్జు:— అనంతమగు బ్రహ్మవిద్యను వినుటకు నేను అర్హుడను.

కృష్ణ:— ఫలాపేక్ష యను కర్మనిష్టచేత పొందదగియు త్రిగుణాతీతమైనదియు, జన్మము లేనిదియు, మనస్సులేనందున కోరికలు లేనిదియు, ప్రాణము లేనందున కదలిక లేదనియు, కర్మేంద్రియములు లేనందున ఇంద్రియ వ్యాపారములు లేనిదియు, ఆణవ, కార్మిక, మాయామలము లేనిదియు, నాదబిందు కళాతీతమైనదియు ప్రకృతికి యేలాటి సంబంధం లేనిదై యున్నది పరబ్రహ్మ స్వరూపము.

అర్జు:— యింతకు మించిన యుత్తమయోగము లేదా?

కృష్ణ:— నేను బోధించువానికంటె శ్రేష్టమగు యోగ మెచ్చటను లేదు. ప్రకృతివలన బుట్టిన మహాదహంకారాది సప్తావరణములకును అనగా ఆధార, స్వాధిష్ట, మణిపూరకం, అనాహత, విశుద్ధ, త్రివేణి, సహస్రారాది కారణమైన

చిచ్ఛక్తికి ఆశ్రయ గమ్యస్థానమై యున్నది. అది బీజరూపమై యుండక పుబ్బుటయే మహాతత్త్వము. అంకురము బయలు బడుటయే అహంకారము. అది శాఖోపశాఖలుగా ప్రబలుటయే పంచతన్మాత్రలు. అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముగా మారెను.

అర్జు:- మాధవా! ఉత్తమగుణములు గలవారు గదా నిన్ను భజింపవలయును? అవి నాకు గలవా యని సంశయించుచున్నాను.

కృష్ణ:- నన్ను ధ్యానించు వారికి వలయు వుత్తమ గుణములను నేనిచ్చుచున్నాను.

అర్జు:- ఆగుణము లెట్టివో తెల్పుము?

కృష్ణ:- సత్వగుణము, అనుభవజ్ఞానము, సత్సంగత్వం, ఓర్పు, సత్యము, శమము, యింద్రియ నిగ్రహము, దమము, అంతరేంద్రియ నిగ్రహము, సుఖము, బ్రహ్మానందము, అభయము, అహింస సమత్వము, సంతుష్టి, తపస్సు, దానము, యశస్సు ఈపదహారు గుణములు గలుగజేయుచున్నాను.

అర్జు:- నిన్నారాధించనివారల కేమి ఇచ్చుచున్నావు?

కృష్ణ:- దుర్బుద్ధి, అజ్ఞానము, మోహము, అసహనము అనృతము, ఇంద్రియ లోలత్వము, దుఃఖము, అభవము, భయము, హింస, స్వపరభేదము, పేరాశ, సంగము, లోభత్వము, అపయశస్సు ఈదుర్గుణములు అట్టివారికిచ్చుచున్నాను.

అర్జు:- అజ్ఞాన మొదలి నీపై ప్రేమ గలుగుటకు సూత్రము లేదా?

కృష్ణ:- సూత్రము యున్నది. ఏవిధముగా సమస్తము నకు ముఖ్యమైనది మనస్సు. ఆమనస్సుకు ముఖ్యమైనది ప్రకృతి. ఆప్రకృతిని వదలి మనస్సు సదా ఆపరమాత్మ స్వరూపమున జూచిన తక్షణమే ప్రకృతి తనంతట తానే క్షీణమై పోవును. సర్వములో నేనేయున్నాను.

అర్జు:- మాధవా! ఏయే వస్తువులలో నీవున్నావు?

కృష్ణ:- ద్వాదశాదిత్యులలో విష్ణువును నేను; అనగా అనాహతయందు పన్నెండు దళములతో నిండి ఈశ్వర స్వరూపమై యున్నాను.

అర్జు:- పరమాత్మా! ఆదళములు ఎట్టివో దెల్పుము

కృష్ణ:- క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ ఇవియే దళములు.

అర్జు:- ఈదళము లేవిధముగా వెలుగుచున్నవి?

కృష్ణ:- శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణ జ్ఞానేంద్రియము లైదున్ను; సమాన, వ్యాన, వుదాన, ప్రాణ, అపాన, పంచప్రాణములయిదును మనస్సు, బుద్ధి మొత్తం పన్నెండు వీనియందున్న వాఁడను నేను. స్థూలాంగములో జఠరాగ్నియనే జ్యోతిరూపమైన సూర్యుడను నేను. జ్ఞానవృత్తులు అజ్ఞానవృత్తులు వీటికి మనస్సనే చంద్రుడను నేను. జ్ఞానమనే

సామ వేదమును నేను. అధ్యాత్మిక దేవతల కంతా జీవుడనే యింద్రుడు నేను. పంచభూతములలో చైతన్యము నేను. 25 యిందియ్రములలో మనస్సు నేను. సమాన వాయువు, వ్యాన వాయువు, వుదాన వాయువు, ప్రాణవాయువు, అపానవాయువు, నాగ వాయువు, కూర్మ వాయువు, కృకర వాయువు, దేవ దత్త వాయువు, ధనంజయ వాయువు, ఈ పది వాయువులు బంధించి కుంభకమునందు నిల్పిన శక్తియే శంకరుడను నేను. యక్ష రాక్షసులలో అనగా అశ్రిద్ధ అనాచారములో సూక్ష్మ గుణమనే కుబేరుడను నేను. అష్టవస్తువులలో స్థూలాంగమును కమ్ముకొని యున్న చర్మము భూమి నేను. కళ్లె, కఫం, శ్లేష్మం, నెత్తురు. మూత్రం, శుక్లం, శోణితం, ఈఏడు జలములు నేను. జఠరాగ్ని యను యగ్ని నేను. శ్వాసా వుశ్వాస యను గాలి నేను. సహస్రారమనే ఆకాశము నేను. జీవుడు నేను. పరమాత్మ యనే సూర్యుడు నేను. సహస్రారమునకు కుడి భాగమున యున్న కైలాసగిరి పర్వతము నేను. ఎడమభాగ మున మందరగిరి పర్వతం నేను. మధ్యనున్న మహామేరు పర్వ తము నేను. జిహ్వాయందు పలికెడు వాక్కు బృహస్పతి నేను. అజ్ఞానవృత్తులు జ్ఞానవృత్తుల సేనలు వాటి కధిపతియైన అహం కారమనే కుమారస్వామి నేను. కన్నీరు మహా సముద్రి మును నేను. బుద్ధి యను భృగు మహర్షి నేను. వాక్కు యందు పలికే ఓం ప్రణవము నేను. యజ్ఞములలో సదా జప యజ్ఞము నేను. స్థూలాంగ శరీరమే అశ్వద్ధ వృక్షము నేను. మనస్సుయొక్క

చంచలం బుద్ధి యొక్క నిశ్చయం చిత్తము యొక్క చింతన అహం కారము యొక్క అహం ఈ యంతరింద్ర్యిములను నిశ్చింతగా కట్టుబాటు పెట్టిన గుణమే నారద మహా మునిని నేను. ధర్మపరిపాలన చేయు గుణమే గోవులలో కామ ధేనువును నేను. స్త్రీ పురుషులకు గల్గు మోహ భ్రాంతియే మన్మథుడను నేను. సమాధిలో యున్నప్పుడు మనస్సు చంచలము పడుటయే ఖగనాథుడనే గరుత్మంతుడ నేను. శ్వాసా వుచ్వాస అనే వాయు దేవుడ నేను. అపరోక్షజ్ఞానమనే శ్రీరాముడను నేను. అకాలమృత్యువను మొసలిని నేను. ఎడమకన్ను గంగ, కుడి కన్ను యమున, నాశికమద్య సరస్వతి, వీనిలో గంగానదిని నేను. శ్రీరామ తారకమంత్రమే వజ్రాయుధమును నేను. వీపు యొక్క మధ్యయందు వీణాదండ మనెడి ఎముకల గూడొకటి శిరస్సు వరకును యున్నది. మేరుమధ్యమువ శిరస్సు యొక్క నడుమ దూరి భూమధ్యమునరకు నుండు సూక్ష్మమైన ద్వార మొకటియున్నది. అదే బ్రహ్మనాడి లేక శుషున్మ యనున దే వాసుకిని నేను. జింహ్వా అధి దేవత వరుణుడను నేను. జీవు డికి ఆద్యాత్మ దేవత నేపితృ దేవత నేను. జీవుడు ఏకాగ్ర మన స్సుతో పితృ దేవతలను ప్రార్థించే అర్యముడను నేను. జీవుడు భూతకాలములో చేసిన సంచితమును ఈవర్తమానకాలములో జీవుడు చేసిన కర్మను బట్టి బాధలు పెట్టుయముడను నేను. అజ్ఞానవృత్తులనే రాక్షసుడు ఆరాక్షసులలో సత్వగుణమున్న ప్రహ్లాదుడ నేను. మానస అడవి జంతువులలో పాప పుణ్యము

బకములు నేను. విగ్రవీగుట యను కోకిలములు నేను. కర్మ పాపంబుల కౌజుల నేను. పంచవాయువుల చిలుకలు నేను. పంచక్లేశములనే పావురములు నేను. వాంఛనలు రంగువర్ణపు పిట్టలు నేను. చంచలములు వన్నెచిలుక బాతులను నేను. సంకల్పములనే జింకలు నేను. కళంకమనే గోరువంకలు బింకమనే పెద్దగ్రద్దలు, అహంకారమనే అడవిపంది, అరిషడ్వర్గములు కొరనగండ్లను, మానసమే పరమ హంసను, ఇంద్రియములనే పందులను, ఈషణాత్రయములనే గుర్రాలు, ఆస్టమదములే ఏనుగులు, కోపమనే సింహము మొదలగునవి నేను.

అర్జు:— ఆహా! ఎంత ఆశ్చర్యము! పై వాటి యందంతయును నీవున్నావా! యెట్టి సర్వవ్యాపకత్వము, యెట్టి సర్వజ్ఞత్వము?

కృష్ణ:— ఇంకను వినుము: సర్వసృష్టులకు భూత, వర్తమాన, భవిష్యత్తు అనగా సంచిత, ప్రారుద్ధ,, ఆగామికి ఆది మధ్యాంతమున కంతయు నేను ఆత్మా నాత్మ తరచుట లేక బ్రహ్మవిద్యయనే ఆత్మవిద్యను నేను. తమో గుణముతో నుండిన తర్కవాదము నేను. అకారమనే బ్రహ్మ స్వరూపము నేను. జ్ఞానమును వృద్ధి చేయడములో అక్షయ కాలము నేను, మనో, బుద్ధి, చిత్త, అహం, యివియే చతుర్ముఖ బ్రహ్మను నేను.

అర్జు:— వినగా వినగా, నా ఆనంద ప్రవాహము పొర్లి పొర్లి ప్రవహించుచున్నది. ఇంకను బోధించుము.

కృష్ణ:— అస్థితే, జీవుడు, తల్లి గర్భములో పిండమై యుండుట. జాయతే, తల్లి గర్భము వదలి భూమిపై బడుట. వర్ధతే, మాయతో బాలుడు దినదినము వృద్ధి బొందుట. పరిణమితే, మాతా పితాదులకు ముద్దు చూపుచు, బంధు జనుల వలన ప్రేమింపబడుచు యవ్వన పరుండగుట. అపక్షియతె, వృద్ధి బొందిన శరీరము దిన క్రమమున క్షీణించుచు వచ్చుట. వినస్యతె, దేహము. యీ ఆరు వికారములను వ్యర్థముగ హరించెడి మృత్యుదేవతను నేను. ఆగామి రాబోవు కాలమునకు వారి వారి పాప పుణ్యమునకు తగిన ఉత్పత్తి స్థానము ఇచ్చెడివాడను నేను. అజ్ఞాన వృత్తిలో స్త్రీలు వాని యందున్న సత్వ గుణమనే కీర్తి నేను. కీర్తి యను లక్ష్మి నేను. వాక్కు ధ్వని నేను. స్మరణ నేను. బుద్ధి నేను. ధైర్యము నేను. ఓర్పు నేను. జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారము అయిదు. సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన అయిదు. శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణ, అయిదు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము అయిదు. వాక్కు, పాణి, పాద, గుహ్యాం, గుదము అయిదు. జీవుడు ఒకటి, ఆత్మ ఒకటి, పైన వ్రాసి యుండు 25 న్ను యీ రెండున్నూ, మొత్తము 27 తత్వములే అశ్విని లగాయితు రేవతి వరకు ఇరువది ఏడు నక్షత్రములాయెను. దీని పేరే నక్షత్రమాల. సోహం. హంసో యని చేయుచున్న అజపగాయత్రి నేను. సూక్ష్మాంగ గాయత్రి యని దీని పేరు. స్థూలాంగ గాయత్రి యెట్లి దనగ:

9 పోగులు ఒక ముడి చొప్పున మూడు ముళ్లు యిరువది ఏడు పోగులు ఆయెను. బ్రహ్మజ్ఞానము తెలిసిన బ్రాహ్మణుడు, సూత్రాంగ అజపగాయిత్రినే ధరించును. 9 పోగులు ఒక ముడి చొప్పున, మూడు ముళ్లు యొక్క భావము చెప్పెదను. అ, కారము ఒక ముడి, ఉ, కారము ఒక ముడి, మ, కారము ఒక ముడి. యీ మూడు చేరి ఓం ప్రణవ మాయెను. దీని యందు నేనే యున్నాను. ఆకాశ బీజములు పది. ఋ, ౠ అం, ఙ, ఞ, ణ, న, మ, శ, అః వీని యందు నేనే యున్నాను. వాయు బీజములు పది అ, ఆ, ఎ, క, చ, ట, త, ప, య, ష వీని యందు నేనే యున్నాను. అగ్ని బీజములు పది ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ఠ, థ, ఫ, ర, స వీని యందు నేనే యున్నాను. జల బీజములు పది ఌ, ౡ, ఔ, ఘ, ఝ, ఢ ధ భ, వ, ళ వీని యందు నేనే యున్నాను. పృథివి బీజములు పది. ఉ, ఊ, ఒ, గ, జ, డ, ద, బ ల, హ వీని యందు నేనే యున్నాను. మొత్తం 50 బీజములు. నవగ్రహములలో 9వ గ్రహము కేతువు. ఒక్కొక్క గ్రహమునకు 5 బీజములు పంచిపెట్టగా 9×5=45 బీజములు పోను. మిగిలిన శేషం. 5 బీజములు మిగిలెను. ఆ బీజములను పంచ క్లేశములు అనగా రాగ, ద్వేష, క్రోధిని, అభినివేష, అవిద్య. యీ అయిదు మందికి. ఒక్కొక్కటి చొప్పున పంచగా శేషము కూడా నాస్తి అయినది. దాని యందు కూడా నేనే యున్నాను. మేషము లగాయితు మీనం వరకు 12 మాసములు గన్క 12 మాస

ములలో 9 వ మాసము ధనుర్మాసము నేనే. అవి ఏవనగా మేషము సహస్రారం నేను. వృషభం ముఖం నేను, మిథునం వక్షస్సు నేను. కర్కాటక హృదయం నేను. సింహాకుక్షి నేను. కన్యా కటి నేను. తులా నస్తి నేను. వృశ్చికం లింగం నేను. ధనస్సు ఊరియుగళం ను.

అర్జు:— మిగతా మూడు మాసము లేమాయెను?

కృష్ణ:— మకరం జానుయుగళం, కుంభం జంగాద్వయం, మీనము అంగిరిద్వయం, వీటియందుముఖ్యమైన ధనుర్మాసం నేను. యిదే కాలచక్రం. దీనికి యిదే వృత్తి. తిరుగుటయె చక్రం. మూర్ఖులు నామహిమలు తెలియజాలక నాభక్తులు చెప్పెడి వాక్యములు వినుటకు సహించక వితండవాదములు చేత వారే పాడగుచున్నారు. మోసమనే జూదము నేను.

అర్జు:- మాధవా! నీవే మోసము చేయగా పాపులు చేయుట ఒక లెక్కా?

కృష్ణ:- వారి వారి సంచితమునుబట్టి వారికిఆగుణములు పుట్టించి బ్రిష్టత్వము చేయించి కర్మను శుద్ధిచేయుచున్నాను.

అర్జు:- మాధవా! మీరు నాయందు దయయుంచి నా తప్పులు క్షమించవలయునని ప్రార్థించుచున్నాను. కారణ మేమనగా మీమహిమలు వినగా వినగా చాలా ఆనందముగా యున్నది.

కృష్ణ:- అటులైన శ్రద్ధతో వినుము. జాగ్రిత స్వరూ

పమే తేజస్సు, అజ్ఞానమును గెలిచి జ్ఞానమనే జయము, సాత్విక శ్రద్ధయనే పురుషాకారము, సాత్వికులలో సత్వగుణము, యాదవులలో యింద్రియము లేక యాదవులు లేక గోపికలు. వీరియందు ఆత్మయనే వాసుదేవుడను నేను.

అర్జు:- మాధవా! శ్రవణ వింటిని. విన్నదానిని మనన యనే ఆచరణగా పెట్టితిని. ఆచరణద్వారా మొలకలనే జ్ఞానము చూచితిని. ఎంతోగొప్ప ఆనందము మాధవా! సూది మోపుటకు సందు లేక స్థూలాంగమనే యండము, సూక్ష్మాంగమనే పిండము, కారణాంగమనే బ్రహ్మాండము నిండి తురీయాతీతమునకు మిగిలియున్నది నీయానందము.

కృష్ణ:- పరమాత్మమును తెలిసికొను సూక్ష్మబుద్ధి నీవున్నావా నేనే.

అర్జు:- ఔ నౌ! యమిష్టిచేత దుఃఖము, సమిష్టిచేత ఆనందము కలుగుచున్నది.

కృష్ణ: ఆ ఆనందము నటించుము. చెప్పెద వినుము. స్మృతి, యుక్తి, జ్ఞానము వ్యాసుడను, దుర్వృత్తులగు రాక్షసులకు మలిన అహంకారముగ యున్న శుక్రాచార్యుడను, సత్వగుణము, రజోగుణము యీరెండు కలసి బంధించు వారిలో రాజును, నిరాధారముగా యున్న మౌనము, జ్ఞానులయొక్క- జ్ఞానము నేను.

అర్జు:- మాధవా! కొన్నిటిని మాత్రము నేనని బోధిం

చితివి. మిగిలినవన్నియు నీవు కాదా?

కృష్ణ:- సమస్త భోగములకు ఆది కారణ నేననియు ఎరుంగుము.

అర్జు:- నీ యంశములను గ్రహించితిని. నీ విభూతిని తెలిసికొని నిన్ను భజించుట యెట్లు?

కృష్ణ:- ఈస్థూలాంగ జగత్తును ఒక పాదముచేత నిల బెట్టియున్నాను. ఇక నావిభూతిని యూహించుకొనుము.

# విశ్వరూప సందర్శన యోగము.

## పదునొకండవ యధ్యాయము

అర్జు:– మాధవా! నీవు బోధించిన యుత్తమజ్ఞానమును వింటిని.

కృష్ణ:– దానివలన ప్రయోజనమేమైన కలిగినదా?

అర్జు:– నాఅజ్ఞానము పూర్తిగ నశించెను.

కృష్ణ:– వినిన యంశములలో నమ్మకము కుదిరినదా?

అర్జు:– చరాచరాత్మమైన యీస్థూలాంగమనే జగత్తునందు నీలీలలు, నీమహిమలు యుండడం యదార్థమని ధృడ విశ్వాసము గలిగినది.

కృష్ణ:– ఇక నీవు కోరిన దేది?

అర్జు:– ఆది అత్యంలేని నీ మహా రూపమును జూడ గోరు చున్నాను.

కృష్ణ:– నా స్వరూపమును జూచెదవా?

అర్జు:– మాధవా! నీబోధ యనె ఖడ్గముచేత అజ్ఞాన మనె అరణ్యము తెగి కాలి బూడిదైనది. యెక్కడ జూచిన మహా బయలు కనపడుచున్నది. ఆ బయలులో నీ స్వరూపము చూడవలెనని ఎంతో మహానందమనే సముద్రము ఘోషించు చున్నది.

కృష్ణ:— జీవాత్మా! నా రూపము జూడుము.

అర్జు:— మాధవా! నీరూప మెట్టిది?

కృష్ణ:— తెలుపు, ఎరుపు, నలుపు, ఆకుపచ్చ, పసుపు పచ్చ, నీలం, బులుగు, వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్ప రాగ, మరకత, మాణిక్య, బంగారుఛాయ పన్నెండుమంది ఆదిత్యులును అష్టవసువులు, ఏకాదశ రుద్రదేవతలు, అశ్విని దేవతలును, సప్తవాయువులు, సప్తసముద్రములు సప్తద్వీప ములు యింకానీ వేదిచూడదలచుకున్నావో చూడుము. ఎన్నడు కని, విని యెరుంగని యద్భుతములను కూడా చూడుము.

అర్జు:— ఆ హా! ఏమి కరుణ, వర్ణించుటకు సాధ్యమా!

కృష్ణ:— శ్రద్ధతో తిలకింపుము, ఈచరాచర జగత్తు నా దేహ మందొక మూల యున్నది. జగత్తుకు మిగిలి శేషమై యున్నాను.

అర్జు:— మాధవా! ఆలస్యమేల, నీస్వరూపమును జూడ నుత్స హించు చున్నాను.

కృష్ణ:— త్వరపడెదవేల; ఈ అజ్ఞాన నేత్రముచేత నా స్వరూపము చూడలేవు. దివ్యదృష్టి నొసంగు చున్నాను. చూడుము అనగా త్రివేణిసంఘము నందు దృక్కు నిలుపుట.

అర్జు:— నీ మహిమ వలన నాకు నూతన దృష్టి చేకూరి నది. ఆహా ఏమి ఆశ్చర్యము; అనేకములైన కళలు, ముఖ ములు గాను, స్వరూపములే నేత్రములుగాను సప్తజ్ఞానభూమి

కలే దివ్యాభరణములుగాను అజ్ఞానమనే రాక్షసులను సంహా రించుటకు శూలము, డమరకము, ఖడ్గము, శంఖు, చక్రము, గద, గండ్రగొడ్డలి యనే యాయుధముల తోను సత్యము, శాంతము, ఓర్పు, దయ, తపస్సు, అహింస, సత్వగుణము యనే దివ్య హారములతో నిశ్చింత యనే వస్త్రములతోను ఉపనిషత్తుల సారమె దివ్యగంధములతోను సర్వమునంత నిండీ కృతమై సమన్వితమై కోటి సూర్యకాంతి దివ్యరూపమును గాంచుచున్నాను. ఈస్థూలాంగమనే శరీరమే విశ్వము. యీ విశ్వమంతయు నీదేహమందొక భాగమున నున్నదే యని భగవంతునికి సాష్టాంగ నమస్కార మొనర్చెదను.

కృష్ణ:- ధైర్యముతో నాస్వరూపము జూడుము.

అర్జు:- ఆహా! ఏమి యద్భుతము. సమస్త దేవతలు అనగా పితృదేవతలు, ఖర్మదేవతలు, అధిదేవత, అధ్యాత్మ దేవతలు, 84 లక్షల జన్మలు యనే ప్రాణులు, మనో, చిత్త బుద్ధి, అహం నశింపుచేసిన అనగా మనస్సుయొక్క చంచలం బుద్ధియొక్క విపత్తు, చిత్తముయొక్క చింతన, అహంయొక్క అహంభావము యివి కాల్చి మసిచేసినవారు ఋషీశ్వరులు లేక మునులు. అట్టివారున్ను స్వాధిష్టానం దీనినే యోని యందురు. అచ్చటయున్న వెయ్యి దళములతో వెలుగుచున్న ఆదిశేషుడున్ను; బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర సదాశివః యీపంచ బ్రహ్మలున్ను జూచితిని. ఆనందమాయెను.

కృష్ణ:- ఈశాన్యముఖము వలన ఆకాశము పుట్టెను; ఇది పరమాత్మ. తత్పురుషముఖము వలన వాయువు పుట్టెను; ఇది జీవాత్మ. అఘోరముఖము వలన అగ్ని పుట్టెను; ఇతడు అగ్ని దేముడు. వామదేవు ముఖము వలన జలము పుట్టెను; ఇతడు చంద్రుడు. సద్యోజాత ముఖము వలన పృథ్వీపుట్టెను; ఇతడు సూర్యుడు. ఈ పంచ ముఖ బ్రహ్మలను చూడుము.

అర్జు:- మాధవా! చూచితిని; మహానందమాయెను.

కృష్ణ:- ఫల్గుణ! యీఅయిదుమంది విశ్వ బ్రిహ్మలను చూడుము. మనోబ్రహ్మ, రుగ్వేదం, యిదే ఉమామహేశ్వరుడు, మయబ్రహ్మ యజుర్వేదం, యిదే లక్ష్మీనారాయణుడు, త్వష్టబ్రహ్మ సామవేదము, యిదే సరస్వతీబ్రిహ్మ, సిల్పిబ్రహ్మ అధర్వణవేదం, ఇదే శచీదేవి దేవేంద్రుడు. విశ్వబ్రహ్మ ఓం ప్రణవం, ఇదే ఛాయాదేవి, సూర్యుడు.

అర్జు:- మాధవా! నీమహిమలు పోల్చుటకు నేనెంతటివాడను.

కృష్ణ:- పంచశక్తుల రంగులు జూడుము. క్రియాశక్తి ఎరుపు, కనిగ్రుడ్డువద్ద యున్న ఎఱ్ఱనిజీరలు, జ్ఞానశక్తి తెలుపు కనిగ్రుడ్డు, ఇచ్ఛాశక్తి నలుపు గ్రుడ్డు, ఆదిశక్తి నలుపుగ్రుడ్డులో సునీలమైన పాప. పరాశక్తి పాపమధ్యవెలిగే కళ చూచితివా అర్జునా.

అర్జు:- పరమాత్మా! నీమహిమలు జూడగా నా శరీ

రమే నేను మరచుచు యున్నాను. సహస్రి నమస్కారము చేయుచున్నాను. ఓ కృష్ణా! ఏదిక్కు చూచినా సర్వము నిండి యున్నావు. సూర్య, చంద్రాదులే నీనేత్రములు ఓ కృష్ణా! ఆది మధ్యాంతములు నాకు కన్పించుటలేదు. నీ స్వరూపమనే వెలుగు అజ్ఞానమనే చీకటిని పోగొట్టి సమస్త దిక్కులకు నిండి ప్రకాశించుచున్నది. ఆధారస్థానమే యములోకం, అనాహత స్థానం పితృలోకం, సహస్రారమే స్వర్గలోకం ఈమూడు లోకములలో యున్న వారు కూడా భయము చెందుచున్నారు. నీలోనే రుద్రులు ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వ దేవతలు, అశ్వనీ దేవతలు, మరుత్తులు, పితృ దేవతలు, గంధ ర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు యున్నారుగదా కృష్ణా!

కృష్ణ:- శాంతముతో నాస్వరూపము చూడుము.

అర్జు:- శాంతముతో నీ స్వరూపము జూచుటకు చాలా భయము కలుగుచున్నది. అనేక ముఖములు, అనేక నేత్రములు, విశ్వరూపమును నేను చూడజాలక భయము పుట్టుచున్నదని నేత్రము మూసినవాడై జీవుడనే అర్జునుడు విశ్వ రూపమును ధ్యానించుట, శ్రీమద, మల, విమల, శోభామ, రామ, సౌందర్య, గాంభీర్య, రత్నాకర, సుధాకర, ప్రభాకర, విద్యుత్కోటీర, భాసమాన, చిన్మయ, ప్రకాశ, మానం, పృధ్వీవ్యాప, స్తేజో, వాయురాకాశం, మహాభువత, జనకం, సత్కర్మకృతం, జనక, ఫర, గంధే, సంధాన, కనకం,

కం, ఖం, గం, ఘం, ఙం, క్రౌః, అం, ఇం, ఉం, ఋం, ఌం,
ళ్రూం, ఆవర్గ, కవర్గాంత, వర్గో, ఫరి, ప్రణవ, సహిత, వర్గ,
వర్గాంత, స్త్రైర్య, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష
ఈశాన్య, గోప్యముఖ, సముఖ, విలాసం, సదా కైలాసవాసం,
చం, ఛం, జం, ఝం, ఞం, ఆం, ఋూం, ౠం, ౠ్రిం, ఐంః,
నివృత్తి, ప్రతిష్ఠ, విద్యా, శాంతి, శాంత్యతీత, పరంజ్యోతి, కళా
ప్రకాశం, సర్వామ్నంత్ర, చిదాకాశం, టం, ఠం, డం, ఢం,
ణం, ఏం, ఐం, ఓం, ఔం, అం, ఉవర్గ, టవర్గ, సహితనాద, ఉ్రిఃణా
రాఃమిళితా, క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి ఆదిశక్తి,
పరాశక్తి, బిభేత్యాసక్తో, తుష్ట, గర్వ, జృంభి, తారంభ, భ్రామిక,
విముక్తం, సర్వ, బ్రిహ్మాండోత్పత్తి, హేతుభూతకారణ, మహా
శక్తి, యుక్తం, తం, థం, దం, ధం, నం, యం, రం, లం, వం, శం,
యవర్గ, తవర్గ, శిరస్త, శాంతి, క్రాఃనకార, మకార, శికార,
వకార, యకారోంకార, గుహాంత, గాళ, శిఖరనిలయం సప్త
కోటి మహామంత్ర, సర్వాంగ వలయం, పం, ఫం, బం, భం,
మం, షం, సం, క్షం, ఆం, పవర్గమూర్ధ్నిన్, స్థిత, క్రుః, ప్రమాః
బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వర సదాసివ, గురుస్వరూపనిత్య, బుద్ధ,
శుద్ధ, షడ్గుణైశ్వర్యసిద్ధ, ప్రబుద్ధ, శద్ధాను, బుద్ధ, షడ్వర్గ,
షడూర్మి, నిరుద్ధం, షట్చక్ర, మట్యు, క్షియో, షిజ్జ, సహ్యాత్స,
మిద్ధం, కర్మ, సభాక్య, కర్తృ, సభాఖ్య, మూర్తి, సభాఖ్య,
శివసభాక్య, సదాశివాక్య, శూన్యాక్య, ప్రతర్క్య, ప్రమాణ

శుభ్రి, విభ్రాజ్య, మానం, అకార, ఉకార, మకార, ఓంకార, అదనీనాథ, వరోర్ధ్వ, పరమహంస విమానం, మూల, ప్రసాద, శిష్టప్రసాద, తత్వప్రసాద, ఆదిప్రసాద, అంత్యప్రసాద, మహా ప్రసాద, మహాదేవప్రసాద, భోగానంద, కంద, జాతారవింద, ప్రాణముల చోద్యదిత, బృంగం, కామనాంగం, తారక, కుండలీ, అర్ధచంద్రి, దర్పణజ్యోతి, ఓం, ప్రిణవకృతీ, నపూర్వ కృత, దుమకృత, పాకృత, సర్వచైతన్య, కృతం, పునస్స, మస్తకం, నకృతం, జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, శుద్ధాత్మ, ప్రేరేపక, ప్రకట, ప్రకాశ, మాన, మానిత, లీలా వినోదం, దృత, కృతాత్మీయ, దాసానుమోదం, శ్రీవాజ్మ, యీనాథ, శ్రితజనబోధ దేవేంద్రి, నుతపాత, దీనానుమోద, శ్రీకృష్ణ, కేశవ, శ్రీలక్ష్మిలోల, ప్రాకృత, భవపాశ బంధన చ్ఛేద పాయక మిముగొల్తు. పార్వతీనాథ, గాయజ సంహార, కర్మవిదూర, ముల్లోకపావన, మూలమహాసామి, కల్లగాకుండిన కరసంజ్ఞ నిలచి యుల్లంబులో నిలచి యుండుమో దేవ యెల్ల వారల కోర్కెలీడేర్ప జేయు నిత్యనిరంజన, నిర్మలమూర్తి, అత్యంత భక్తి మీకంజలిజేతు, ప్రత్యక్షమూర్తి మీ పాద ములు గొలుతు సప్తమాతృకలాది శక్తులనెల్ల గుప్త మార్గ ములచే కొలచి భజియింతు ప్రకటిత గణముల భక్తితో దలతు సకల దేవతలను సంస్మరణజేతు తప్పులు ఒప్పులు క్షమించుదేవ ఓం నమస్తే, నమస్తే, ఓం శాంతి, శాంతి, శాంతిః

వాసుదేవా! ఏవైపు జూచినను నీకిరీటములే, నీగదలే, నీచక్రములే, నీకోరలు, ఎక్కడజూచిన అగ్నిమంటలు, కౌరవసైన్యమంత నీకోరలలో బడి నలుగుచున్నారు. నీవు ఏకారణము చేత అవతారము ఎత్తితివో నాకు భయము కలుగుచున్నది. నీయొక్క ఘోరమైన రూపమును జూడజాలకున్నాను. ఎక్కడ జూచిన నీచేతులు భూమి ఆకాశము వరకు వ్యాపించియున్న నీస్వరూపము అనేక రంగులు గలిగి ప్రజ్వలించుచున్నది. ఓదేవ దేవ, వైకుంఠవాస, పుండరీకాక్ష, నారాయణా, మాధవా, నాయందు అనుగ్రహముంచి సౌమ్యస్వరూపమును జూప వేడుచున్నాను.

కృష్ణ:— ఏరూపము జూడ గోరెదవు? పార్థా!

అర్జు:— ఓం యనే ప్రణవమే కిరీటమున్ను అజ్ఞానవృత్తులను నశింపుజేయు క్షుద్రదేవతగా అవతార మెత్తిన నీచేతి గదయును భూత, వర్తమాన, భవిష్యత్తు అనగా సంచిత ప్రారబ్ధ, ఆగామి యనే కాలచక్రమున్ను; ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము యీ నాలుగు భుజములు గలిగి నీభక్తులకు నీ సౌమ్య రూపమును జూప గోరుచున్నాను.

కృష్ణ:— ఈ అఖండ దివ్యరూపము మరల లభించునది కాదు. కావున బాగుగా దర్శింపుము. తప, స్వాధ్యాయాది కర్మలచే నావిశ్వరూపమును గాంచజాలరు. భయ, మోహా

ముల విసర్జించి నావిశ్వరూపమును జూడుము.

అర్జు:- నీఘోర రూపమును గాంచగ భయము గలుగు చున్నది. త్వరగా నీసహజరూపమును జూపుము.

కృష్ణ:- ఇదిగో నా సౌమ్య రూపమును గాంచుము యని మాయాదృశ్యమాయెను. అర్జును నోదార్చెను.

అర్జు:- [తనలో కృష్ణపరమాత్ముని జూచి ఆలోచన చేయుచున్నాడు.] మాయకు అతీతుడు అధర్మములు హెచ్చు అయినపుడు తన మాయచే మాయరూపమును బొంది అధర్మ మునునశింపజేయుటకు కాలుడై యున్నాడు. భక్తులను రక్షించుటకొరకై శ్రద్ధచే వైరాగ్యము, వైరాగ్యముచే జ్ఞానము, జ్ఞానముచేభక్తి, భక్తిచేమోక్షము. యీభక్తులను రక్షించుట కొరకై సౌమ్య రూపమును జూపెను. ఆనందము, మహానంద మని సత్యమనే పాదములపై బడి ఓం శాంతిః, శాంతిః యని నమస్కారము చేసెను.

కృష్ణ:- నాకై సత్కర్మల నొనర్పుము. నన్నే పరమ గతిగ భావించి భజింపుము. పూర్ణ వైరాగ్యముతో సర్వ భూతము లాత్మ యని భావించి ద్వేషమును నిర్మూలింపుము. అప్పుడు నన్నే పొందగలవు.

---

# భక్తి యోగము

## పంద్రెండవ అధ్యాయము

అర్జు:- కృష్ణా! నీదివ్యస్వరూపముజూచి ఆనందించితిని.

కృష్ణ:- అర్జునా! నాదివ్యస్వరూపము ఏవిధముగా నీకు దర్శనమాయె ననగా నేను చేయు బోధయే నీకు విరోచన మాత్ర. శ్రద్ధ యను యనుపానముతో నిష్టయనె మాత్రను మ్రింగగా అజ్ఞానమనే వాత నొప్పులు నీరుగా కరిగిపోయెను. పంచక్లేశములనే పైత్యపసరులు అతితొందరగా ఎగిరిపోయెను. వాతపైత్య అనగా యీ స్థూలాంగములో యున్న అజ్ఞాన వృత్తులు, పంచక్లేశములు, రాగద్వేషములనే పదమూడు గుణములు; యీషణత్రయములు మూడు, అరిషడ్వర్గములు ఆరు, సంగత్రయములు మూడు, స్థానత్రయములు మూడు, మలత్రయములు మూడు, వాసనత్రియములు మూడు, కర్మ త్రియములు మూడు, బంధత్రయములు మూడు, కరణత్రయ ములు మూడు యీపైన చెప్పినవన్నియు వదలి చంచల రహితం యెప్పుడయినదో అప్పుడు నాస్వరూపము నీకు దర్శన మైనది.

అర్జు:- మాధవా! త్రియములు చెప్పినారే అవి విడి విడిగా చెప్పుము.

కృష్ణ:— రాగ, ద్వేష, క్రోధిని, అభినివేష, అవిద్య పంచక్లేషములు. డంబము, దర్పము, పొగరుబోతు తనము, కోపము, కఠినము, అజ్ఞానము, అబద్ధము, చాడీలు, దేముడు లేడని చెప్పుట, అబద్ధసాక్ష్యము చెప్పుట, స్త్రీలను వశపరచు కొనుట, నన్ను జయించగలడా యని గర్వించుట, పరుల ధనమును అపహరించుట యివి రాగముతో గూడిన గుణములు. యివి గాక ధారీషణ, ధనీషణ, పుత్రీషణ ఈషణత్రయములు మూడున్ను; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యం యివి అరిషడ్వర్గములు. అంతసంగ, బహిసంగ, సత్సంగ యివి సంగత్రియములు. సూర్యస్థానం, చంద్రస్థానం, అగ్ని స్థానం యివి స్థానత్రియములు. ఆణవ, కార్మిక, మాయా మలం యివి మలత్రియములు. శాస్త్రవాసన, లోకవాసన, దేహవాసన యివి వాసనత్రియములు. కార్య, కారణ, కర్తృత్వములు యివి కర్మత్రియములు. రేచిక, పూరక, కుంభక యివి బంధత్రయములు.

అర్జు:— మాధవా! రేచిక, పూరక, కుంభక యీ మూడు ప్రాణాయామములని శాస్త్రములు చెప్పబడుచుండగా యివి వదలమని చెప్పుచున్నారేమి?

కృష్ణ:— యీ ప్రాణాయామము స్థూలాంగ శుద్ధి కొరకే గాని సూక్ష్మాంగశుద్ధి గాదు. ఏవిధమనగా: అజ్ఞాన వృత్తులన్ని వదలిపెట్టడమే రేచికం. జ్ఞానవృత్తులన్ని స్వీక

రించడమే పూర్వకము. మనస్సు చంచలము లేకుండ నిశ్చింతగా యుండడమే కుంభకము.

అర్జు:— మాధవా! తెలిసినది. కరణత్రయము లెట్టివో తెల్పుము.

కృష్ణ:— కాయిక, వాచిక, మానసిక యివి కరణత్రియములు. అర్జునా నేను చెప్పినవన్ని వదలి చంచల రహితుడై నేను ఇచ్చిన దివ్యదృష్టిచేత అనగా చూపు త్రికూటమునందునిలిపి నానిరాకారములో ఎవరైక్యమవుతున్నారో వారు నాసన్నిధి జేరుతున్నారు.

అర్జు:— నేను జూచిన యీ విశ్వరూపము సాకార, సగుణోపాసన లేక నిరాకార నిర్గుణోపాసన జెప్పుము.

కృష్ణ:— సాకార, సగుణోపాసకులు ఒక తరగతివారు. నిరాకార నిర్గుణోపాసకులు రెండవ తరగతివారు. యీ రెండు ఉపాసకులకు మనో నిగ్రహము గట్టిగా యుండవలయును. ఇప్పుడు నీవు జూచిన విశ్వరూపము సగుణోపాసన.

అర్జు:— మాధవా! సగుణోపాసన శ్రేష్టమా, నిర్గుణోపాసన శ్రేష్టమా?

కృష్ణ:— యింద్రియములకు కనబడుచున్నదే సగుణోపాసన, యింద్రియముల కగోచరములకు పరబ్రహ్మను ధ్యానించువారు నిరాకారోపాసకులు గనుక సగుణోపాసకన్న నిర్గుణోపాసనయే చాలా శ్రేష్టము.

అర్జు:— మాధవా! నిర్గుణోపాసన యొక్క యంశము స్పష్టముగా బోధించుము.

కృష్ణ:— దేహాభిమానముతో కూడినది సగుణోపాసన. దేహాభిమానము లేనిది నిర్గుణోపాసన.

అర్జు:— దేహాభిమాన మనగా యెట్టిది?

కృష్ణ:— అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేషము యీఅయిదుతో కూడినది సగుణోపాసన. ఈఅయిదు లేని దే నిర్గుణోపాసన.

అర్జు:— అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేషము. ఈ అయిదు యొక్క భావములు తెల్పుము.

కృష్ణ:— అవిద్య యనగా నాకే కలిగినది, నేనే కారణము, నాదే ఇది యనడమే శుద్ధ అజ్ఞానమని పేరు. అస్మిత యనగా అహంకారముతో కూడిన పనులు. రాగము అనగా వారి వారి స్వలాభము కోరుటయే. ద్వేషము అనగా పరులు చేయు పనులను, విఘ్నములను నశింపు చేయుటకు పన్నాగము చేయు వృత్తులు. అభినివేష మనగా నాయిల్లు, నాపాపలు, నాఆస్తి, నాబంధువులు సమస్త భోగములతో వోలలాడుచున్నదే యాశ. ఈభావములతో కూడుకొన్నది సగుణోపాసన. ఏమియు లేక నిశ్చింతగా మనస్సును పరబ్రహ్మలో ఐక్యపరచడమే నిర్గుణోపాసన. ఈనిర్గుణోపాసన నూటికొకరు వెయ్యికొకరు, లక్షకొకరు, కోటికొకరు యున్నారు.

అర్జు:- యతీశ్వరులు, ఋషులు, మహామునులు, సాధువులు చేయునది ఏయుపాసన?

కృష్ణ:- వారు చేయునది నిర్గుణోపాసన.

అర్జు:- భక్తునికుండవలసిన లక్షణములు సెలవిండు.

కృష్ణ:- సర్వమునందు వైరముండరాదు. సర్వమునందు స్నేహ ముండవలయును. సుఖ దుఃఖముల యందు సముడై యుండవలయును. ఓర్పు యనే శాంతము చాలా అవసరము. సదా సంతోషియై యుండవలయును. సదా ధ్యానము స్మరణ, జపము యుండవలయును. మనస్సును, శరీరమును స్వవశము చేసుకొని యుండవలయును, భగవంతుని యందు ధృడదీక్ష వహింపవలయును. మనోబుద్ధులను పరమాత్మని యందుంచవలయును. అట్టివాడు పరమాత్మకు ప్రియుడును, భక్తుడగుచున్నాడు.

అర్జు:- కృష్ణా భక్తుల కుండ వలసిన సద్గుణములు ఇవియేనా ఇంకను గలవా?

కృష్ణ:- శ్రద్ధతో వినుము భక్తుడు, పామరులను భయపెట్టరాదు. యితరుల గాంచి భయపడరాదు. సంతోషము భయ భ్రాంతులు వదలవలయును. కోరిక లుండకూడదు. పవిత్ర మనసుతో యుండవలయును. కామ్య కర్మల పరిత్యజింపవలయును. అది సంతోషము, ద్వేషము, శోకము, ఆశలు ఈ దుష్టగుణములను దూరముగా వదలవలయును.

శుభాశుభముల కతీతుడు గావలయును. శత్రు మిత్రులయందు మానావమానములయందును శీతోష్ణములయందును సుఖ దుఃఖములయందును సమానుడై ప్రవర్తింపవలయును. సంఘమును పూర్తిగా వదలవలయును. నిందాస్తుతులయందు వికారము నొందరాదు. మౌనమును వహింపవలయును. యదృచ్ఛాలాభసంతుష్టుడై మనవలయును. తనదను బుద్ధితో దేనిని చేర్చరాదు. స్థిరబుద్ధి గలిగి వర్తింపవలయును. ఇట్టి వాడు నాకత్యంత ప్రియుడు.

అర్జు:- మాధవా! యిన్ని సద్గుణములు సాధించుట కష్టము కదా?

కృష్ణ:- శ్రమపడక ముక్తి యెటుల లభించును? పైన పేర్కొనబడిన వాక్యమును దృఢముగ నమ్మి నన్నే పరమ ప్రాప్యముగా భావించి యాజ్ఞలకు బద్ధులై నడచువారు నాకత్యంత ప్రియులు.

# క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగ యోగము



## పదమూడవ అధ్యాయము

అర్జు:— కృష్ణా! క్షేత్రి మనగా నేది? క్షేత్రజ్ఞుడెవడు?

కృష్ణ:— అర్జునా! యీ స్థూలాంగశరీరమె క్షేత్రిము. యీ క్షేత్రముయొక్క మహిమలు, లీలలు దీని నెరుంగువాడు క్షేత్రజ్ఞుడు అనగా జీవుడు.

అర్జు:— క్షేత్రజ్ఞుడన పరమాత్మగదా; జీవుడెట్లాయెను?

కృష్ణ:— సత్వగుణ ప్రధానమైన మాయతో గూడి నిమిత్తకారణమును తమోగుణ ప్రధానమై యవిద్యతో గూడి యుపాదాన కారణమునై జీవేశ్వర జగద్రూప కార్యములు నేనే యగుచున్నాను. జీవుడుయొక్క బంధనలు, యవిద్య, తమోగుణ, అజ్ఞానవృత్తులు వదలి చంచలరహితమై నాలో ఐక్యమగుచున్నాడో వాడే నేను, నేనే వాడు.

అర్జు:— అజ్ఞాన మనగా నేది?

కృష్ణ:— క్షేత్ర మనగా శరీరము. ఈశరీరములో కాపురము చేయువాడు ఎవరని విచారణ చేయుటయే జ్ఞానము.

అర్జు:— క్షేత్రమన శరీరమంటిరి. దాని స్వభావమెట్టిది?

కృష్ణ:— ఆకాశము, సహస్రారము, శ్వాస, ఉచ్వాస, వాయువు, జఠరాజ్ఞయే అగ్ని, నెత్తురు, మూత్రము, కళ్ళె,

కఫము, శ్లేష్మము ఇవియే జలము, చర్మమే భూమి యీఐదు భూతములు, ఆకాశమున్ను, పృధివి సంయోగముచే అహంకారము పుట్టెను. ఆకాశ అగ్ని సంయోగముచే బుద్ధి పుట్టెను. శ్రోత్రములు, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణ, జ్ఞానేంద్రియములు, వాక్కు, పాణి, పాద, గుహ్యాం, గుదం, కర్మేంద్రియములు, ఆకాశము, గాలి సంయోగముచే మనస్సు పుట్టెను. విషయములు కోర్కె అనే కామము, ద్వేషము, సుఖము, దుఃఖము యివన్ని దేహము యొక్క సంఘము. ఈసంఘమునకు సేనానాయకుడు మనస్సు, ఈమనస్సు సంఘములోయున్న పరివార సమేతులై నానా వికారములతో గూడినది. శరీరమనే క్షేత్రము, క్షేత్రజ్ఞుడు నిర్వికారుడు అనగా పైన చెప్పబడిన సంఘమువారికే క్షేత్రమున కధికారము గాని క్షేత్రజ్ఞుడికి యేమియును అవుసరము లేదు.

అర్జు:– క్షేత్రజ్ఞు నెఱుంగుటకు వలయు జ్ఞానాంగములను భోధింపుము.

కృష్ణ:–మనస్సు చంచలం, డంబంపనికిరాదు. అహింస, క్షమ, నిష్కాపట్యము, గురుసేవ, శౌచము, స్థైర్యము, మనోనిగ్రహము యిటువంటి సధర్మముల ననుష్ఠింపవలయును. యింద్రియ విషయములందు వైరాగ్య ముండవలయును. అహంకార రాహిత్యమును కావలయును.

అర్జు:–కృష్ణా! నాకు బాగుగ తెలియుటలేదు, విపులముగా చెప్పుము.

కృష్ణ:- మనస్సు వికారము లేక సదా నాయందే యుంచవలెను. జీవుడు సదా సత్యము, శాంతము, జ్ఞానము మరుచుటయే, హింస. స్థూలాంగమునకు గాని సూక్ష్మాంగ మునకు గాని అనగా శరీరమునకు శీతోష్ణబాధలు గాని రణ ములు గాని దెబ్బలు గాని పరిమళ గంధములు గాని సువాస నలు గాని ఏది సంభవించిననూ ఓర్చియుండుటయే క్షమ. స్థూలాంగ శరీరమునకు సదా మనస్సు నిష్కామముతో యుండుటయే నిష్కాపట్యము. జీవుడు సదా జాగ్రత, స్వప్న సుషుప్తులలో గూడ ఆత్మయనే బింబ స్వరూపమును సన్ముఖ ముద్రయందు జూచుటయే గురు సేవ. యింద్రియములను అజ్ఞానవృత్తులయందు బోనివ్వక జ్ఞానవృత్తులయందు నిలుపు టయే శౌచము. ప్రళయము వచ్చి పైన బడినప్పటికి అధర్య పడకయుండుటయే స్థైర్యము. మనస్సు కుక్కవంటిది. కుక్కను ఎంత పూజించిననూ నరకము పై కురికినట్లు మనస్సు అజ్ఞాన వృత్తులయందే బోవును. అట్లు పోనివ్వక యుంచుటయే మనోనిగ్రహము. యింద్రియము లన్నిటిని కట్టుబాటు పెట్టు టయే వైరాగ్యము. దేనియందు నేనని యనక పామరుల యందు ప్రతి వారియందు దాసుడై యుండుటయే అహంకార రాహిత్యము.

అర్జు:- మాధవా! యిపుడు బోధపడినది. విషయవిరా గము కలుగ వలెనంటివే అదినాకు తెలియలేదు గాన అది

ఏదో చెప్పుము.

కృష్ణ:-జన్మము అనగా అజ్ఞానము పుట్టుటయే మృత్యువు అజ్ఞానమున నుండుటయే ముసలితనము. జీవునియొక్క చంచలత్వము, వ్యాధి, కోరికలు, దుఃఖము, మాయ యను జీకటి వీటియందు జీవుడు విరక్తి చెంది సదా నిష్కామముతో నన్ను సేవించిన నాలో ఐక్యమగు చున్నాడు.

అర్జు:- అవ్యభిచార భక్తి యన నేమి?

కృష్ణ:- అధోలోకములు ఏడు, ఊర్ధ్వ లోకములు ఏడు, యీపదునాల్గు లోకములలో యున్న వేల్పులను గాని యితర చంచలము లేక స్థిరముగా మనస్సు నిలిపి భక్తి సలుపుటయే అవ్యభిచార భక్తి.

అర్జు:- అట్టి భక్తి ఎటుల కలుగును?

కృష్ణ:- గుణములు, సంఘము వదలి నిశ్చింత యను ఏకాంతస్థలము చేరి నన్ను ధ్యానించినచో అవ్యభిచారభక్తి గలుగును.

అర్జు:- జ్ఞాన మేది! అజ్ఞాన మేది?

కృష్ణ:- ఆత్మ విచారణయే స్థిరము. ఆత్మ యందు మనస్సు నిలుపుటయే లక్ష్యము. యిదియే జ్ఞానము. దీనికి పైవన్నియు అజ్ఞానము.

అర్జు:- జ్ఞేయ మనగా నేది?

కృష్ణ:– స్థూల, సూక్ష్మ, కారణ తురీయమునకు పై నున్న దే పరబ్రహ్మము అదియే జ్ఞేయము.

అర్జు:– ఏమి ఆనందము. వినినకొలది నూతనోత్సాహము గలుగుచున్నది.

కృష్ణ:– సమస్త భూతములలో వెలుగుచున్న వెలుగే స్థూలము. స్థూలము సూక్ష్మములలో వెలుగుచున్నది.

అర్జు:– ఆ పరబ్రహ్మమును ఎవరున్నూ తెలిసికొనజాలరా?

కృష్ణ:– జ్ఞాని మాత్రమే తెలుసుకొనుచున్నాడు. అజ్ఞాని కానజాలడు.

అర్జు:– ప్రకృతిపురుషుల లక్షణము లుపదేశింపలేదేమి?

కృష్ణ:– శరీరమే ప్రకృతి. యీప్రకృతికి మాయయను పేరు గూడ కలదు. యీ మాయయొక్క వికారమే జీవునకు సుఖ, దుఃఖములు గలిగించుచున్నది. భూతకాలము సంచితమునుబట్టి జన్మ గూడా యిచ్చుటకు కార్యమై యున్నది. యీ దేహ వికారములనుజూచి సాక్షిగానున్నాడు. మాయకు అతీతుడైనవాడే పరమాత్మ.

అర్జు:– ప్రకృతి పురుష లక్షణముల నెరిగిన ఫలమేమి?

కృష్ణ:– యీరెండింటి మధ్యను గల రహస్యమును తెలిసికొనుటయే మోక్షము.

అర్జు: పరమాత్మ నెరుంగు మార్గము లెవ్వి?

కృష్ణ:- సదా మనస్సు భగవంతునియందు లగ్నమగుటయే ధ్యానము. లగ్నమయిన మనస్సు చంచలత లేకపోవుటయే జ్ఞానము. ధ్యాన, జ్ఞానముల మధ్య గుణములను కట్టడిలో పెట్టుటయే కర్మయోగము.

అర్జు:- ధ్యానము, జ్ఞానము, కర్మముల నెరుగని వారి గతి ఏమి?

కృష్ణ:- మహానీయుల నాశ్రయించి వేదాంత శ్రవణము చేయవలెను.

అర్జు:- వేదాంతము విన్నంతనే జ్ఞానము కలుగునా?

కృష్ణ:- వినినదానిని ఆచరణపెట్టుటచే శ్రద్ధకలుగును శ్రద్ధవలన వైరాగ్యము గలుగును. దానివలన జ్ఞానము గలుగును. దీనివలన భక్తి గలుగును. దానివలన మోక్షము నొందవచ్చును. శరీరము నశించిననూ, పరమాత్మ నశించదు. యిట్లు గ్రహించినవారే ఆత్మవేత్త. ఆత్మానందం పొందును.

అర్జు:- మాధవా! ఒకరు చెప్పిన వినక తానాచరించక వితండవాదములచే వాదులాడిన వారి గతియేమి?

కృష్ణ:- పూర్వ సంచితమును బట్టి కర్మ విననీయదు. తనను చేయనీయదు. కారణమేమనగా: ఆకర్మ లన్ని యుగములనుంచి వచ్చుచు అన్ని యుగములు సంవత్సరములు మొదలు ఘడియలు, నిమిషములు, లిప్తలు వర్కు తమో

గుణమను నజ్ఞానము తొలగదు.

అర్జు:- మాధవా! బలత్కారముగా తొలగ గొట్టుద మన్ననూ విడువదా?

కృష్ణ:- నాయనా! చక్కటి మాట అడిగితివి. ఎంత ఆనంద మగుచున్నది! నామనసు కోరిన దిదియే. శ్రద్ధ, వై రాగ్య, జ్ఞాన, భక్తి వల్లనే కర్మ తొలగును.

అర్జు:- రజోగుణ, తమోగుణ రెంటితో చేరి భగవం తుని రహస్యముల తెలియక వారంతట వారు విర్రవీగుచున్న వారి గతి ఏమి?

కృష్ణ:- అట్టి వారు ఆత్మ ఘాతుకులని చెప్పదుగు. వారు అధోగతి పాలగుదురు. నానాత్వము నం దేకత్వమును ఏకత్వము నందు నానాత్వమును గాంచవలయును. అట్టి వాడే బ్రహ్మవేత్త.

అర్జు:- మాధవా! నా కర్థము గాలేదు.

కృష్ణ:- భూతములు వేరుగాయున్న ఆత్మ యొకటే యని తెలిసికొనుట, మానవత్వము నం దేకత్వము గాంచుట ఆత్మ నుండియే నానాత్వముతో కూడిన ప్రపంచ ముత్పత్తి యైనదని యెరుంగుటయే నేకత్వమునందు నానాత్వము గాంచు.

---

# గుణత్రయ విభాగ యోగము.

పదునాల్గవ యధ్యాయము

అర్జు:— భూతోత్పత్తిని గూర్చి బోధించుము.

కృష్ణ:— త్రిగుణాత్మక అనగా రజోగుణ, తమోగుణ, సత్వగుణ ఈమూడు గుణములే సృష్టికి కారణములు. ఈ త్రిగుణములే మాయ. సృష్టికి ఈగుణములు తల్లి. నేను బీజ దానమొసంగు తండ్రిని. తద్వారా భూతోత్పత్తి యగుచున్నది.

అర్జు:— త్రిమూర్తు లనగా నెట్టివారు?

కృష్ణ:— సత్వ గుణమే విష్ణువు. రజో గుణమే బ్రహ్మ. తమో గుణమే శివుడు. ఈమూడు గుణములే దేహిని బంధించుచున్నవి.

అర్జు:— ఏవిధముగా దేహిని బంధించుచున్నవి?

కృష్ణ:— సత్వగుణము నిర్మలమైనది, జ్ఞానము నొసంగునది. బ్రహ్మనందమనే సుఖమును గలుగజేయునది చంచలమును రహితము చేయుచున్నది. రజోగుణము రాగములతో కూడి ఆశ యనే తీగను పెంచుతూయున్నది. అజ్ఞానవృత్తులతో గుణములను వృద్ధి చేయుచున్నది. తమో గుణము అజ్ఞానమునకు స్థానము అనగా గృహము. సర్వ ప్రాణులను మోహింపజేయునది నిద్ర ఆలస్యము స్త్రీల కూటమి గలుగ

జేయుచున్నది. ఈప్రకారముగా పైన యున్న సత్వ గుణానికి వెళ్ళనీయక రజో, తమో గుణములు రెండు శరీరమును బంధించుచున్నవి.

అర్జు:— మొత్తముమీద ఫలితార్ధ మేమి?

కృష్ణ:— సత్వగుణము శాంత మనే సుఖము నిచ్చును. రజోగుణము అజ్ఞానవృత్తులనే కర్మలయందు వృద్ధి కలుగ జేయును. తమోగుణము, జ్ఞానము రెండు ఏకమై ప్రమాద పనులను చేయించును.

అర్జు:— సత్వగుణము వృద్ధియైనదని యెట్లు తెలియును?

కృష్ణ:— యింద్రియముల మూలమున చలనము లేక జ్ఞాన మనే వెలుగు పుట్టునో అప్పుడు సత్వగుణము వృద్ధి యైనదని తెలిసికొనుము.

అర్జు:— రజో గుణము తెలియుట యెట్లు?

కృష్ణ:— తాను పెట్టక పెట్టే వారిని చూచి సహించ లేక యున్నదే లోభము, మహా దురాశ. యింద్రియములను ఆచరణ బెట్టక పోవుట యింద్రియములకు వశమై యుండడమే రజోగుణము.

అర్జు:— తమోగుణము యొక్క ఫలిత మెట్టిది?

కృష్ణ:— అజ్ఞానవృత్తులు భగవంతుని చింతలు లేక వాసనవృత్తులో సదా యుండడము. ఇదియే సోమరితనము. జ్ఞానవృత్తులను జూచి సహించక బోవడమే మాంధ్యము.

ఇదే అజీర్తి తనము, తాను సుఖము గోరినదే మోహము. యివి గల్గినప్పుడు తమోగుణము హెచ్చునని తెలియును.

అర్జు: సత్వగుణమే శ్రేష్టమైనదని నా నమ్మకము. ఈ గుణముచేత జీవునకు గల్గు లాభమేమి?

కృష్ణ:– సత్వ గుణముతో శరీరమును వదలిన వాడు పరబ్రహ్మలో ఐక్యమవుచున్నాడు. రజో గుణముతో శరీర మొదిలినవాడు మానవ జన్మ మెత్తి అజ్ఞాన మనుభవించు చున్నాడు. తమో గుణముతో శరీర మొదిలినవాడు శునక వరహాది జన్మ మెత్తుచున్నాడు. చంచలమే కుక్క, అసూయ గుణమే పంది. రాబోవు జన్మములో ఈగుణములచేత పుట్టు చున్నాడు.

అర్జు:– త్రిగుణ సంబంధమైన కర్మలకు ఫలము లెవ్వి?

కృష్ణ:– సాత్విక కర్మకు ఫలము సూక్ష్మాంగ మనే హృదయము యేలాంటి వికారము లేక చంచలములు నశించి బ్రహ్మానందమనే ఆనందముతో యుండడమే శుద్ధి. రాజస ఖర్మకు ఫలము జాగ్రత, స్వప్న, సుషుప్తిలో గూడ సదా అజ్ఞానవృత్తులతో గూడిన దుఃఖము తామస కర్మకు ఫలము. అష్ట కష్టము లనుభవించుట.

అర్జు:– మాధవా! అష్ట కష్టము లనగా నెట్టివి?

కృష్ణ:– జరిగిపోయిన కాలమే భూత కాలము. దాని పేరు సంచితం. యిప్పుడు జరుగుచున్న కాలమే వర్తమాన

కాలము. దీని పేరు ప్రారబ్ధము. రాబోవు కాలమే భవిష్యత్తు దాని పేరు ఆగామి. మానవుడు ఏతపస్సు ధ్యానం, పాప పుణ్యములు యేది చేసియున్నాడో దానిని తప్పక ఎవరెవరు జేసినది వారే అనుభవించి తీరవలయును, తప్పదు; తప్పదు. సంచితములో జేసిన పాప పుణ్యములు ఈ వర్తమాన కాలములో అనుభవించే తీరవలయును. ఈవర్తమాన కాలములో జేసిన పాప పుణ్యములు రాబోయే భవిష్యత్తులో అనుభవించే తీరవలయును.

అర్జు:— మాధవా! అష్ట కష్టము లెట్టివో తెల్పుము.

కృష్ణ:— జీవునకు భార్య. అనే బుద్ధి లేకపోవుట 1, జీవునకు పుత్రుడు అనే శాంతము లేకపోవుట 2, సత్యమనే తల్లి లేకపోవుట 3, జ్ఞానమనే తండ్రి లేకపోవుట 4, బ్రహ్మానందమనే భోజనము లేకపోవుట 5. సత్వగుణమనే వస్త్రములు లేకపోవుట 6, మనస్సు నిర్మలమనే ఇల్లు లేకపోవుట 7, సత్సంగత్వము, సాధువుల సేవ, భగవంతుని పురాణములు వినక మూర్ఖముతో యుండడమే గౌరవము లేకపోవుట 8, యీ ఏనిమిది కష్టములలో జీవుడు నానావస్థ పడుతూ యుండడమే అష్ట కష్టములు.

అర్జు:— మాధవా! త్రిగుణాతీతుని యొక్క లక్షణము లెవ్వి? వాని యాచార మెట్టిది? అట్టి స్థితిని పొందుట యెట్లు?

కృష్ణ:— రజో, తమో, సత్వ, కార్యములు వానిపై

బడిన వికారమునొందడు. సర్వమునకు సమానుడై యుండును. సుఖ దుఃఖములకు సముడై నిరంతరాత్మ నిష్టుడై యుండును. అనగా మనో, బుద్ధి, చిత్త, అహంకారములను చంచలము లేక భక్తి యను తాడితో అంతరింద్రియములను బంధించి మట్టిని, రాతిని బంగారమును అనగా తమో గుణమనే మట్టిని రజోగుణ మనే రాయిని సత్వగుణ మనే బంగారమును సమముగా జూచును. శత్రువులు, మిత్రులు, జ్ఞానులను, అజ్ఞానులను సమముగా జూచును. వాసనత్రయములలో యున్న కామముతో కూడిన కర్మలను పరిత్యజించును. శరీరము బద్దలు బద్దలుగా తరుగుతున్న అఖండ ధైర్యము గలవాడై యుండును. ఇట్టి వానిని త్రిగుణాతీతుడందురు.

అర్జు:— ఇట్టి స్థితిని బొందుట నాకలవి యగునా?

కృష్ణ:— స్థూలాంగముపై భ్రాంతి వదలి సూక్ష్మాంగ మనే నిశ్చలముచేత భక్తి యనే యోగముతో నన్ను ధ్యానించుము. క్రమముగా త్రి గుణములు నశించి త్రిగుణాతీతుడవై బ్రహ్మ విచారమున కరుహుడ వగుచున్నావు. గుణములకు అతీతుడవు యెప్పుడైనావో నీవే నేను, నేనే నీవు.

# పురుషోత్తమ ప్రాప్తి యోగము.

పదునైదవ యధ్యాయము

అర్జు:— కృష్ణా! నిన్ను యెరుంగుట యెట్లు?

కృష్ణ:— జీవుడు శరీరముతో కూడుకొని పుట్టుటయే స్కంధము. ఇదియే భాగవతము. జీవుడు జన్మమెత్తి అజ్ఞాన వృత్తులతోటి, వాసనత్రియములతోటి, పంచక్లేశములతోటి మెలంగుటయే పర్వము. ఇదియే భారతము. జీవుడు భూత కాలములో నుంచి పోగుచేసికొని వచ్చిన అనగా అజ్ఞాన వృత్తులే ధనము. ఆ ధనమును కాపాడుట కొఱకై భవిష్యత్తు యెదురుగా నడచుచున్న ఆశయే రామాయణము. ఇదియే వృక్షము. దీనిని ఛేదించి నన్ను యెరుంగవలయును.

అర్జు:— సంసార వృక్ష మెట్టిదో తెలిసిన దానిని ఛేదింప నగుదును.

కృష్ణ:— పరమేశ్వరుడు స్వర్గమునం దుండుటచే నచ్చోట నుండి వెలువడిన జగద్వృక్షము క్రిందికి అనగా శిరస్సు లగాయితు కంఠము వరకు స్వర్గలోకము, కంఠము లగాయితు మణిపూర్వము వరకు పితృలోకము, మణిపూర్వము లగాయితు ఆధారము వరకు యమలోకము, యమలోకమే మనుష్యలోకమని పేరు. యీవృక్షము యొక్క మూలము.

పరమేశ్వరుడు పైనుండెననియు ఆ వృక్షము యొక్క శాఖలు అనగా పిమ్మట స్థూలాంగమనే జగత్తు యొక్క విస్తారము క్రిందికి నంకురించిన వనియు వర్ణింపబడినవి. మొదలు పైనను కొమ్మలు క్రిందను యుండి ఏది ఎప్పటికిని నశింపనిదనియు వేదములు దేనికి యాకులనియు చెప్పిరో యాయశ్వద్ధ వృక్షమును తెలిసికొన్న వాడే వేదముల నెరింగినవాడు. అశ్వద్ధ శబ్దమునకు అర్థము. అ–కాదనియు, శ్వ–రేపనియు, ధ–నుండునదియు అనగా రేపటి వరకు నుండునది కాదు. ఈ 72 వేల నాళ్ళు శాఖలు క్రిందికిని, మీదికిని వ్యాపించియున్నవి. అహంకారముతో గూడియున్నవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వాణవేదము ఉపనిషత్తులు 108 యివియే ఆకులు నాడులనే కొమ్మలు అధోలోకములు ఏడు, ఊర్ధ్వలోకములు ఏడు కలసి పదునాల్గు భువనములకు వ్యాపించి యున్నవి. రజోగుణ, తమోగుణ, సత్వగుణ యీ త్రిగుణములనే నీటిచే పెరుగుచున్నవి. నీటికి చిగురుటాకులు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడు పంచ తన్మాత్రలు. పూర్వ జన్మ కర్మ ఫలితమును బట్టి రాగ ద్వేషములు కలుగును.

అర్జు:– మాధవా! యిట్టి సంసార వృక్షమును ఛేదించుట యనగా నెంత పని?

కృష్ణ:– దీని రూపమే తెలియబడదు. ఆది మధ్యాంతములు తెలియరాదు. అవిన్నీ గాక యుగ యుగములనుండి

దృఢమైన వేళ్ళు గలిగి బలిష్టమై యున్నది. తప్పక దానిని ఛేదింపవలెను.

అర్జు:— ఎట్టి ఆయుధముచే ఆవృక్షమును నరుకవలెను?

కృష్ణ:— విరక్తి యనే ఆయుధము చేతనే నరుకబడును.

అర్జు:— తరువాత నేమి చేయవలెను?

కృష్ణ:— పుట్టుట, పెరుగుట, చచ్చుట యను సంసార మెవ్వని నుండి యుద్భవించెనో అట్టి పరమాత్మను పొందవలెను.

అర్జు:— పరమాత్మను పొందుటకు యోగ్యత యేది?

కృష్ణ:—అభిమానములు వదల వలయును. భ్రాంతులు ప్రకృతి వస్తువుల యందు మమకారము వదల వలయును. అజ్ఞాన సంఘమును వదలవలయును. వేదాంత విచారణయందు ప్రీతి కలిగి యుండవలెను. కోరికలు నశింప చేయువలెను. శీతోష్ణాది ద్వంద్వముల కతీతుడు కావలెను. యీ లక్షణములు కలగినవాడు నాస్థానమును బొందుచున్నాడు.

అర్జు:— ఆపరమ పదతత్వమును యింకనూ బోధింపుము.

కృష్ణ:— మణిపూర్వకమె సూర్య మండలము. అనాహత చంద్ర మండలము. విశుద్ధస్థానమే అగ్ని మండలము. యీ మూడు మండలములు దాటి సహస్రార మనే పరంధామమును చేరినవారు తిరిగి వచ్చుట యుండదు.

అర్జు:– స్థూలాంగ మనే లోకమున జీవుడని పిలువబడు వాడెవ్వడు?

కృష్ణ:– వాడున్నూ నా యంశభూతుడే. ఏవిధమనగా ఆకాశము ఆకాశముతో గూడుట వలన సమిష్టి భూతంబను జ్ఞాత యనే జీవుడాయెను, వాడే మనస్సుతో గూడి అనగా ఆకాశ, వాయువు సంయోగము వలన మనస్సు పుట్టెను. అట్టి మనస్సుతో జీవుడు చేరి జ్ఞానేంద్రియములో శ్రోత్రము, త్వాక్, చక్షు, జింహ్వా, ఘ్రాణ, ద్వార, వాసనత్రయముల నాకర్షించుచున్నాడు.

అర్జు:– కర్మ వలన శరీరము వచ్చినది. శరీరము నశించునప్పుడు కర్మ కూడా నశించును గదా; యిక కర్మ నివృత్తికై ప్రత్యేకించు ప్రయత్న మేల?

కృష్ణ:– ప్రతివాడొనర్చు కర్మ యొక్క వాసనలు సూక్ష్మముగా శరీరమును చేరును. శరీరమునందు ప్రవేశించునప్పుడు గాని వదలునప్పుడు గాని జీవుడీ సూక్ష్మ శరీరమును తీసికొని పోవుచున్నాడు.

అర్జు:– అది ఎట్లు? మాధవా!

కృష్ణ:– పుష్ప వాసనను గాలి దూరముగా తీసికొని పోవునట్లు జీవుడే సూక్ష్మ శరీరమును తీసికొనిపోవుచున్నాడు.

అర్జు:– మరల శరీరమును ధరించునప్పుడు యీసూక్ష్మ శరీర గతవాసన ఈజీవు నాశ్రయించునా?

కృష్ణ:- చెరువు నిండా నీరు కల్గినప్పుడు దానిలో అనేకములైన ప్రాణు లున్నవి. అవి యే వనగా చేపలు, పీతలు, కప్పలు, జలగలు, నీటి పాములు, పురుగులు మొదలగు తిమింగలాది పెద్ద జంతువులు గూడా యనేకములున్నవి. వేసవి కాలములో చెరు యెండిపోయినపుడు యీ జంతువు లేమాయను తిరిగి జల పూరితమయిన వెంటనే తిరిగి పై జలచరములన్నియు యథాప్రకారముగనే జేరుచున్నవి. ఆప్రకారమే అకాలముచే శరీరము పోయిన వర్షమనే తిరుగ జన్మ కల్గిన వెంటనే వారి వారి ఫలితములను బట్టి వాసనలు చేరి జీవుని బాధలు పెట్టుచుండును.

అర్జు:- ఆ జీవుడే ఆత్మ కదా? మాధవా!

కృష్ణ:- జీవునకు యున్న బంధనలు తెంచుకొని లోక వాసన, దేహవాసన, శాస్త్రవాసన యీ మూడును న్నా ఎప్పుడు వదలినాడో యప్పుడు ఆత్మ స్వరూపుడుగాయున్నాడు.

అర్జు:- యిక నీ యంశ మెవరు తెలుసుకొనుచున్నారు?

కృష్ణ:- భక్తులు జ్ఞానదృష్టిచే తెలుసుకొనుచున్నారు.

అర్జు:- వారికి ఏవిధముగా తెలియును?

కృష్ణ:- సాధన చతుష్టయములు అష్టాంగ యోగముల ద్వారా ఆత్మను గనుచున్నారు.

అర్జు: యోగము లన నెట్టివో తెల్పుము.

కృష్ణ:- ఒకటి నిత్యానిత్య వస్తు వివేకము, నిత్యమేది?

అనిత్యమేది? యని సర్వము అనిత్యము, నిత్యము పరమాత్మ యని భావించుట. యిహామూత్రార్థ ఫల, భోగ, విరాగము. యిండ్లు, తోటలు, ధనం, ధాన్యము సంపదలు, భోగములు. మల మూత్రాదులతో సమానమని భావించుట. శమాది షట్కర్మ సంపత్తి. శమము, దమము, ఉపరతి, తితీక్షణ, శ్రద్ధ, సమాధాన యివి ఆరు ఏవిధ మనగా శమము బాహ్యేంద్రియ నిగ్రహము. దమము అంతరింద్రియ నిగ్రహము. ఉపరతి సదా భగవంతుని ధ్యానించుట, తితీక్షణ, కష్ట, సుఖ, ఎండ, గాలి, వాన, చలి వీట్ల కోర్చి యుండుట. యిక శ్రద్ధ వేదము లందు, పురాణము లందు, శాస్త్రము లందు, పెద్ద లందు. సాధువు లందు వారు చెప్పెడి విషయము లందు నమ్మి యుండుటయే శ్రద్ధ. సమాధాన శత్రువు లందు, మిత్రు లందు సర్వ సముడై యుండుటయే సమాధానము. మోక్షేచ్ఛ యీ వాసనత్రయములు ఎప్పుడు వదలునో యదియే యోగము. అదెట్టిది? దీనికి సాధన యేది? అని సదా జింతించుటయే మోక్షేచ్ఛ.

అర్జు:- అష్టాంగ యోగము లెవ్వియో దెలుపుము.

కృష్ణ:- ఒకటి బాహ్యేంద్రియ, విషయేంద్రియము లందు విరాగి యవుటయే యమము. పరతత్వ మనగా భగవంతుని యందు సదా మనస్సు నిలిపి యుండుట నియమము. సర్వ వస్తువు లందు యీర్ష్య నాశనము చేయుటయే ఆసనము. యీ

స్థూల శరీరమునకు అవిద్య మూలమని తెలసి శ్వాస, ఉచ్ఛ్వాస మనస్సును ఆగ్నేయ స్థానము నందు నిలుపుటయే ప్రాణాయామము. మనో, బుద్ధి, చిత్త, అహంకారము వీటిని బంధించుటయే ప్రత్యాహారము. సోహం, హంసో యని అజప గాయిత్రి యందు చింతన చేయుటయే ధ్యానము. వాచక, శబ్ద, మానసిక యనునవి మూడు. దీనికి వాటిలో అందరు వినునట్లుగా స్మరించుటయే వాచక మనబడును. పెదవులతో స్మరించుటయే శబ్ద. పెదవులు మూసి మనస్సులో స్మరించుటయే మానసికము. రాత్రి, పగలు, జాగ్రత, స్వప్న, సుషుప్తులలో సదా యీ మూడింటిలో దేనితోనైనను విరామము లేక స్మరించుటయే ధారణ. జీవుడు చిద్రూపమైన బ్రహ్మ యందు కలశి చిన్మయుడై తన్మయత్వము జెందునది సమాధి యనియు చెప్పబడుచున్నది. యీ ప్రకారముగా ఆత్మను గనుచున్నారు.

అర్జు:— ఓ యదునందనా! మూఢుల విషయము చెప్పుము.

కృష్ణ:— శ్రద్ధ, వైరాగ్యము లేని వారే మూఢులు. వారు ఆత్మ నెరుంగ జాలరు.

అర్జు:— ఓ దయామయా! అటులైన నీ మహిమను బోధింపుము.

కృష్ణ:— యీ స్థూలాంగ శరీరమే ప్రపంచము. యీ ప్రపంచమున ఆత్మజ్యోతి యనే సూర్యుడను నేను. మనస్సనే

చంద్రుడను నేను. స్థూలాంగ మనే భూమియందు ప్రవేశించి జ్ఞానా జ్ఞానవృత్తులకూ, సమస్త భూతములకూ వృత్తులు కల్పన చేయువాడను నేను. రసము లనగా ఉప్పు, కారము, తీపి, చేదు, వగరు, పులుపు యీ రసములను స్వీకరించెడి చంద్రుడను నేను. జఠరాగ్ని యందు దేహాము నాశ్రయించి నాల్గు విధములైన ఆహారమును పచనము చేయుచున్నాను.

అర్జు:— అట్టి నిన్నెరుంగు టెట్లు?

కృష్ణ:— వేదముల చేతను, ఉపనిషత్తుల సారము చేతను నన్ను తెలియవలెను. వేదాంతమును నిర్మించిన వాడను, వేద వేత్తను, చరా చరుల నతిక్రమించిన పురుషోత్తముడను నేనే.

అర్జు:— ఓ కృపామయా! అట్టి నిన్నెరుంగకుండుటకు హేతు వెద్ది?

కృష్ణ:— దమ, మమ, భ్రాంతి. దీని పేరే మోహాము. యిట్టి మోహామును త్యజించిన వారు నన్నెరుంగుచున్నారు. వారు సర్వజ్ఞులై అనగా జపము, తపము, భజన, ధ్యానము, సత్సంగత్వము, యింద్రియములను కట్టడిలో పెట్టుటయే ఆచ రణ మౌనము. వీటి ద్వారా సదా నన్నే స్మరించుచున్నారు. నన్నే దీక్షతో జూచుచున్నారు.

అర్జు:— నీ యుపదేశ మమోఘము.

కృష్ణ:— పరమ రహస్య మయిన శాస్త్రమును నీ కుప దేశించితిని.

అర్జు:- మాధవా! నీ కరుణకు సహస్ర నమస్కారములు చేయుచున్నాను.

కృష్ణ:- నీవు పాప రహితుడవు. నీ కుపదేశించితిని. బుద్ధిమంతుడు దీని నెఱింగి కృత కృత్యుడగుచున్నాడు.

# దైవాసుర సంపద్విభాగ యోగము.



## పదునారవ యధ్యాయము

అర్జు:- జ్ఞానమును వినుట కెవరర్హులు?

కృష్ణ:- సద్గుణములచే కొందరు దేవతలనియు, దుర్గుణములచే మరి కొందరు రాక్షసులనియు పిలువబడుచున్నారు.

అర్జు:- ఎట్టి వారు దేవతలు? ఎట్టి వారు రాక్షసులు?

కృష్ణ:- యిరువది యారు సద్గుణములు గలవారు దేవతలు. చంచలము లేక వికారము, భయము లేక నిర్మలముగా యున్న మనస్సు నిర్భయత్వము, సాత్విక గుణము, జ్ఞానమునందు మహాసక్తి కలిగి యుండుట, మనస్సు సదా భగవంతుని యందు లగ్నపరచుటయే దానము. యింద్రియములను ఆచరణ యందు పెట్టుటయే నిగ్రహము. శ్వాసా నిచ్ఛ్వాస సదా సోహం, హంసో యని జపించుటయే యజ్ఞము. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము ఉపనిషత్తుల సారాంశము గ్రహించుటయే వేదాధ్యయనము. భజన, హరికథ, నృత్యము, భాగవతము, భారతము, రామాయణము సదా జపము, తపస్సు యింద్రియములను అజ్ఞానవృత్తులకు బోనివ్వక కాపాడుటయే నిష్కామము లేక బ్రహ్మచర్యము. జీవుడు సత్యం, జ్ఞానం, మరచుటయే హింస. జీవుడు శాశ్వతం ఏది యని గుర్తించి శాశ్వత స్వరూపమును నమ్మి యుండు

టయే సత్యము. శత్రువులయందు, మిత్రులయందు క్రోధము లేకుండ సముడై యుండుటయే అక్రోధము. అజ్ఞానవృత్తులు అన్నియు శుభ్రముగ విసర్జించుటయే త్యాగము. సాధనముల యందు యోగముల యందు చంచలము, వికారము లేక నిర్మలముగా యుండుటయే శాంతము. అసూయ లేకయుండు టయే పిసునత్వరాహిత్యము. స్థూలాంగము దాటి సూక్ష్మాం గములోనున్న కర్మ దేవతలను, పితృదేవతలను, నవగ్రహాము లను, ఆధ్యాత్మ దేవత లందర్ని ఆరాధించుటయే సర్వ భూత దయ. మనస్సును వికారము లేక నిశ్చింతగా యుండుటయే మనో నిగ్రహాము. ధర్మాధర్మ గుణముల రెంటిలో అధర్మ మును నశింపుచేశి ధర్మ పాలన చేయుటయే మృదుత్వము. సభల యందు పెద్దల యందు సత్సంగము వద్ద పురాణములవద్ద తిరిగి మాట్లాడకుండుటయే సిగ్గు. ఆకాశము అగ్నిలో కలియుట వలన బుద్ధి పుట్టెను. అట్టి బుద్ధిని విపరీత వృత్తులకు బోనివ్వక నిశ్చలముగా యుంచుటయే స్థిర బుద్ధి. ఆదిత్యుని తేజస్సు యట్టిదో అట్టిదే బ్రహ్మవిద్య తేజస్సు. అశ్రద్ధ లేకుండ వైరా గ్యముతో భగవంతుని ధ్యానించుటయే జ్ఞాన ఓర్పు. అండ పిండ బ్రహ్మాండములు నశించినప్పటికి అధైర్య పడక యుండు టయే ధైర్యము. దేవతలను బ్రహ్మజ్ఞాన దేవతలను పర మాత్మనే గురువును భక్తులను పూజించుటయే శౌచము. సర్వము నందు మోస బుద్ధి లేక యుండుటయే అద్రోహాము. ఏపని యందు గాని నేననక దాసుడై యుండుటయే గర్వ

రాహిత్యము. యీ సద్గుణములు గలవాడై దైవంశములో పుట్టిన వాడగుచున్నాడు.

అర్జు:– రాక్షసుల గుణము లెట్టివి?

కృష్ణ:– డంబము, గర్వము, అభిమానము, క్రోధము కాఠిన్యము, అవివేకము ఇవి రాక్షసాంశములో పుట్టిన వారి కుండును.

అర్జు:– దైవాసుర విభాగము లెరింగిన ఫలమేమి?

కృష్ణ:– దైవ సంపద మోక్షము నిచ్చును. అసురీవ సంపద బంధములు కలుగజేయును. నీవు దైవ గుణములను సంపాదించుము. అసురగుణములను వదలిపెట్టుము.

అర్జు:– అయ్యో; వినగనే విషాధము కల్గుచున్న దే!

కృష్ణ:– నీవు దైవ సంపదయందు బుట్టినవాడవు. నేను చెప్పినట్లు చేయుము.

అర్జు:– అసుర గుణములను గూర్చి అజ్ఞానమును గూర్చి విస్తారముగా బోధింపుము.

కృష్ణ:- అజ్ఞానవృత్తులే రాక్షసులు. వారు ధర్మముల నెరుంగ జాలరు. పెద్దల పూజ, దేవుని భక్తి, మంచి గుణములను మంచివారికి మరలించుటయే ఆచారము. సత్యము యీ ధర్మములు వారి యందుండవు.

అర్జు:–అజ్ఞానుల గుణవృత్తులు వినుటకు చాల సంతోష పడుచున్నాను.

కృష్ణ:- స్థూలాంగమనే జగత్తును సత్యమనే పరమాత్మడు లేడని, పుట్టించేవాడు లేడనియు స్త్రీ పురుష సంయోగమే జగత్ సృష్టికి హేతువందురు. సర్వమునకు కామమనే కోరికయే ప్రధానమని చెప్పుదురు. యిట్టివారు తమోగుణముతో గూడిన మూర్ఖము గలవారై అజ్ఞానములో అజ్ఞానమయిన పనులు చేయుచు శరీరమనే లోకమునకు ఆతతాయులై చరింతురు.

అర్జు:- మాధవా! ఆతతాయులన నెట్టివారు?

కృష్ణ:- కామమనే కోరికతో భ్రాంతనే మోహము గలిగి చంచల గుణమనే గర్వముతో అసత్యమనే అధర్మపనులు తొందరగా చేయుదురు. సముద్రమునైననూ దాటవచ్చును గాని వారి ఆశలకు అంతు లేదు. భౌతిక సుఖముల ననుభవించుటయే పరమార్థమని నిశ్చయింతురు. అనగా దూషించుట, కొట్టుట, తిట్టుట, ఒకరిని బాధపెట్టుట, తప్పు సాక్ష్యములు చెప్పుట, చాడీలు చెప్పుట, కలహములు పెట్టుట, ఎదుటివారి మేలు చూచి సహించకపోవుట, నాతో యెవరున్నారని ప్రగల్భములు చెప్పుట, అన్యాయముచే ధనమును సంపాదించుచూ వారికి ధనమే పరమ దేవత. ఆ ధన దేవత యనే కోరికలు గలిగిన యింద్రాది దేవతలున్నూ, పితృ దేవతలున్నూ సదా పూజింపబడుచున్నారు. నాకు పెద్ద ధనమున్నదని గర్వముగా పలుకుచుందురు. ఇష్ట భోగము లనుభవించుచుందురు

యుబ్బెదరు. రాబోవు కాలమునకు గూడ యిన్ని కోట్లు, లక్షలు, వేలు, వందలు వచ్చునని లెఖలు గట్టుచు విర్రవీగు చుందురు.

అర్జు:— మాధవా! నీ స్మరణ లేక జ్ఞాన శూన్యమై యుండుట అజ్ఞానములో యుండవలసిన కారణ మెందులకు?

కృష్ణ:— సంచితమును బట్టి ఆశ యనే తాళ్ళతో దానిని బంధించి కామ మనే కోరికలు లేక లత యనే తీగలు ఆగామికి రాబోవు జన్మమే ఆగామి. అప్పటికీ యిప్పటి నుండియు పోగుచేయుచునే యుందురు. యిది వారి వారి కర్మ ఏమి చేయను.

అర్జు:— వినిన కొలది వీరి వృత్తాంతములు భయమును కలుగ చేయుచున్నవి.

కృష్ణ:— యింకనూ వినుము. నేను శత్రువులను సంహారించితిని. ముందు కొంత మందిని చంపగలను. నేనే పర మాత్మ, బలవంతుడను, భోగిని, సిద్ధుడను, సుఖిని, ధనవంతు డను. నాతో సమాను డెవ్వడును త్రిలోకముల యందును లేడని యుబ్బుచుందురు. ప్రపంచమునందు కీర్తి కొరకు యజ్ఞ దాన, తపంబుల చేయుచుందురు. మోహజాలమున చిక్కి పర్వాదా పాప కార్యముల నొనర్చుచుందురు.

అర్జు:— అట్టి వారికి శిక్ష లేదా? మాధవా!

కృష్ణ:— ఘోరనరకమున దీర్ఘ కాలము పడియుందురు.

అర్జు:—వీరు యజ్ఞ, దాన, తపంబుల చేసినవారు. వీరి నేల పవిత్రుల చేయకున్నావు?

కృష్ణ:— సర్వము తమకే తెలియునని మహాత్ముల నిరాకరించి శాస్త్ర వ్యతిరేకముగా యజ్ఞములు చేయుదురు. తా మొనర్పిన క్రతువులను పదిమందిలో జెప్పి తమ్ము దామే పొగడుకొందురు. కీర్తిని వాంఛించి డంబము కొరకై మంచి కార్యములు చేయుదురు. అహంకార, గర్వ, బల, దర్ప, కామ, క్రోధ యీ దుర్గుణములకు వారి హృదయములే స్థానములు. సర్వ భూతాంతర్యామి యగు నన్నెరుంగక కొందరు నన్ను శత్రువునిగా భావించి ద్వేషింతురు. పర శ్రేయస్సును గాంచి సహింపరు. పరులయందు లేని తప్పులను ప్రచార మొనర్చుటలో దీక్ష నహింతురు.

అర్జు:—నీవు సర్వ సముడవు గదా! అసురుల గుణములు దెల్పు నప్పుడు రౌద్రాకారము ధరింతు వేల?

కృష్ణ:— ఔను; వారిపై నాకాగ్రహ మధికము. వారు క్రూరాత్ములు. నా యాజ్ఞల నుల్లంఘించుటచే నాకు శత్రువులు. యిట్టి నీచుల నెల్లప్పుడును నికృష్ట జన్మ యందే అణచి యుంచెదను. జనన, మరణ సంసారమున మరల, మరల తిరుగునట్లు చేయుచుందును.

అర్జు:— సర్వ వ్యాపకా! అట్టి వారికి సద్గతి లేదా?

కృష్ణ:— లేదు; వారు మరల, మరల నీచ జన్మల

నెత్తుచూ నన్నెన్నటికిని పొందజాలరు. అట్టి వారు అధోగతి పాలగుదురు.

అర్జు:— పై గుణములలో ముఖ్యమయిన గుణములను ఏవి వదలవలయును?

కృష్ణ:— కోరిక యనెడి కామము తన సౌఖ్యము చూచుకొని ఎదుట వారిని పాడుచేయుటయే క్రోధము. తను పెట్టక ఎదుట వారిని పెట్టనివ్వక చేసెడు గుణమే లోభి. యీ మూడు గుణములు ఆత్మజ్ఞానమును నాశనము చేయునట్టివి. యివియే నరకమునకు ద్వారములు. కాన వాటిని త్యజింపవలెను.

అర్జు:— వాటిని త్యజించిన వారికి గలుగు ఫల మేది?

కృష్ణ:– నిర్మల మయిన మనస్సు ఔను, చంచల మే మాత్రము యుండదు. అపరోక్షజ్ఞాన మనే అనుభవ జ్ఞానము చక్కగా వృద్ధియై మోక్ష మొందును. అనగా మనస్సు జాగ్రత, స్వప్న, సుషుప్తులలో గాని విషయేంద్రియములందు గాని యింద్రియములందు గాని వాటి వ్యాపారములందు గాని స్థూలాంగ శరీరములో గలుగు బాధలయందు గాని సుఖముల యందు గాని మనస్సు చలించక సదా నిశ్చలముగా యుండుటయే మోక్షము.

అర్జు:- కర్తవ్యా కర్తవ్యముల నెరుంగు టెట్లు?

కృష్ణ:- అందులకు శాస్త్రములే ప్రమాణములు.

అర్జు:- శాస్త్ర విధిని తిరస్కరించి స్వేచ్ఛగా చరించిన వా రేమగుదురు?

కృష్ణ:- అట్లు చరించు వారికి శిద్ధి గలుగదు. మనస్సుకు సుఖము, మోక్షప్రాప్తిన్నీ గూడా లేదు. గాన శాస్త్ర విధి నెరింగి కర్మ చేయుటకు నీవు తగుదువు.



# శ్రద్ధాత్రయ విభాగ యోగము.

## పదునేడవ యధ్యాయము

అర్జు:- శాస్త్ర విధి నెరుంగక పోయినను శ్రద్ధ గలిగి పూజల నొనర్చిన ఫల మేమి?

కృష్ణ:- శ్రద్ధ గలవానికి ఫలము నొసంగుదును.

అర్జు:- శ్రద్ధ యెన్ని రకములు?

కృష్ణ:- స్వాత్విక, రాజస, తామసము లని మూడు విధములు.

అర్జు:- యీ మూడు విధము లెట్లేర్పడినవి?

కృష్ణ:- పూర్వ జన్మ సంస్కారము వలన ఏర్పడినవి.

అర్జు:- త్రి విధములగు శ్రద్ధలను విపులముగా వినగోరు చున్నాను; తెలవిండు.

కృష్ణ:- భూత కాలములో చేశిన పాపమో, పుణ్యమో ఆ సంచితమును బట్టి శ్రద్ధ లేర్పడును.

అర్జు:- అదెట్లు తెలియును?

కృష్ణ:- యీవర్తమాన కాలములో వారు చేయు పూజా క్రిమమును బట్టి తెలిసికొనవచ్చును. సత్వగుణ ప్రధా లు నిరంజనుడైన పరమాత్మను వారి విభూతిధారణ యనే

అధ్యాత్మ దేవతలను సేవించెదరు. రజోగుణము వారు యక్ష పితృ దేవతలను ప్రార్థించెదరు. తమోగుణము వారు భూతము లను, పిశాచములను ప్రార్థించెదరు. అనగా సాత్వికులు సాధన చతుష్టయములతో అష్టాంగ యోగములతో ఆసన శిద్ధిపొంది ఆసనచే యోగము శిద్ధిపొంది యోగముచే మంత్రము శిద్ధి పొంది మంత్రముచే మనస్సు శిద్ధి పొంది శిద్ధి యనే సుజ్ఞా నముతో సహాకార మనే దృక్ త్రికూటమునందు నిలిపి చూపు లోచూపు జూచుచూ నాయొక్క వినోదమైన పరబ్రహ్మను దర్శించుచు నా లీల లనే అధ్యాత్మ దేవతలను ప్రార్థించు చున్నారు. రాజసులు కోరికలే యక్షులు. అజ్ఞానవృత్తులే రాక్షసులు. చంచలములే పితృ దేవతలు. వాటి వాటి అను భవము ప్రకారము అనుభవించుటయే వాటిని పూజించుట. తామసులు లోక వాసనలో ఐక్యమై అందరిని బెదరించుచు స్థూలాంగ మనే శరీరము పోషించుటకై వేష భాషలు ధరించి డాంభిక మనే భూతమును మూర్ఖ మనే ప్రేతమును అశ్రద్ధ యనే పిశాచమును యీ మూడింటియొక్క అనుభవములతో అనుభవించుటయే వాటిని ప్రార్థించుట.

అర్జు:— ఆరాధనలు నీకే చెందునని యిదివరలో చెప్పి తిరి. భూత ప్రేతాదులను పూజించిననూ నిన్ను సేవించు నట్లే గదా?

కృష్ణ:— తామసులు అధ్యాత్మ దేవతలను పూజింపక

వాటిని తిరస్కరించుటయే హింస. డంభా అహంకారముల తోను కామ రాగ బలములతోను శాస్త్రముల నుల్లంఘించి వ్యర్థోపవాసముల చేశి యింద్రియములను శుష్కింప చేశి భయంకరమైన తపస్సులచే నన్ను హింసించుచున్నారు. వీరు అసుర ప్రవృత్తి గలవారని యెరుంగుము.

అర్జు:- వారి యాహారము లెట్టివో తెల్పుము.

కృష్ణ:- ఆయు వనే సత్వ గుణమును, జ్ఞాన బలమును, మనస్సు చలనము లేక యుండుటయే ఆరోగ్యము. మనస్సు జ్ఞానవృత్తులలో ప్రవేశించక యుండుటయే సుఖము. మనస్సు భగవంతుని యందు లగ్నమగుటయే ప్రీతిని కలుగ చేయు ఆహారము యిదియే సాత్వికాహారము.

అర్జు:- రాజ సాహార మెట్టిది?

కృష్ణ:- ఆరు రసములచే గలిగెడు యాహారమే రాజ సాహారము. యిది దుఃఖమును, రోగమును గలుగ చేయును.

అర్జు:- తామ సాహార మన నెట్టిది?

కృష్ణ:- పచనము చేశి చల్లారినది, రసము లేనిది, కుళ్ళి దుర్గంధము నిచ్చునదియు అపవిత్ర మయినదియే తామ సాహారము. దీనివలన మూర్ఖము కలుగును.

అర్జు:- యజ్ఞము లెన్ని విధములు?

కృష్ణ:- యజ్ఞములు మూడు విధములు.

అర్జు:- అవి యెట్టివో తెల్పుము.

కృష్ణ:— కోరికలులేక దృఢబుద్ధితో యజ్ఞము చేయుట సాత్వికం. కోరికలతో, డంభముతో చేయు యజ్ఞము రాజసము. శాస్త్రమును తిరస్కరించి మంత్ర తంత్ర దక్షిణ అన్నదానము లేక చేయు యజ్ఞములు తామసము.

అర్జు:— శాస్త్రోక్తముగా యజ్ఞ, దాన, తపంబులు చేయుమంటివి. వాటి నెట్లు చేయుట?

కృష్ణ:— ఓంకార స్వరూపమే తురీయమునకు అతీతమయినది. షడ్వికారములు లేనిది స్త్రీ గాదు, పురుషుడు గాడు, నపుంసకుడు గాడు. జనన మరణములున్ను లేవు రేయింబగళ్ళున్ను లేవు. దియే పరబ్రహ్మ స్వరూపము. బ్రహ్మజ్ఞానమే బ్రాహ్మణులు. ఓం తత్ సత్తని ప్రారంభించి యజ్ఞములు, దానములు, ముముక్షువులు నిష్కామముగా యజ్ఞ, దాన, తపంబులు చేయునపుడు తత్ అని ప్రారంభించవలెను. పరబ్రహ్మ ధ్యాన మొనర్చునపుడు సత్ ని ప్రారంభించవలెను. యజ్ఞము నందు, దానము నందు, తపస్సు నందు, నిష్కామ కర్మల యందు సత్ యను మంత్రము నుపయోగించవచ్చును. శ్రద్ధ లేక చేయబడు హోమములు, దానములు, తపస్సులు అసత్ యని చెప్పబడును. అవి యిహపరముల యందు సుఖము నియ్య జాలవు.

---

# మోక్ష సన్యాస యోగము.



## పదునెనిమిదవ యధ్యాయము

అర్జు:— మాధవా॥ సన్యాస త్యాగ యర్థముల వేరు వేరు బోధింపుము.

కృష్ణ:— కోరికలు వదలి గుణ సంఘమును వదలుటయే సన్యాసము.

అర్జు:— కర్మను వదలిన గాని జ్ఞానము శిద్ధించదనెదరే! అదెట్లు?

కృష్ణ:— ఏ కర్మలను వదలవలయునో వేటిని ఆచరించవలెనో చెప్పుచున్నాను. జ్ఞానేంద్రియముల యందున్ను, కర్మేంద్రియముల యందున్ను, పంచతన్మాత్రల యందున్ను మనస్సు ఒకటి మొత్తం 16 వీటిని ఆచరణలో పెట్టుటయే కర్మలను వదలుట. బుద్ధియే తెలివి, యిదియే వేదము. యీ వేదముచే తెలిసికొనుటయే జ్ఞానము. యింద్రియములన్నియు ఆచరణ పెట్టుటయే కర్మ యోగము. ఆచరించిన దానిని అనాచారముల బోనివ్వక యీ రెండింటి సంయోగముచేత కలిగినదియే భక్తి యోగము.

అర్జు:— త్యాగము లెన్ని రకములు?

కృష్ణ: మూడు రకములు.

అర్జు:- ఆ మూడు రకము లెట్టివో తెల్పుము?

కృష్ణ:- శాస్త్రము నతిక్రమించి నడచుటయే తామస త్యాగమని పేరు. శీతోష్ణద్వంద్వాదులుచే సత్కర్మములను వదలుటయే రాజసత్యాగము అది కేవలము సోమరితనము దీని వలన జన్మవృథా.

అర్జు:- సాత్త్విక త్యాగ మెట్టిదో సెలవిండు?

కృష్ణ:- కోరికలు లేక మనస్సు నిశ్చింతతో యుండి శాస్త్రోక్తముగా కర్మల చేయుటయే సాత్త్విక యోగము. అనగా సాధన చతుష్టయములు నాల్గున్ను అష్టాంగయోగ ములు ఎనిమిదిన్ని యివియే శాస్త్రోక్తము.

అర్జు:- సాత్త్విక త్యాగి యెట్లుండును?

కృష్ణ:- సర్వ సంశయములు ఛేదించి సత్కర్మల చేయుచు వాటి యందు గలిగెడు కష్ట సుఖములకు సమానుడై యుండును.

అర్జు:- కర్మ ఫలము లెన్ని విధములు?

కృష్ణ:- ప్రియము, అప్రియము లని రెండు.

అర్జు:-సకామ కర్మలు చేయువారికిని నిష్కామకర్మలు చేయు వారికిని భేదమేమి?

కృష్ణ:- సకామి కోరిక చేరి చేయు కర్మయే సకామ కర్మ. యీ కోరికలు అనుభవించుటకే జన్మ నెత్తుచున్నాడు. నిష్కామికి కోరిక లేదు; జన్మ లేదు.

అర్జు:— మాధవా! కర్మ ఏవిధముగా సంప్రాప్తించును?

కృష్ణ:— పౌరుషముచే సంప్రాప్తించును.

అర్జు:— పుండరీకాక్షా! కర్మ జీవుడే సంపాదించుచున్నాడు గాని యితరులచే గాదు.

కృష్ణ:— అవును; దైవ మొనర్చున దేదియును లేదు. జీవుని యొక్క సంకల్పముచే సంపాదించుటయే గాని మరి యొకటి కాదు.

అర్జు:— నీవు బోధించునటుల నిష్కామకర్మ వలన ప్రయోజన మేమి?

కృష్ణ:— దైవ మనునదియే కర్మ. యీకర్మయేమనస్సు యీ మనసే పురుషుడు. అందువలన పురుషాకారము కంటె వేరొకటి లేదని తేలుచున్నది.

అర్జు:- శుభములు, అశుభములు కర్మచేతనా లేక దైవము చేతనా కలుగుట.

కృష్ణ:— కర్మ ఫలము లభింప నాకిట్టి బుద్ధి కలిగినది. యిట్లు నిశ్చయించుకొంటిని. యిట్టి ఫలము లభించినది. యీ మాటయే దైవ కల్పనకు మూలము.

అర్జు:— కర్మ విధు లెవ్వి? కర్మ సంగ్రహ మన నేమి?

కృష్ణ:— జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత యను మూడు విధములు. యివియే కర్మ విధులు.

అర్జు:— కర్మ సంగ్రహము లెట్టివి?

కృష్ణ:- కర్మము, కరణము, కర్త యని 3 విధములు.

అర్జు:- కర్మలు మూడు విధము లంటిరే; అవి యెట్టివి?

కృష్ణ:- ఒకటి శాస్త్ర సమ్మతమైన కర్మ, సాత్వికము యిదియే నిష్కామము. రెండు ఫలాపేక్షతో చేయబడు కర్మ రాజసము. మూడు యితరులకు గలుగు కష్టములను గుర్తించక తన శక్తిని గుర్తించక భ్రమచే చేయబడు కర్మలు తామసము.

అర్జు:- కర్తలు యనునవి ఏవి?

కృష్ణ:- కష్ట సుఖములకు సమానదృష్టికలవాడు సాత్విక గుణ కర్త. బహిర్మాచే కర్మలు చేయుచు లోభియై పరులను బాధించువాడు రాజస గుణ కర్త. నిమిషము, చింత, మరు నిమిషము సంతోషము, అజ్ఞానమును సోమరితనము, మోసము అసూయ మొ॥ దుర్గుణములు గలవాడు తామస గుణ కర్త.

అర్జు:- గుణ యుక్తు లన నెట్టివి? మాధవా!

కృష్ణ:- యిది పాపము, యిది పుణ్యము యని తెలిసి కొను బుద్ధి సాత్వికము. ధర్మమునకు వ్యతిరేకమయిన వాదన రాజసము. ధర్మమును అధర్మముగా చేయు బుద్ధి తామసము. యిదెల్లప్పుడు జ్ఞాన మెక్కువై మూర్ఖముతో కలిగియుండును.

అర్జు:- ధైర్యములు మూడు రకము లంటిరే అవెట్టివి?

కృష్ణ:- మనస్సును ధర్మమునందు నిశ్చలముగా నిలుపుట సాత్వికధైర్యము. ధన, ధాన్యములయందు కోరికలు వృద్ధి

నొందుట రాజసధైర్యము. నిద్ర, భయము, దుఃఖము, చింత, మదము గలుగుట తామసధైర్యము.

అర్జు:- సుఖము మూడు విధము లన నెట్టివి?

కృష్ణ:- 1. ప్రథమములో విషము వలెనూ, రానురాను అమృతము, ఆనందము వలెనూ పరిణమించునది సాత్త్విక సుఖము. అదియే ఆత్మజ్ఞానమును కలుగజేయును. 2. విషయేంద్రియములకు మొదట అమృతము గనూ రాను రాను విషముగ మారినదే రాజస సుఖము. 3. ప్రారంభము నందునూ అంత్యము నందునూ అజ్ఞానము కలిగించి నిద్రాలస్య ప్రమాదములు గలిగించునది తామస సుఖము.

అర్జు:- పై మూడు గుణములను దాటిన వారెవరైన నున్నారా?

కృష్ణ:- యీ మూడు గుణములను దాటినవారెచ్చటను లేరు. గుణములను బట్టియే నాల్గు జాతు లేర్పడినవి.

అర్జు:- ఏవిధముగ నేర్పడినవో తెల్పుము.

కృష్ణ:- చెప్పుచున్నాను వినుము. బ్రాహ్మణకర్మ మెట్టిదనగా: శమము అనగా శ్రోత్రములు, త్వక్, చక్షు, జింహ్వా యివియే జ్ఞానేంద్రియములు. వీటిచే ఇంద్రియములను శ్రోత్రములయందు దశ నాదములు వినుటయే బ్రహ్మజ్ఞానము. త్వక్ బాహ్యేంద్రియములందున్న పరిమళములతో గూడక విభూతి ధారణ చేయుటయే బ్రహ్మజ్ఞానము. చక్షు జ్ఞాన మనే నేత్ర

ములతో బింబదర్శనము చేయుటయే బ్రహ్మజ్ఞానము. జింహ్వా లోకవాసన వృత్తులను సంభాషించక బ్రహ్మజ్ఞాన వృత్తులను సంభాషించుటయే బ్రిహ్మజ్ఞానము. ఘ్రాణ, పుష్ప, చందన పరిమళాదుల వాసనలు జూడక ప్రాణాయామములు చేయుటయే బ్రహ్మజ్ఞానము. యీ ప్రకారము ఎవరు చేయుచుండిరో వారే బ్రాహ్మణులు. దమము అనగా మనస్సు చంచలము లేక నిశ్చలముగా యుంచుటయే బ్రహ్మజ్ఞానము. బుద్ధి విపరీత వృత్తులకు పోనీయక జ్ఞానవృత్తులలో సదా యుంచుటయే బ్రిహ్మజ్ఞానము. చిత్తము సంకల్పము నందు చేర్చక నిశ్చింతగా యుంచుటయే బ్రహ్మజ్ఞానము. అహంకారము నేనని పలుకుచున్నదియే అహం. అన్ని పనులయందు యిమిడి తాండవ మాడుచున్నదియే అహం. దీనిని మొలక లేక యుండునటుల చేయుటయే బ్రిహ్మజ్ఞానము. వీటి పేరు అంతరింద్రియములు. తపస్సు వాసనవృత్తులు లేక బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన వృత్తు లేవియో అనగా భజనలు చేయుట, పరమాత్మని నామముతో నృత్యము చేయుట, దైవ చింతన చేయుట సాధు సత్సంగత్వము చేయుట, తత్వవిచారణ చేయుట, జపములు చేయుట, యీవృత్తు లన్నియు తపస్సునకు పేర్లు. యిట్లు చేయుటయే బ్రిహ్మజ్ఞానము. అంతరేంద్రియములు 4, పంచ ప్రాణములు 5, జ్ఞానేంద్రియములు 5, పంచ తన్మాత్రలు 5, కర్మేంద్రియములు 5. యీ 24 తత్వములను చలనము లేక ఏ ఏ యింద్రియములను ఏ ఏ విధముగా ఆచరణలో పెట్ట

వలెనో దానిని గురువుల ద్వారా గుర్తెరింగి దానిని ఆచరించుటయే శౌచము. యిదియే బ్రహ్మజ్ఞానము. ఓర్పు యనగా కాలము ననుసరించి వర్తించుటయే జ్ఞానోర్పు. నిష్కాపట్య మనగా సదా వాసనవృత్తుల యందు మనస్సును పోనివ్వక బ్రహ్మ విచారణ యుండుటయే నిష్కాపట్యము. యిదియే బ్రహ్మజ్ఞానము. జ్ఞాత, జ్ఞేయ, జ్ఞానము పంచీకరణ ప్రకారము ఆకాశమునకు సమిష్టి భూతము. జ్ఞాత యనగా తెలివి. జ్ఞేయ మనగా తెలిసికోతగినది, జ్ఞాన మనగా తెలుసుకొన్న దానిని ఆచరణలో పెట్టుట. ఈగుణము లున్నవారు బ్రహ్మజ్ఞానము కలిగిన బ్రాహ్మణులు.

అర్జు:- క్షత్రియుల ధర్మము లెట్టివో తెల్పుము.

కృష్ణ:- అజ్ఞానమనే అధర్మమందు వైరాగ్యము బూనుటయే సూరత్యము. ధర్మ మనే సత్యమునందు అయిక్య మయిన మనస్సు తేజస్సు. జీవుడు స్థూలమునుదాటి సూక్ష్మాంగము దాటి కారణాంగములో ఐక్య మగుటయే ధైర్యము. అష్టాంగ యోగము లనగా యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, సమాధి, తురీయము. యివి గాక నిత్యానిత్య వస్తు వివేకము, యిహా మూతార్థ ఫల భోగ విరాగము, శమాది షట్కర్మసంపత్తి మోక్షేచ్ఛ యివి సాధన చతుష్టయములు. వీటి నిటుంచి పరమాత్మలో ఐక్యమయి యున్నవా డెవడో వాడే సమర్థుడు. యుద్ధమందు అనగా జ్ఞాన మనే రాజు అజ్ఞాన మనే సేనలతో

పోరాటమే యుద్ధం. ఆ యుద్ధమందు రాజు సేనకు లొంగకుండు టయే పారిపోకుండ యుండుట. సదా మనస్సు భగవంతుని యందు లగ్నమయియుండుటే దానము. జీవుని కమ్ముకొని యున్న శరీరముతో సహా పరమాత్మునిదే యీ శరీర మని నిష్కామముతోయుండుటే యీశ్వర భావము. యీగుణము లున్న వారే క్షత్రియులు.

అర్జు:— వైశ్యుల ధర్మము లెవ్వి?

కృష్ణ:— వ్యవసాయ మనగా సాంఖ్య విచారణ చేయు టయే వ్యవసాయము. అదియే గోరక్షణము. అనగా యింద్రియ ములే గోవులు. వీటిని ఆచరణ పెట్టుటయే గోరక్షణము. వ్యాపారము సదా బ్రహ్మ విచారణమైన తత్వ విచారణము చేయుటయే వ్యాపారము, యీ గుణము లున్న వారు కోమట్లు.

అర్జు:— శూద్రుల లక్షణము లెవ్వి?

కృష్ణ:— రజో గుణము, తమో గుణము, పంచ క్లేష ములు, సప్త అజ్ఞాన భూమికలు. యీ గుణములే శూద్రులు. వీరు అధోలోకములు ఏడు, ఊర్ధ్వ లోకములు ఏడు ఈ పదు నాల్గు భువనములు భూలోకము. ఈ లోకములో యున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య ఈ మూడు జాతుల వారికి జెప్ప బడిన ఈ శూద్రులు శేవలు చేయుచుండడమే వారి వృత్తులు.

అర్జు:— వృత్తు లనగా యెట్టివి?

కృష్ణ:— జ్ఞాన వృత్తులు చెప్పిన ప్రకారము అజ్ఞాన

వృత్తులు వినుటయే వారి శేవలు.

అర్జు:- కర్మల నెటుల జేయవలయును?

కృష్ణ:- అజ్ఞానమును వదలుటే సంఘమును వదలుట. మనస్సును నిష్కామములో నిలిపి ఆశనొదిలి నైష్కర్మ్య శిద్ధిని బొందుచున్నాడు.

అర్జు:- నైష్కర్మ్య శిద్ధియే జ్ఞానమా?

కృష్ణ:- నైష్కర్మ్య శిద్ధి జ్ఞానమునకు మార్గము. పర బ్రహ్మను బొందుటే జ్ఞానము.

అర్జు:- అట్టి జ్ఞానము నాకు బోధించుము.

కృష్ణ:- సత్వ గుణముతోను చంచల వికారము లేక బోవుటే ధైర్యము తోడను శబ్దాది విషయములను రాగ ద్వేషములను వదలి మనస్సును నిగ్రహింపవలెను.

అర్జు:- అంతే చాలునా? బ్రహ్మ విద్యాధికారి యగు టకు అనుష్టింపదగిన నియమము లింకనూ గలవా?

కృష్ణ:- యింకనూ గలవు. మనస్సును చంచలము లేక నిశ్చింతగా యుండడమే ఏకాంతస్థలము. రెండు భాగ ములు భోజనం ఒకభాగం జలము నాల్గవ భాగము వాయువు సంచారము జేయుటకు వదలవలయును. మనో వాక్కాయము లనగా మనస్సును అజ్ఞానవృత్తులకు పోనీయకుండా నియమింప వలయును. వాక్కును వాసనత్రయములలో నున్న పదార్థ ములను నుచ్ఛరించక సదా భగవంతుని స్మరించేలాగున నియ

మింప వలయును. కాయము అనగా శరీరము. ఈ శరీరమునకు భోగము యనే సుఖమును అలవాటు జేయక నియమింప వలయును. పూర్ణ వైరాగ్యముతో కష్ట సుఖముల యందు భోగములయందు ఏది వచ్చినా చంచలము లేక సదా నిష్కామము తో భగవంతునియందు మనస్సు లగ్నమై యుండడమే పూర్ణ వైరాగ్యము, అహంకారము, షడ్గుణ వికారములు, పంచక్లేశములు, ఈషణత్రియములు వీటిని దూరముగా వదలిబెట్ట వలయును. అహం, మమ ఉండగూడదు. సదా శాంత మనస్కుడై మెలగవలయును. యిట్టివాడు బ్రహ్మ విద్యకు అర్హుడగు చున్నాడు.

అర్జు:— బ్రహ్మ విద్య ననుభవమునకు దెచ్చుకొనిన బ్రిహ్మ నిష్టుని లక్షణము లెవ్వి?

కృష్ణ:— బ్రహ్మ నిష్టుడు ద్వంద్వముల యెడ హర్ష శోకముల నొందక సమానదృష్టిచే యుండును. ఆశలను నిర్మూలించి సదా భగవంతుని భక్తి గలవాడై నన్ను సేవించుచుండును.

అర్జు:— ఇంతకు నన్నేమి చేయమందువు?

కృష్ణ:— జ్ఞాన యోగము నాశ్రయించి నిమిత్తమాత్రుడవై కర్మలు జేయుము. నాయందే మనస్సును స్థిరముగా నుంచుము.

అర్జు:— నీయందు మనస్సు నిలిపిన ఫలమేమి?

కృష్ణ:— నా యనుగ్రహము గలుగును.

అర్జు:— నీ మాటలు నమ్మక అట్లొనర్పక పోయిన ఏమి అగును.

కృష్ణ:— అహంకారముచే నా మాటలను విశ్వసించని యెడల నాశనము నొందును.

అర్జు:— యింతకు నన్నేమి చేయమని యాజ్ఞాపింతువు?

కృష్ణ:— పరమరహస్యమగు జ్ఞానమును నీకు బోధించితిని. దానిని సంపూర్ణముగా విచారించుటకు వలయు సద్వివేకమును ప్రసాదించితిని. దీనిని విమర్శించి నీయిష్టప్రకారము జేయుము.

అర్జు:— గీతోపదేశము నింతటితో మానెదవా? ఇంక నూ వినవలయునను కుతూహలము కలుగుచున్నది.

కృష్ణ:— ఎంతని బోధింతును; అయినను నీవు నాకిష్టుడవు గాన మిక్కిలి రహస్యమైన యంశమును మరల బోధింతును; వినుము.

అర్జు: నీవు బోధించిన జ్ఞానము నితరులకు జెప్పవచ్చా?

కృష్ణ:— తపస్సు, స్మరణ, భక్తి లేని వారికిని నా చరిత్రలు వినుట కిష్టము లేని వానికిని నన్ను ద్వేషించువారికిని ఎన్నడును చెప్పగూడదు.

అర్జు:— భక్తి గల వారి కిది చెప్పవచ్చునా?

కృష్ణ:— భక్తి గలిగిన వారి కుపదేశించుట వలన నా యనుగ్రహమునకు పాత్రుడవు కాగలవు.

అర్జు:— ప్రతి దినమును మన సంవాద రూపమును గీతా శాస్త్రము పారాయణ జేయు వానికి ఫలము గల్గునా?

కృష్ణ:- అట్టి వాడు జ్ఞాన యజ్ఞముచేత నన్నారాధించు వాడగునని నా నిశ్చితాభిప్రాయము.

అర్జు:— నా సందేహము లన్నియు నంతరించినవి. జ్ఞాన ముదయించినది. నీ యాజ్ఞను శిరసా వహించెదను.

సంజ:- బుద్ధి యనే సంజయుడు లోభ గుణ మనే ధృత రాష్ట్రునితో అద్భుత మైనట్టియు అపరోక్షజ్ఞాన మనే శ్రీకృష్ణ పరమాత్ముడును జీవుడనే అర్జునునకు గల్గిన సంవాదమును వింటిని.

ధృత:— లోభ గుణ మనే ధృతరాష్ట్రుడు చరాచరాత్మ మును అనగా అధోలోకములు ఏడు, ఊర్ధ్వలోకములు ఏడు మొత్తము పదునాల్గు భువనములు. మూడు లోకములు ఆధారము లగాయితు స్వాధిష్టానము వరకు బ్రహ్మస్థానము. స్వాధిష్ట లగాయితు అనాహత వరకు పితృలోకము. అనాహత లగాయితు సహస్రారము వరకు స్వర్గలోకము. యీ లోకములు, భువనములు, సప్త సముద్రములు, సప్త ద్వీపములు ఇవన్నింటిని కమ్ముకొని యున్న త్వక్ అనగా చర్మము. ఇదే స్థూలాంగ మందురు. యీ స్థూలాంగమునే అండ మందురు. సూక్ష్మాంగమునే పిండమందురు. కారణాంగమే బ్రహ్మాండము. యీమూడింటికిని సద్గురుని యనుగ్రహమే గదా!

సంజ:- అవును. నేత్రములకు కనబడనివాడు, చేతికి అందనివాడు, యింద్రియములకు లొంగనివాడు, నామరూపము లేనివాడు, జనన మరణము లేనివాడు, రోగములు లేనివాడు అకలి దప్పులు లేనివాడు, మోహభ్రాంతి లేనివాడు, యిండ్లు స్థలము లేనివాడు, కుల గోత్రాదులు లేనివాడు, ఎచ్చటజూచి నను నిండీకృతుండై వెలుగుచున్నవాడు, రాత్రి లేదు, పగలు లేదు, ఎండ లేదు, వర్షము లేదు, చలి లేదు, గాలి లేదు, ఋచులు లేవు, భోగములు లేవు, స్త్రీ గాదు, పురుషుడు గాడు ఓ లోభ గుణ మనే దృతరాష్ట్ర మహారాజా! ఆ విరాధారుడు పంచ భూతములకు అతీతుడు పంచ భూతములకు గురువు. పంచ భూతములచే గలిగిన జీవుడే అర్జునునకు ఆపరమాత్మకు గలిగిన సంవాదమును విని బ్రహ్మానంద మనే సముద్రములో మునుగుచున్నాను. ఆ సంవాదమును మరల మరల స్మరించుచూ యానందించుచున్నాను. యీ సంవాదమును విను భాగ్యమే గాక విశ్వరూపమును గూడ దర్శించితిని. ఆ విశ్వరూపమును స్మరించి స్మరించి ఆశ్చర్య సముద్రములో మునుగుచున్నాను.

దృత:- బుద్ధి యను సంజయా! అజ్ఞానవృత్తుల యందు బుద్ధిని బోనియ్యక జ్ఞానవృత్తులయందు చలనము లేక బుద్ధిని నిలుపుటయే దివ్యదృష్టి. జ్ఞానైశ్వర్యము గలిగిన వాడా! జయము అజ్ఞానవృత్తు లయిన నా పుత్రులకు గలుగునా?

సంజ:— లోభ గుణమనే దృతరాష్ట్ర మహా రాజా! నీ సతియైన ఎడమ కంటి నుండి హృదయము వరకు గాంధారి యనెడు నాడి యున్నది. దీని పేరే గాంధారి. ఆ గాంధారికి నూరుగురు పుత్రులు, ఒక కుమార్తెయని చెప్పితిరే వా రెవ రనగా హృదయము ననుసరించి నూట ఒకటి నాడు లుండుట చే గాంధారికి నూరుగురు పుత్రులు, ఒక పుత్రిక యని నిరూ పించెను. పాఠకుల సందేహ మేమనగా గాంధారి కన్నుల నెందుచే గట్టుకొన వలెనని గాంధారి నాడి కంటి యందున్న దని గోచరించుటకు స్ఫురతి. యిదిన్నీ గాక గాంధారి భర్త దృతరాష్ట్రుడు పుట్టు గృడ్డి యని కల్పించి గాంధారి యొక్క కన్నులగట్టెను. అది ఏవిధమనగా లోభగుణమే గుడ్డియని భావము. యిదియునుగాక నీపుత్రుడైన క్రోధగుణమే దుర్యోధనుడు తల్లియైన సత్వగుణముతో గూడిన గాంధారిని చూచి ఓజననీ జ్ఞానవృత్తులయిన పాండవులపై బ్రహ్మవిచారణ చేయుటయే యుద్ధము చేయుటకు శలవిమ్ము యని కోరగా ఓపుత్రా! తురీయమునకు అతీతమయినది సత్యము. అండపిండ బ్రహ్మాండములకు పదునాల్గు భువనములును మూడులోక ములకు చరాచరాత్మకు ఎనుబది నాల్గులక్షల జీవులకునూ, సత్యమనే మాతృ దేవత గాన ఆసత్యమే ధర్మము. ఆధర్మమే సత్యము. యీధర్మమును సత్యమును ఏచోటనున్నదో ఆచో టనే జయము తప్పదు. సత్యమే శ్రీకృష్ణుడు ధర్మమే అర్జునుడు వీరిద్దరూ యున్నచోట తప్పక ముమ్మాటికి జయము కలుగును

జ్ఞానైశ్వర్యమనే సంపదలుండును. అవి క్రోధగుణమనే దుర్యో
ధనునకు సత్వగుణమనే గాంధారి తల్లి చెప్పెను. ఓలోభగుణ
మనే దృతరాష్ట్ర మహారాజా! యితి శ్రీమన్మహాభారతే
శ్రీమత్ భీష్మ పర్వాణి శ్రీమత్ భగవద్గీత సూపనిషత్
బ్రహ్మ విద్యాయాం యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
మోక్ష సన్యాసయోగో నామ అష్టదశోధ్యాయః

శ్రీకృష్ణార్పితమస్తు

ఓం తత్ సత్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము.

